
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120036153

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

**http://www.new.dli.ernet.in**



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

సరంజక గ్రంథావళి - 6

# వ్యాపారము - సామాజిక బాధ్యతలు

రచయిత

ఆచార్య ఎం. గంగాధరరావు

బి. కాం. (ఆనర్స్), ఎం.కాం., పిహెచ్.డి.,

డిపార్ట్‌మెంట్ ఆఫ్ కామర్స్ & బిజినెస్ అడ్మినిస్ట్రేషన్

ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, విశాఖపట్నం

తెలుగు అకాడమి

హైదరాబాదు

1984

# భూమిక

ఇంటర్మీడియట్, డిగ్రీ తరగతులకు అవసరమైన పాఠ్య పఠనీయ గ్రంథాలను, అనువాద వాఙ్మయాన్ని, మోనోగ్రాఫ్‌లను ఇంతవరకు తెలుగు అకాడమి ప్రచురించి విద్యార్థుల, అధ్యాపకుల, విద్యావేత్తల ఆదరాభిమానాలను విశేషంగా చూరగొన్నదని వేరే చెప్పనక్కర్లేదు. అయితే అంతటితో తన బాధ్యత తీరినట్లుగా అకాడమి భావించడంలేదు. కొత్తగా చదువు నేర్చుకొన్న వారికి, పాఠ్య ప్రణాళికలతో నియత విద్యారంగంతో (formal education field) సంబంధం లేకుండ జ్ఞానోపార్జన చేయదలచిన వారికి, విద్యార్థులకు, అధ్యాపకులకు ఈ జనరంజక గ్రంథావళి వల్ల ప్రయోజనముంటుందని భావిస్తున్నాము. నిత్య జీవితంలో సన్నిహిత సంబంధమున్న వివిధ శాస్త్రాంశాల విజ్ఞానాన్ని, సమకాలీన సమస్యల, పరిష్కారాల పరిజ్ఞానాన్ని అందరికి అందించే సదుద్దేశంతో, సరసమైన ధరలకు ఈ గ్రంథాలను వెలువరిస్తున్నాము. ప్రయోజనాత్మకమైన తెలుగు సదస్సు సిఫార్సుల మేరకు ఈ గ్రంథాల ప్రచురణను చేపట్టినాము. వివిధ రంగాలలో ప్రాయోగికానుభవంగల నిపుణులను రచయితలుగా ఎన్నుకొన్నాము. భాష సరళంగాను, అందరికి అర్థమయ్యే రీతిలోనూ, సాధ్యమైనంత తక్కువ సాంకేతిక పదజాలంతో ఉండేటట్లు రచించే ప్రయత్నం జరిగింది. అంతేకాకుండా ఇచ్చిన సమాచారము అధికారికంగా ఉండేటట్లు తగిన శ్రద్ధ తీసుకొన్నాము. ఈ గ్రంథాలు అందరి ఆదరాభిమానాలకు పాత్ర మౌతాయని ఆశిస్తున్నాము.

విమర్శకులు సహృదయంతో ఇచ్చే సూచనలను పునర్ముద్రణలో తప్పక పరిశీలించగలము.

# విషయసూచిక

# 1

# వ్యాపారము-స్వభావము-ముఖ్యోద్యేయాలు

నేడు వ్యాపార ప్రపంచంలో సామాజిక బాధ్యతలకు అత్యంత ప్రాముఖ్యం ఉండడం గమనించదగ్గ విషయం దీని ప్రాముఖ్యం ఎంతగా విస్తృతం చెందిందంటే, అన్ని వర్గాలవారు దీని అవసరాన్ని సమర్థిస్తున్నారు. ఈ ''బాధ్యతలు'' ఈనాటివి కాకపోయినా, ఈ 20వ శతాబ్దంలో వాటికి గణనీయ మైన గుర్తింపు లభించినట్లు నిస్సందేహంగా చెప్పవచ్చు. అయితే వీటి గురించి విపులంగా తెలుసుకొనే ముందు, వ్యాపారాన్ని గురించి, వ్యాపార సంస్థల గురించి, వాటి పుట్టు పూర్వోత్తరాల గురించి తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉంది.

## వ్యాపార స్వభావం

వ్యాపారమనేది ఒక ఉత్పాదక ప్రక్రియ. దీనిచుట్టూ ఆర్థిక కార్యకలాపాలన్నీ వ్యాపించి ఉంటాయి. వ్యాపారంలో వస్తు, సేవల ఉత్పత్తి, వాటిని సమాజంలోని వ్యక్తులకు పంపిణీ చేయడం జరుగుతాయి. అంటే వ్యాపారం ముడి పదార్థాలను, తయారీ వస్తువులుగా మార్చి సమాజానికి ప్రయోజనకరంగా ఉండేటట్లు చూస్తుంది. ఈ ముడి పదార్థాలు, తయారీ వస్తువుల మారకం (Exchange) ''డబ్బు''(Money) వాడుకలోకి రావడంతో చాలా సులభమయింది. వాటి విలువలను డబ్బుతో నిర్ణయించడానికి అవకాశ మేర్పడింది. ధరలలో పెరుగుదల, తగ్గుదల, ఆయా వస్తువుల సరఫరా, డిమాండు మొదలైన ఆర్థిక కలాపాలనుబట్టి ఒక మార్కెట్‌కు, ఇంకో మార్కెట్‌కూ మారుతూ ఉంటాయి. కాని అన్ని ఉపయోగకర వస్తువులకు 'ధర' ఉండదు. ఉదాహరణకు గాలి, కొన్ని సందర్భాలలో నీరు మొదలైనవి. వీటికి ధర లేకపోయినా, ఇవి సమాజానికి ఎంతో ఉపయోగపడతాయి. అయితే ఇవి వ్యాపార పరిధిలోకి రావని గుర్తించవలె. వ్యాపారమనేది ఆర్థిక వ్యవస్థా

విధానానికి ఆచరణ రూపము. సమాజంలో ఆర్థిక వ్యవస్థా పరిధిలోకి రాని వ్యక్తులంటూ ఉండరు. అందుచేత వ్యాపారానికి సమాజంలోని ప్రతి వ్యక్తితోను సంబంధం ఉంటుంది. ప్రత్యేకీకరణ (Special.sation), శ్రామికవిభజన రావటంతో వస్తు, సేవలఉత్పత్తి ప్రత్యేకమైన పద్ధతులలో జరుగుతున్నది. వస్తు, సేవలనుభారీ ఎత్తునమార్పిడి చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది రవాణా, కమ్యూనికేషన్ లలో వచ్చే విప్లవం ఫలితంగా నేడు ప్రాంతాల దూరానికిగాని, కాల వ్యవధికిగాని తావులేదు. వాణిజ్య పరంగా ప్రపంచమంతా ఒక చిన్న భాగంగా మారిపోయింది. ఒక ప్రాంతంలో జరిగే మార్పు తక్షణమే తక్కిన ప్రాంతాలకు పాకి దాని ప్రభావాన్ని ప్రపంచమంతటా సులువుగా వ్యాపింప జేస్తుంది. ఒక దేశంలోని ధరలలో పెరుగుదలగాని, తరుగుదలగాని ఏర్పడితే దాని ప్రభావం ప్రపంచవ్యాప్తంగా ఉంటుంది. ప్రపంచంలోని వివిధ దేశాలు వర్తక సంబంధాలతో ముడిపడి ఉన్నాయి. అంతర్జాతీయ ద్రవ్య సంస్థ (Internationa Monetary Fund) ద్వారా ఆ సంబంధాలు మరింత బలపడినాయి

## భారీఎత్తు ఉత్పత్తి

శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం ఆధునిక వ్యాపారానికి ఆధారము. విపరీతంగా పెరుగుతున్న జనాభా అవసరాలను తీర్చడానికి భారీ ఎత్తున ఉత్పత్తి చేయవలసిన ఆవశ్యకత ఏర్పడింది. ఇందుకు భారీ సంస్థలు స్థాపితమైనాయి. స్వంత వ్యాపారసంస్థలు (Sole Trading Concerns) భాగస్వామ్య సంస్థలు (Partnership Firms) ఉత్పత్తిని భారీ ఎత్తున కొనసాగించలేవు. వాటికి చాలా పరిమితులున్నాయి. ముఖ్యంగా మూలధనం కొరత ఉంటుంది. మేనేజ్మెంట్ సామర్థ్యంకూడా తక్కువగా ఉంటుంది. సాంకేతిక పరిజ్ఞానాన్నిగాని, శ్రామిక విభజనను గాని ప్రవేశపెట్టడానికి వీలుండదు. ఇటువంటి పరిస్థితులలో ఈ లోపాలను అధిగమిస్తూ, ఉత్పత్తిని భారీ ఎత్తున చేపట్టడానికి కంపెనీ వ్యవస్థ ఏర్పడింది. కంపెనీ వ్యవస్థే ఇప్పుడు ప్రపంచమంతటాకూడా ప్రాధాన్యత వహిస్తున్నది. పారిశ్రామిక విప్లవానంతరం వచ్చే సాంకేతిక పరిజ్ఞాన ఫలితాలను కంపెనీలలో ప్రవేశపెట్టడం జరిగింది మేనేజ్మెంట్ సామర్థ్యం పెరగడానికి అవకాశమేర్పడింది. మూలధనం కావలసిన మేరకు పొందవచ్చు. శ్రామిక విభజనను ప్రవేశపెట్టి, శ్రామికుల ఉత్పాదకతను పెంచవచ్చు. ఉత్పత్తి సామర్థ్యంతో వ్యయాలను తగ్గించి, లాభాలను ఆర్జించవచ్చు. దీనివల్ల రోజు

రోజుకూ ఒకపక్క స్వంతవ్యాపారం, భాగస్వామ్య సంస్థల సంఖ్య తగ్గిపోతూ ఉంటే, వేరొకపక్క కంపెనీ వ్యవస్థ ముందంజ వేస్తున్నది. అయితే కంపెనీ వ్యవస్థలో ఒక ముఖ్య లక్షణమేమిటంటే, యాజమాన్యం (Ownership). మేనేజ్‌మెంట్ (Management) వేరు వేరుగా ఉంటాయి.

## మేనేజ్‌మెంట్

మేనేజ్‌మెంట్ లో చాలా మార్పులు వచ్చినాయి. యజమానులే (Owners) మేనేజర్లుగా ఉంటూవచ్చిన వ్యాపార సంస్థలలో ప్రస్తుతం ఒక కొత్త వర్గానికి చెందిన వ్యక్తులు మేనేజ్‌మెంట్ బాధ్యత నిర్వర్తిస్తున్నారు. కంపెనీలో మూలధనం పెట్టే వాటాదారులు కంపెనీని నియంత్రించే అధికారాన్ని కోల్పోతున్నారు. వాటాదారులకు, మేనేజ్‌మెంట్ వర్గానికి మధ్య "అగాధం" (Gap) పెరుగుతూ ఉంది. క్రమంగా ఈ వాటాదార్లు మేనేజ్‌మెంట్ వ్యక్తుల దయా దాక్షిణ్యాలపై ఆధారపడవలసి వస్తున్నది. కంపెనీపైన వాటాదారులకుండే నియంత్రణాధికారం కేవలం ఒక "భ్రమే" అయింది. యథార్థానికి అధికారమంతా మేనేజ్‌మెంట్ వ్యక్తుల చేతులలోనే ఉంటుంది.

## విభిన్న శక్తులు

కంపెనీ వ్యవస్థలోని సిబ్బంది, వారి ఆసక్తులను (Interests) పరిరక్షించుకోడానికి సంఘాలుగా ఏర్పడడం ఈమధ్య వచ్చిన మార్పు. ప్రజాస్వామ్యం (Democracy), సమానత్వం (Equality) మొదలైన అంశాల ప్రభావానికి లోనయ్యే ఈ వ్యక్తులు ఒక ప్రత్యేకమైన వర్గంగా ఏర్పడి సమానత్వాన్ని నేడు కోరుతున్నారు. వారికి, పెట్టుబడిదార్లకు మధ్య స్పర్థలు పెరుగుతున్నాయి. పెద్దపారిశ్రామిక సంస్థలలో (Big Industrial Houses) ఆర్థికశక్తి కేంద్రీకృతమైంది. దీనికితోడు వ్యాపారస్తుల సంఘాలు ఏర్పడడంతో ఈ ఆర్థికశక్తి కేంద్రీకరణమరింత అధికమయ్యింది. వ్యాపారస్తులు ఈ సంఘాలను ఏర్పరుచుకొని వారిప్రయోజనాలను సమష్టిగా కాపాడుకోడానికి ప్రయత్నిస్తున్నారు. దీనితో వినియోగదారుడే ఒంటరి అయిపోయి వ్యాపార సంస్థల దయా దాక్షిణ్యాలపైన బ్రతకవలసి వస్తున్నది.

వ్యాపారస్తుల సంఘాలు/సమ్మేళనాలు ఏర్పడడంతో, స్వేచ్ఛాయుతమైన పోటీ ఉండనే ఉండదు. అంతర్జాతీయ పరిధిలో అక్కడక్కడ కొనుగోలుదార్ల మార్కెట్టు (Buyers' Markets) ఉంటాయేమోగాని, జాతీయ పరిధిలో

ఉండేవన్నీ అమ్మకపుదార్ల మార్కెట్లే (Sellers' Markets). వినియోగదార్లు సరియైన వ్యవస్థగా రూపొందక అస్తవ్యస్తంగా పడిఉండే తరగతికి చెందిన వారైనారు. దీనితో వారికి ప్రతిఘటించే శక్తి కూడా తక్కువే. అయితే ప్రజాస్వామ్య వ్యవస్థలో వారు ఓటర్లుగా గుత్తాధిపత్యాన్ని (Monopoly) నియంత్రించే ఒత్తిడి ప్రభుత్వంపై తీసుకొనిరాగలరు. ద్రవ్యోల్బణం (inflation) అధిక ధరలు సాధారణ ప్రజలలో అసంతృప్తిని కలగజేస్తాయి. ఇట్లాంటి పరిస్థితులలో వ్యాపారస్తులు ఉదాసీనం (indifferent) గా ఉండలేరు. కంపెనీ వ్యవస్థలో వివిధ వర్గాలవారి ఆసక్తులు విభిన్నంగా ఉంటాయి. వారి వారి ఆసక్తులను దృష్టిలో ఉంచుకొని మేనేజ్‌మెంట్ వ్యవహరించవలె.

## ప్రభుత్వం

ఆధునిక వ్యాపార పరిస్థితిలో ఉండే సంక్లిష్టత వల్ల, వ్యాపారాన్ని నియంత్రించి, నియమబద్ధం చేయడంలో ప్రభుత్వం పాత్ర రోజు రోజుకూ అధికమవుతూ వస్తున్నది. ఇంతేకాకుండా ప్రభుత్వమే ఎన్నో వ్యాపార కార్యకలాపాలలో పాలు పంచుకొంటున్నది. చాలా దేశాలలో కొన్ని వ్యాపారాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం సహజమైన విషయమే. కొన్ని దేశాలలో ప్రయివేటు వ్యవస్థ నిర్వహించడానికి పనికిరాదని భావించే వ్యాపార బాధ్యతను ప్రభుత్వమే స్వీకరిస్తున్నది అయితే, ప్రభుత్వ సంస్థలలో కూడా సమ్మెలు, లాకౌట్లు చూస్తున్నాం. దీనివల్ల ప్రభుత్వ సంస్థలలో కూడా స్పర్థలు సృష్టించే అంశాలున్నాయని తెలుస్తున్నది. కాని ఈ అంశాల స్వభావం ప్రయివేటు వ్యవస్థలోని వైవిధ్యంగల అంశాలతో పోల్చిచూస్తే కొద్దిగా వేరుగా ఉండినా ఉండవచ్చు.

## వ్యాపార ప్రతిష్ఠ

ఎప్పుడూ మార్పుకు గురిఅయ్యే సమాజంలో, వ్యాపారం ప్రజల నమ్మకం, విశ్వాసాలమీదే కొనసాగించవచ్చు. దీనినే వ్యాపార పరంగా ప్రజలకు సంస్థపట్ల ఉండే గుడ్‌విల్ (Goodwill) అని చెబుతాం. ఈ గుడ్‌విల్ వల్లనే కంపెనీకి ఒక ప్రతిష్ఠ ఏర్పడుతుంది. అయితే కొన్ని కారాణాలవల్ల ప్రజల దృష్టిలో వ్యాపారానికిగాని, వ్యాపారస్తులకుగాని మంచి ప్రతిష్ఠ ఎప్పుడూ లేదు. వ్యాపారస్తులంతా ఒక వర్గానికి చెందిన వ్యక్తులుగా పరిగణించబడేవారు. వీరు సమాజ శ్రేయస్సును లక్ష్యం చేయకుండా సంపదను సృష్టించుకొన్నారు. వీరు

తీరిక లేకుండా కష్టించి పనిచేసే వ్యక్తులే అయినా, ఇతర రంగాలలో వ్యక్తి కృషితో పోల్చి చూస్తే, వీరు పొందే లాభాలు సముచితమైన లాభాలకంటే చాలా అధికమని సమాజం అభిప్రాయపడుతున్నది. ఆర్థిక వ్యవస్థలో వీరికి కేంద్రస్థానం ఉండబట్టే అటువంటి సంపదలను పొందగలిగినారు.

వ్యాపార ప్రతిష్ఠ ఎంతగా దిగజారిపోయిందంటే ''సంపద కావలెనంటే వ్యాపారం చేయి'' అనే నానుడి కూడా నేడు అంతటా ప్రబలి ఉంది. అంటే ఇతర రంగాలలో శ్రమించి సంపాదించడం కష్టమని తెలుస్తుంది. బాగా శ్రమించే వ్యవసాయదారు, అలసిపోయే పనిచేసే శ్రామికుడు, విసుగెత్తే పనిచేసే గుమస్తా, వారి శక్తి మేరకు నడుం వంచి పనిచేసినా చివరకు సంపదను పొందలేక పోతు న్నారు. దేశ భద్రతా భావంతో ఉండే సైనికుడు, సేవాతత్పరత గల శాస్త్రజ్ఞుడు, మానవాళికి సేవ చేయడంలోనే అశువులు బాసే ఇంకా ఎంతో మంది వ్యక్తులు సాధారణ పరిస్థితులలో సంపదలను కూడగట్టుకోలేక పోతున్నారు, అటువంట ప్పుడు వ్యాపారంలోనే సంపదను సృష్టించుకోడానికి ఉండే అద్భుతమైన అవ కాశాలేమిటి ? అనే ప్రశ్న ఉదయిస్తుంది. అది వ్యాపారంలో ఉండే ఎంటర్ ప్రైజింగ్ స్పిరిట్ (Enterprising spirit) అనుకొంటే ఆ స్పిరిట్ యుద్ధ కృత్యాలలో లేదా ? శాస్త్రీయ కృత్యాలలో లేదా? వ్యవసాయ కుటుంబాలున్నా యంటే, ఎండనక, వాననక పనిచేసి వారి శ్రమతో సమాజానికి ఆహార పదా ర్థాలు అందిస్తున్నారు. ఆ కుటుంబాలే పరిశ్రమలలో ప్రమాదకరమైన యంత్రాల మధ్య పనిచేసే శ్రామికులుగా ఉంటున్నాయి. ఆ కుటుంబాలే చావుబ్రతుకులనే ఖాతరు చేయక దేశ రక్షణలో సైనికులుగా ఉంటున్నాయి. ఇదే ఎంటర్ప్రైజ్ (Enterprise) కాకపోతే, ఇంతకుమించి ఏముంటుంది ? విజ్ఞాన వంతులైన చాలామంది వ్యక్తులు శాస్త్ర పరిశోధనలు జరుపుతున్నారు. కొత్త యంత్రాలు కనుగొంటున్నారు. సమాజంలో మార్పులు తీసుకొని వస్తున్నారు. కాని ఎన్ని చేసినా వ్యాపారంలోనే సంపద సృష్టించబడుతుంది. ఈ శ్రమించే లక్షల ప్రజల దృష్టిలో వ్యాపారానికుండే ప్రతిష్ఠ ఏమిటి ? సామాజిక చైతన్యం వచ్చి రాను రాను ప్రజలకు వ్యాపారంపై ఒక రకమైన అనుమానం, అపనమ్మకం ఏర్పడు తున్నాయి. తిరిగి ఈ నమ్మకాన్ని భద్రపరచుకొంటే తప్ప శాంతియుత పరిస్థి తులు నెలకొనవు. వ్యాపారం సాగించడం సాధ్యం కాదు.

## పబ్లిక్, ఫైనాన్షియల్ సంస్థలు

ఒకప్పుడు వ్యాపారం వ్యాపారస్తుని స్వంత వనరులతోనే జరిగేది ప్రస్తుతం మాత్రం చాలామంది వ్యాపారస్తులు ప్రజల నుండి మూలధనాన్ని సమకూర్చుకొని ఇంకా అవసరమయితే బ్యాంకులు, ఆర్థిక సంస్థల నుంచి కూడా అప్పులు తీసుకొచ్చి వ్యాపారాన్ని కొనసాగిస్తున్నారు. ఇన్సూరెన్సు కంపెనీలు, బ్యాంకులు, యూనిట్ ట్రస్టులు, ప్రోవిడెంట్‌ఫండ్‌లు, ఇన్వెస్టిమెంట్ ట్రస్టులు, మొదలైన వాటి నిధులు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, వ్యాపారంలోనే ఉపయోగించబడుతున్నాయి యథార్థానికి ఈ వ్యాపారాలలో పెట్టే పెట్టుబడి అంతా ప్రజల సొమ్మేకదా. అందుకే ఈ వ్యాపారసంస్థలపైన తగు నియంత్రణ ఏర్పరచవలె.

## శ్రామికులు

వ్యాపారంలో ముఖ్యంగా ''శ్రామిక సంబంధాలు'' (Labour relations) సంఘర్షణలకు లోనవుతున్నాయి. వ్యాపారస్తుడు, శ్రామికులు అనేవి రెండూ విభిన్న శక్తులు. శ్రామికులు పరిశ్రమలలో యాంత్రికమైన పనిని చేపట్టడం వల్ల అది వారి మనోవికాసానికి, వ్యక్తిగత అభివృద్ధికి అవరోధంగా నిలిచింది. వీరిలో చాలామంది శ్రామికులుగానే పుట్టి, శ్రామికులుగానే పెరిగి చివరకు శ్రామికులుగానే మరణిస్తున్నారు. ఈ శ్రామికులకు మేనేజ్‌మెంట్ స్థానాలకు చేరడానికి ఉండే అవకాశాలు చాలా తక్కువ. వారు చేసే పని, వారికుండే హోదా (status), ఆదాయం, జీవన ప్రమాణం మొదలైన అంశాలను ఆధారంగా చేసుకొని చూస్తే, వారు సమాజంలో అట్టడుగు స్థాయికి చెందిన వ్యక్తులు. పరిశ్రమలన్నీ పెద్దపెద్ద పట్టణాలలోనే కేంద్రీకృతమై ఉండటంవల్ల ఈ శ్రామికులు ఆ పట్టణ జీవన వ్యయాన్ని తట్టుకోలేకపోతున్నారు. ఈ కారణంచేత మనదేశంలోనే కాక ఇతర దేశాలలో కూడా, శ్రామికులు వారి వారి కుటుంబాలను పల్లెలలోనే ఉంచుతున్నారు. ఇంకా లేదంటే, పట్టణాలలో నివాస యోగ్యం కాని అనారోగ్య ప్రాంతాలలో మాత్రమే ఉంచగలుగుతున్నారు. కుటుంబం నుంచి దూరమై కొంతమంది శ్రామికులు పూర్తిగా ఒంటరి జీవితాన్ని గడపవలసి వస్తున్నది. సుమారు ఇదే పరిస్థితి ప్రపంచమంతటా నెలకొని ఉన్నది. సంపదను సృష్టించే యంత్రాలు కనుగొన్నాక త్వరితం (speed), ప్రామాణీకరణ (standardisation) అనే అంశాలు ఉత్పన్నమయినాయి దీనితో

శ్రామికులు ఇంకా అలసటకు గురి అయినారు, అంతే కాకుండా ఈ యంత్రాలు ఉద్భవించడంతో కొన్ని వ్యాధులు కూడా శ్రామికులను వెంటాడుతున్నాయి. దీనికి యంత్రాలను నిందించి పనిలేదు. వాటిని ఉపయోగించే శ్రామికుల పట్ల నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించే వ్యాపారస్తులను దండించవలె.

క్రమంగా ఆర్థికపరంగా దోచుకోవడాన్ని (Economic exploitation) వ్యతిరేకిస్తూ మానవ విలువలు (human values) ముందుకు వచ్చినాయి. తత్ఫలితంగా ట్రేడ్ యూనియన్‌లు ఏర్పడినాయి. కొన్ని ప్రత్యేక లక్ష్యాలతో ఈ ట్రేడ్ యూనియన్‌లు ఏర్పడడం సహజం. ఆ లక్ష్యాలే శ్రామికులను ఉద్రేకపరుస్తాయి. వారిని ఒకటిగా సంఘటిత పరుస్తాయి. మెజారిటీ ఓట్లతో ప్రభుత్వాలు ఏర్పడే ఈ ప్రజాస్వామ్య సమాజంలో ట్రేడ్ యూనియన్‌లు కూడా రాజకీయాలలోకి ప్రవేశించినాయి. దాని ఫలితంగా అవి రాజకీయ ప్రభావానికి గురిఅయినాయి.

వ్యాపారం ఎప్పుడూ మారుతూఉండే సాంఘిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితిలో కొనసాగుతుంది. అటువంటి పరిస్థితిలో కాలక్రమేణ ఏర్పడే మార్పులను ప్రతిఘటించి, తొలగించే ప్రయత్నం చేసే బదులు, వ్యాపార సంస్థలు ఆ మారే పరిస్థితులకు అనుగుణంగా సర్దుబాటు చేసుకోవలె. ఈ సర్దుబాటులో కాల వ్యవధి జరిగినట్లయితే ఆ మేరకు సమాజంలో అసమానతల పరిస్థితి ఏర్పడుతుంది.

### వాతావరణ కాలుష్యం

ఉత్పత్తి ఎక్కువ చేయడానికి, అభివృద్ధి సాధించడానికి పారిశ్రామికీకరణ (Industrialisation) పట్టణీకరణ (Urbanisation) ప్రక్రియలు మానవాళికి తోడ్పడినప్పటికీ, వాటితోపాటు వాతావరణ కాలుష్య సమస్యనొక దానిని ఉత్పన్నం చేసినాయి. ఆర్థిక ప్రగతి ఫలితాలు అనుభవించక పోయినా, కొంతమంది వ్యక్తులు ఈ కలుషిత వాతావరణంలో భాగాన్ని పంచుకోవలసి వస్తుంది. ఈ ఆధునిక పారిశ్రామిక నాగరికతలో ఇది చాలా విచారకరమైన విషయం. ప్రపంచంలో ఉన్న ప్రజలందరూ అమెరికాలో ప్రజలవలె భోగలాలసమైన, ఆధునికమైన జీవితాన్ని గడిపినట్లయితే భూమిపై ఇక వాతావరణ కాలుష్య ప్రభావాన్ని ఊహించ శక్యం కాదు. వ్యాపార సంస్థల పెరుగుదల వాతావరణ కాలుష్యానికి దోహదం చేసినట్లయితే, ఆ పెరుగుదల ఒక పెద్ద

సమస్యను సృష్టిస్తుంది. అయినప్పటికీ వివేకవంతులైన వారెవరూ వ్యాపారాన్ని పూర్వపు పరిస్థితికి మార్చివేయవలెనని సలహానివ్వరు. విచక్షణ లేకుండా, సహేతుకం కాకుండా, పరిమితి, నియంత్రణ లేకుండా పారిశ్రామికీకరణ, పట్టణీకరణ జరగడం, వివిధ రకాల కోరికలు పెరగడం వంటి అంశాలు ప్రపంచాన్ని వాతావరణ విపత్తుకు గురిచేస్తాయి. అందువల్ల హానికరమైన అటువంటి కోరికలను అదుపులో ఉంచడంద్వారా ఎటువంటి అవకతవకలు లేకుండా వస్తు, సేవలు సాఫీగా పంపిణీ జరిగే ఆర్థిక వ్యవస్థను రూపొందించడం ద్వారా, కాలుష్యాన్ని అరికట్టే మార్గాలను కొన్నింటిని అవలంబించడం ద్వారా వాతావరణ విపత్తు పరిస్థితిని కొంతవరకు తొలగించవచ్చు.

## ప్రకృతి వనరులు

ప్రకృతి వనరులు ప్రస్తుత తరం యొక్క గుత్తాధిపత్యం కాదు సమాజంలో ఎన్నో తరాలకు చెందేవి ఈ వనరులు, కాని ప్రస్తుత వ్యాపార పరిస్థితులలో ఆ వనరులు తరిగిపోయే ప్రమాదం గోచరిస్తుంది. ఎందువల్లనంటే నేటి వ్యాపార సంస్థలు దూరదృష్టితో కాకుండా తాత్కాలిక లాభాలకోసం వనరులను దుర్వినియోగం చేస్తున్నాయి.

## గుత్తాధిపత్య, పరిమిత వ్యాపార కార్యకలాపాలు (Monopolistic Restrictive Trade Practices)

వ్యాపార సంస్థల పరిమాణం పెరుగుతూ పెరుగుతూ జాతీయస్థాయి, అంతర్జాతీయ స్థాయి చేరుకొని, చివరకు ప్రపంచమంతటా వ్యాపార కార్యకలాపాలను విస్తృతం చేస్తున్నాయి పెద్ద వ్యాపార సంస్థలు అధిక గుత్తాధిపత్యాన్ని సంపాదించి, ఇతర వ్యాపార సంస్థల అభివృద్ధికి, పెరుగుదలకు అవరోధాన్ని ఏర్పరుస్తున్నాయి. పెద్ద సంస్థల గుత్తాధిపత్య పరిమిత వ్యాపార కార్యకలాపాల వల్ల పోటీకి అవకాశం లేదు. అంతే కాకుండా మంచి మార్గాలలో వ్యాపార అభివృద్ధికి అవి అంతరాయాన్ని కూడా కలిగిస్తున్నాయి

ఆధునిక వ్యాపారం ఎన్నో మార్పులకు లోనవుతుంది. సమాజం కూడా సాంకేతిక, సాంస్కృతిక విప్లవ ఫలితంగా నిరంతరం మార్పు చెందుతూ ఉంటుంది. ఈ మార్పులు ముఖ్యంగా రాజకీయ రంగంలోను, ఆర్థిక రంగంలోను జరుగుతుంటాయి. ఈ పరిస్థితులలో వ్యాపారస్తుడు అటువంటి మార్పులకు దోహదం చేసి, అవి మంచి ప్రభావాన్ని ఇచ్చేవై ఉండేటందుకు తోడ్పడవలె.

విచారకరమైన విషయమేమిటంటే, తన కార్యకలాపాలకు నాయకుడుగా ఉండవలసిన ఆ వ్యాపారస్తుడు అటువంటి మార్పులకు విముఖత చూపిస్తున్నాడు. ఆ రకమైన వైఖరి వ్యాపార ప్రపంచంలో అంత వాంఛనీయం కాదు.

సాంకేతిక, శాస్త్రీయ విప్లవం, విద్య ఉన్నతి, ప్రజాస్వామిక, సమానత విలువలు సామాజిక పరిస్థితులలో మార్పులకు దోహదం చేసినాయి. మార్పు అనేది నిరంతరం జరిగే ప్రక్రియ. కమ్యూనికేషన్, వస్తుసేవల పంపిణీ, వ్యక్తి సమాజం పరస్పరాధారం వంటి అంశాలపై ఈ మార్పులకు ఎంతో ప్రభావం ఉంటుంది. ఆధునిక పారిశ్రామికీకరణ జీవితవిధానంలో కొత్త మార్గాలకు తావు ఏర్పరిచింది ఆర్థిక అభివృద్ధిని సాధించే అవకాశం ఏర్పడింది. అయితే ఆ అభివృద్ధి ప్రయోజనాలు సక్రమంగా వ్యక్తుల మధ్య పంపిణీ జరగడం లేదు. అందుకే ఈ పంపిణీ జరిగే విధానంపై నేడు వాదోపవాదాలు జరుగుతున్నాయి. వ్యాపారస్తుడు మానవాళి సమూహంలో తను వ్యాపారాన్ని కొనసాగిస్తున్న విషయాన్ని గుర్తించి, వారి అభివృద్ధికి ఉండే అవరోధాలను అధిగమించి, సామాజిక బాధ్యతలను చేపట్టవలె.

### వ్యాపార ధ్యేయాలు

వ్యాపార స్వభావమేదైనప్పటికీ, వ్యాపార ధ్యేయాలలో మాత్రం సారూప్యం ఉంటుంది. ఇవి ముఖ్యంగా ఆర్థిక—సాంఘిక ధ్యేయాలై ఉంటాయి. ఈ ధ్యేయాలను సాధించని పక్షంలో ఆ వ్యాపార కార్యకలాపాలు వ్యర్థమే అవుతాయి. అయితే వ్యాపార సంస్థకు ఆర్థిక ధ్యేయాలే ప్రధానమనుకొంటే అది తప్పు అభిప్రాయం. ఎందువల్లనంటే ఆర్థిక ధ్యేయాల సాధనే ముఖ్యోద్దేశంగా ఉండే సంస్థలు విజయాన్ని సాధించలేవు. సాంఘిక ధ్యేయాలుకూడా వ్యాపార విజయాన్ని నిర్ణయిస్తాయి. దీని గురించి విపులంగా తరవాత చర్చిద్దాం. అంగీకృతమైన వ్యాపారధ్యేయాలేమిటో కొన్ని ప్రస్తుతం తెలుసుకొందాం.

### అధిక జీవన ప్రమాణం:

ఏ వ్యాపారమైనా ప్రజలజీవన ప్రమాణస్థాయిని పెంచడానికి తోడ్పడవలె. అంటే ప్రజల వినియోగానికి ఎన్నో రకాల వస్తుసేవలు అందజేయవలె. దీనికి ఉత్పత్తిని పెంచి, తక్కువ ధరలకు వస్తు, సేవలు లభ్యమయ్యేటట్లు చూడవలె.

### ఆర్థిక ప్రగతి

జీవనప్రమాణం అధికం చేయడంతోపాటు, వ్యాపారంలో ఆర్థిక అభివృద్ధి

కూడా ఒక ధ్యేయంగా ఉంటుంది. అంటే సాంకేతిక ప్రగతిని సాధించి ఉత్పత్తిని మెరుగుపద్ధతులలో సాగించి, కొత్త వస్తువులను కనుగొంటూ ప్రజలకు ఆ ప్రయోజనాలను అందించవలె. దీనికి మనకు లభ్యమయ్యే పరిమిత వనరులను సక్రమంగాను, సమర్థవంతంగాను, లాభదాయకంగాను, ఉపయోగించుకోవలసి ఉంటుంది.

## ఆర్థికస్థిరత్వం

మన ఆర్థిక దుస్థితిలో ఎన్నో అవకతవకలు ఉండడం నిత్యమూ చూస్తుంటాము. ముఖ్యంగా ద్రవ్యోల్బణం, నిరుద్యోగం, దారిద్ర్యం వంటి అంశాల ప్రభావంతో ఆర్థిక పరిస్థితి ఒడుదుడుకులతో మరీ దుర్భరమవుతుంది. దీనితో వ్యాపారంలో ఆర్థిక స్థిరత్వం అనే ధ్యేయానికి ఎంతో ప్రాముఖ్యం వచ్చినది. కాలానుగుణంగా మార్పులు సహజమే అయినప్పటికీ, ఆర్థిక పరిస్థితిలో కొంత నిశ్చితత్వం, స్థిరత్వం చాలా అవసరం.

## వ్యక్తిగత భద్రత

సమాజంలో వ్యక్తికి ఎన్నో విషయాలలో భద్రత కావలసి ఉంటుంది. ఎందువల్లనంటే వ్యక్తిని ఎప్పుడూ కొన్ని సమస్యలు వెంటాడుతునే ఉంటాయి. ఉదాహరణకు నిరుద్యోగం, వ్యాధి, ప్రమాదం, వార్ధక్యం, మరణం వంటి సమస్యలను వ్యక్తి ఎదుర్కోవలసి వస్తుంది. వీటికి సరియైన భద్రతే లేనట్లయితే వ్యక్తి మనుగడే సాధ్యంకాదు. వ్యక్తి జీవితమే నిరర్థకం అవుతుంది.

## నిశ్చలత

ఈ ధ్యేయం రాజకీయపరంగా ఉంటుంది. రాజకీయ విధానంతో ముడి పడి ఉంటుంది. అయితే దీనిలో ఆర్థిక అంశాలు లేకపోలేదు. ఆర్థిక జీవనంలో ఈనిశ్చలతను పొందవలెనంటే మార్కెట్‌లో వస్తువులు నిరంతరం లభ్యమవుతూ ఉండవలె. క్రమపద్ధతిలో డిమాండ్‌ను, సప్లైని సర్దుబాటుచేస్తూ ఉండవలె.

## న్యాయాత్మకత

సమ్మతమైన పద్ధతిలో ఆదాయపంపిణీ జరుగుతూ, వ్యక్తిగతాభివృద్ధికి, ఆర్థిక ప్రగతికి ఉండే అవకాశాలు సముచితమైన రీతిలో సమాజానికి లభ్యమయ్యే ఓట్లు చూడవలె. ఇవి విద్య, ఆరోగ్యం, వసతి సౌకర్యాల వంటి అంశాలకు సంబంధించి ఉంటాయి. అంతే కాకుండా జాతి, మత భేదాలు, స్త్రీ, పురుష

భేదాలు, వయోతారతమ్యాలు, సాంఘిక వైవిధ్యాలు - వీటికి తావు ఉండరాదు.

## స్వతంత్రత

రాజకీయ రంగంలో వలె ఆర్థిక రంగంలో కూడా దీనికి వివిధ అర్థాలున్నాయి. ఏ వ్యక్తి అయినా తనకు లభ్యమయ్యే వనరులు ఉపయోగించుకొని, ఆ వచ్చే ప్రయోజనాన్ని పొందగలగవలె. అట్లాగే వినియోగదారుడు తన కొనుగోలు శక్తి మేరకు ఏ వస్తువులనైనా కొనుక్కోగలగవలె. వ్యక్తి తాను ఏ వృత్తినైనా చేపట్టగలగవలె. సమష్టి ప్రయోజనం కోసం వ్యక్తి ఇతరులతో కలసి సంఘాలేర్పరచుకోగలగవలె. అప్పుడే వ్యక్తి స్వతంత్రతను పొందగలుగుతాడు.

## సామాజిక అభివృద్ధి

ఇది వ్యాపారానికి అత్యంత ప్రధానమైన ధ్యేయం. ఏ ఆర్థిక ధ్యేయమైనా సమాజ స్థితిగతులు మెరుగు పరచడానికి తోడ్పడవలె. అంటే అక్కడి ప్రజల అవసరాలను తీరుస్తూ, వారికి సదుపాయాలను కలిగిస్తూ, వారికుండే ఇబ్బందులను తొలగించవలె.

## జాతిభద్రత

ఏ వ్యాపారమయినా దేశ రక్షణకు సహాయపడవలె. యుద్ధ సమయాలలో దేశ భద్రతకు కృషి చేయవలె. దేశ సౌభాగ్యాన్ని, ఉన్నతిని కాపాడవలె.

## వ్యక్తి స్వేచ్ఛ

వివిధ కార్యకలాపాలను కొనసాగించడంలో వ్యక్తులు నైతిక విలువలను గుర్తించి, స్వచ్ఛంగా ఉండగలందుకు వ్యాపారం తోడ్పడవలె. స్వేచ్ఛగా, నిజాయితీగా ప్రవర్తించేందుకు సహకరించవలె.

# 2

# వ్యాపారము - సమాజము

వాణిజ్యం, పరిశ్రమ, ట్రాన్స్‌పోర్ట్, కమ్యూనికేషన్, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం, వైద్యం, కళ, ఇవన్నీ ఒకదానికొకటి చేదోడువాడోడుగా ఉంటే వీటిలో సాధించిన ప్రగతివల్ల సమాజ ప్రయోజనాన్ని సృష్టించవచ్చు. మానవ చరిత్రలో మొట్టమొదటి సారిగా అట్టడుగున పడిఉండే ప్రజలు దారిద్ర్యం నుంచి వారెన్నడూ ఊహించని సంపదస్థాయికి చేరుకోగలిగినారు. అదే విధంగా వరదలు, గాడ్పులు, తుఫానులు, పంటనష్టాలు, అకాలమరణాల నుంచి అధిగమించగలిగినారు.

కిందటి రెండు, మూడు శతాబ్దాలలో సృష్టించిన సంపద సక్రమంగా పంపిణీ జరగక పోవడం యథార్థమే. అదేవిధంగా కొంతమంది ప్రజల స్థితి గతులు మెరుగుపడక పోవడంకూడా యథార్థమే. అయితే ఇవన్నీకూడా ఘడియ, ఘడియకు మార్పుకు గురిఅవుతున్న సమాజంలో తాత్కాలికంగా నిలిచే అవరోధాలు మాత్రమే. నేటి రోజులలో వీటిని సమస్యలుగా పరిగణించ డానికి తావే లేదు. కారణమేమిటంటే ఈ సమస్యలు ఉత్పన్నమయ్యే రేటుకంటే మించి మానవుని విజ్ఞానం అభివృద్ధి చెందుతుంది. ఆ విజ్ఞానాన్ని అనువర్తించడం ద్వారా అటువంటి సమస్యలెన్నింటినో శాశ్వతంగా పరిష్కరించవచ్చు. ఈ ఆశావాదానికి నిదర్శనం లేకపోలేదు. ఎక్కడ చూసినా సంపద సృష్టించ బడుతూనే ఉంది. దీనితో పాటు జనాభా పెరుగుతున్నారు. అయినా కాలక్రమేణ ప్రజల స్థితిగతులు పెరుగుపడుతూనే ఉన్నాయి. ఒకతరం కాలంలో ట్రాన్స్ పోర్టేషన్, కమ్యూనికేషన్‌లలో ఎంతో ప్రగతి సాధించబడినది.

మార్పులలో జరిగే ఫలితాలు సర్వవ్యాప్తంగా ఉంటాయి. సంపద అధిక మవడంతో పాటు దిగువ తరగతి వ్యక్తులు మధ్యతరగతికి చేరుకొన్నారు. మధ్యతరగతి వ్యక్తులు పై తరగతికి చేరుకొన్నారు. ఈ ఆర్థికప్రగతి ఫలితంగా

ఏర్పడిన సామాజిక పరిణామాలు అభివృద్ధి ఆవశ్యకతను ఇంకా అధికం చేసినాయి. ఇప్పటికీ పేదరికం, దారిద్ర్యం ఉన్నప్పటికీ అవి పారిశ్రామిక విప్లవ ఫలితం మాత్రం కాదు. ప్రజలలో వారి స్థితిగతులలోను, సంస్కృతిలోను, వారికుండే అవకాశాలలోను ఎప్పుడూకూడా తారతమ్యాలు ఉంటాయనేది అంగీకరించిన విషయమే. అయితే నేడు సంపద సృష్టించడానికి ఉండే అవకాశాలు ప్రజలందరి స్థితిగతులను మెరుగుపరుస్తాయి. కొంతమంది నిరాశావాదులు దీనికి వ్యతిరేకమైన భావాలతో ఉన్నారు. కాని మార్పుకు లోనయ్యే ఈ సమాజంలో అద్వితీయమైన శక్తి ఉన్నది. దాని ఫలితంగా ప్రజల పరిస్థితులు రోజు రోజుకూ అభివృద్ధి చెందుతాయి గాని దిగజారిపోవు. దీనిని అర్థం చేసుకోడానికి నాలుగు సూత్రాలున్నాయి.

1. వాణిజ్య పరిశ్రమలు నిరంతరమూ వస్తు, సేవలను అవిరళంగా ఉత్పత్తి చేస్తూనే ఉంటాయి.
2. అభివృద్ధి ఫలితాలు జనాభా పెరుగుతున్నప్పటికీ ప్రజలందరకూ చేరతాయి.
3. విజ్ఞాన సముపార్జన వల్ల కొత్తగా సంపద సృష్టించబడుతుంది. దీనివల్ల సాంఘిక, ఆర్థిక పరిస్థితులను పరిష్కరించవచ్చు.
4. ఈ విజ్ఞాన ఫలితంగా మానవుడు పరిసరాలను, చివరకు తన స్థితిగతులను అవగాహన చేసుకోగలుగుతాడు.

వీటన్నిటికీ ముఖ్యం విజ్ఞానమే. ఇదే నాగరికతా సమాజానికి మూలం. ఇదే అభివృద్ధికి ఆధారం. ఈ విజ్ఞానం వల్లనే ప్రజలు సహేతుకమైన ప్రవర్తనను అలవాటు చేసుకొంటారు. అయితే ఈ విజ్ఞానం దానంతటది సంపదను సృష్టించలేక పోవచ్చు. పరిశోధన, సాంకేతిక పరిజ్ఞానం అనే విషయాలు విజ్ఞానంకోసం పెట్టిన పెట్టుబడినిబట్టి నిర్ణయమవుతాయి. ఈ పెట్టుబడి తిరిగి ఆర్థిక వ్యవస్థాభివృద్ధిపైన ఆధారపడి ఉంటుంది. ఆర్థికాభివృద్ధి ప్రక్రియ మానవ పరిణామంలో ఒక భాగంగా పరిగణించ బడుతుంది. వ్యాపార ప్రవర్తనకూడా బాహ్యప్రజల ప్రవర్తన సూత్రాల ప్రకారమే ఉంటుంది. వ్యక్తులకు, వ్యాపారస్తులకు మధ్య ఉండే పోటీ సంఘర్షణవల్ల కొత్త సంపద సృష్టి కావడమే కాక, అది సరియైన విధంగా పంపిణీకూడా జరుగుతుంది. అయితే ఇదంతా కూడా కిందటి శతాబ్దంవరకూ ఉండేతీరు. ఈ శతాబ్దంలో పరిస్థితి వేరు.

పోటీ సిద్ధాంతం ప్రకారం సామర్థ్యంగల సంస్థలు అభివృద్ధి చెందుతాయి. సామర్థ్యంలేని సంస్థలు మూతపడతాయి. కాని కొన్ని సంస్థలు పెద్దతరహా ఆదాయాలను రాబట్టుకొని మరింత అభివృద్ధి చెంది పోటీదారులను నిలదొక్కుకో నీయడంలేదు. అంతేకాకుండా ఆ సంస్థలు ఆర్థిక శక్తి కేంద్రీకరణకు దారితీసి మరికొన్ని ఆర్థిక, రాజకీయ సమస్యలను సృష్టిస్తున్నాయి.

శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానంతో రెండోసమస్య ఉత్పన్నమయింది. వీటి వల్ల కావలసిన విజ్ఞానం లభిస్తుంది. కాని దీనిని అజాగ్రత్తగా వర్తింప జేసి నట్లయితే పరిసరాలను పాడుచేసి, కలుషితం చేయవచ్చు. ఈ విజ్ఞానం సంపదను సృష్టించ గలదు. సృష్టించిన సంపదను నశింపజేయగలదు. వైద్యశాస్త్రం వల్ల జీవితాలను కాపాడవచ్చు. అదే చేసినట్లయితే జనాభా పెరుగుదల ఏర్పడుతుంది.

ఇంక మూడో సమస్య చాలా ప్రాథమికమైనది. ఈ శతాబ్దానికి మానవ విలువలలో (Human Values) చాలా మార్పులు రావచ్చు. వాటివల్ల ఆర్థిక విధానంలో ఉండే సంప్రదాయబద్ధమైన సిద్ధాంతాలు తొక్కివేయబడతాయి. వీటికి సంబంధించిన వ్యాపార నిర్ణయాలకుకూడా అదేగతి పడుతుంది. కృషి అనేది మానవుని ప్రాథమికాంశం ఇది కొత్త మార్గాలలో పయనిస్తే ఉత్తమం. విజ్ఞానంవల్ల వస్తుపరమైన కోర్కెలనుంచి మానసిక పరమైన కోర్కెలకు మార్పు జరుగుతుంది.

పారిశ్రామికాభివృద్ధి విజయంలో ప్రధానమైన విషయమేమిటంటే ఉత్పత్తికి, మార్పుకు కీలకం వ్యాపార సంస్థే. "వ్యాపారం" అనేదానిని సరియైన రీతిలో నిర్వచించవలె. దీని అర్థం ఆర్థిక లక్షణాలు, వాటి నిర్మాణంలో వచ్చే మార్పులతోపాటు మారిపోతుంది. అదేవిధంగా సమాజంలో మార్పులకు అనుగుణంగాకూడా వ్యాపార భావం మారిపోతుంది.

పూర్వపు రోజులలో ప్రభుత్వ సంస్థలను, ప్రయివేటు సంస్థలను వేరు పరచడం సాధ్యమయ్యేదికాదు. సమాజంలోని ఆర్థిక వ్యవస్థ ప్రభుత్వ విధానాలనుబట్టి ఉండేది. పారిశ్రామికీకరణకు పూర్వం వ్యవసాయానికి ప్రాధాన్యం ఉండేది. సంపద, హోదా, రాజకీయశక్తి అన్నికూడా వ్యవసాయ భూమిపైనే ఆధారపడి ఉండేవి. తరవాత ప్రత్యేకీకరణ ఏర్పడింది. మార్పిడి అవశ్యకమయింది. దీని ఫలితంగా వ్యవసాయ దారులతోపాటు, వర్తకులు, వ్యాపారస్తులు

కూడా ఉన్నతమైన స్థానాన్ని పొందినారు. ఆ తరవాత చాలాకాలంవరకూ కూడా వ్యావసాయక వ్యవస్థ (Agricultural Economy) నెలకొని ఉండేది. పారిశ్రామిక విప్లవానంతరం ఉత్పత్తిదార్లు రాజకీయ శక్తిని వారి స్వాధీనం చేసుకొన్నారు.

ఆర్థిక వ్యవస్థాలక్షణాలను ప్రభుత్వ విధానాలలో అవలంబించడం సహజమే. వనరులు కేటాయించడంలో వ్యాపార సంస్థ ఎప్పుడైతే కీలకపాత్ర వహించిందో, ప్రభుత్వం కూడా వ్యాపార సంస్థల అభివృద్ధికి కావలసిన పరిస్థితులను ఏర్పరచడానికి అనుకూలమైన విధానాలు రూపొందించింది. వ్యాపార పెర్‌ఫార్మెన్స్ (Business Performance) వెనుకబడినట్లయితే, ప్రభుత్వమే వ్యాపార విజయానికి ఉండే అవరోధాలను తొలగించే చర్యలు తీసుకొనేది. అవి తిరిగి అభివృద్ధి చెందడానికి అనుకూల వాతావరణ మేర్పరిచేది అట్లాంటప్పుడు ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వం కారణమా? లేదా వ్యాపారసంస్థ కారణమా? అంటే తేల్చి చెప్పలేము. ఒక్కొక్కప్పుడు ప్రభుత్వం అవసరమయ్యేటప్పుడు ఆర్థిక సహాయాన్ని కూడా వ్యాపార సంస్థలకు అందజేస్తుంది. అట్లాంటప్పుడు ఆ సంస్థలు ప్రయివేటు సంస్థలా? అంటే కచ్చితంగా చెప్పలేము.

వ్యాపారస్తులకుగాని, లేదంటే వాటిని నియంత్రించే వ్యక్తులకుగాని వారికుండే స్వేచ్ఛ, లేదంటే వారిపై ఉండే ఆంక్ష అనేవి వారుండే సమాజ స్వభావాన్నిబట్టి నిర్ణయమవుతాయని గుర్తించవలె. అట్లాగే సమాజంలో కొన్ని ముఖ్య అంశాలు అంటే ప్రభుత్వం, సంస్కృతి, సాంకేతిక పరిజ్ఞానం, మొదలయినవి కూడా కొంతవరకు వ్యాపారస్తుల నడవడిని నిర్ణయిస్తాయి. వీటన్నిటినీ దృష్టిలో పెట్టుకునే వ్యాపారస్తులు నిర్ణయాలు తీసుకోవలె. అయితే ఈ నిర్ణయాలు తీసుకొనేటప్పుడు వారి సంస్థలకు సమాజంలో ఎట్లాంటి పాత్ర ఉంటుంది అనేది కూడా గుర్తుంచుకోవలె. చాలామంది వ్యాపారస్తులు వారి అనుభవాల ఆధారంగా ఈ విషయాలను సులువుగానే తెలుసుకోగలరు. అందుకు ప్రస్తుత వ్యాపారస్తులు చేపట్టిన సామాజిక బాధ్యతల విస్తృతే నిదర్శనం. సమాజ పరిస్థితులనుంచి ఉద్భవించిన కొన్ని అంశాలకు అనుగుణంగా వ్యాపార సంస్థ చేపట్టిన పాత్ర మారుతూ ఉంటుంది. వ్యాపార విధానం ఆర్థిక వ్యవస్థ ద్వారా సమాజంతో ముడిపడి ఉంటుంది. దీనికి ఎన్నో పరిణామాలు (repercussions) ఉంటాయి. ఇవి ఆర్థిక స్వభావమైనవి మాత్రమే కాదు, ప్రభుత్వ

విధానాలు సమాజ ఆర్థిక వ్యవస్థపై ఏ విధంగా ప్రభావాన్ని చూపుతాయో లోగడ చెప్పడం జరిగింది. వ్యాపార సంస్థ అది 'పబ్లిక్ రంగం'లో ఉన్నా, 'ప్రయివేటు రంగం'లో ఉన్నా ముడి పదార్థాలు కొంటుంది. తుది వస్తువులు (Finished products) ఉత్పత్తి చేస్తుంది. ఈ ప్రక్రియలో ఉద్యోగ అవకాశాలు కలిగిస్తుంది. ఆదాయాన్ని ఉత్పన్నం చేస్తుంది. ఇవి తిరిగి సమాజంలోని వ్యక్తుల సంతృప్తిని నిర్ణయిస్తాయి. ఉదాహరణకు ఎన్నో సాంకేతిక ప్రయోగాలనంతరం కనుగొన్న మోటారు వాహనాలు ప్రయాణానికి సౌకర్యంగా తోచడం వల్ల సమాజ అవసరాలను ఆ ఉత్పత్తిదార్లు తీర్చగలిగినారు. ఇట్లాంటి అభివృద్ధికి చట్టంగాని, సమాజ సంస్కృతిగాని అడ్డురాలేదు. ఆర్థిక వ్యవస్థలో సామర్థ్యమున్న, లాభదాయకమైన ఇట్లాంటి సంస్థలకు అభివృద్ధి చెందడానికి తగిన ప్రోత్సాహం లభిస్తుంది. ఈ వ్యాపారసంస్థ ప్రభావం సమాజంలో సర్వవ్యాప్తంగా ఉంటుంది. లక్షల ప్రజలు వాహనాల సంస్థలలో ఉద్యోగాలు పొందడమే కాకుండా, రోడ్లపైన, గ్యారేజీలపైన, ట్రాన్స్‌పోర్ట్ సేవలపైన చేసిన పెట్టుబడి వల్ల ఇంకా ఎంతోమందికి ఉద్యోగ అవకాశాలుకూడా లభించినాయి. ఆ విధంగా వారందరూ కూడా కొంత ఆదాయాన్ని సంపాదించ గలిగినారు. వారి జీవిత విధానం మెరుగుపడింది. రైల్వేలు సాధించలేనంతగా ఈ మోటారు వాహనాలు సమాజానికి ఉపయోగకరమైనాయి. అయితే ప్రజలకు వీటి వల్ల ఆర్థిక పరమైన ప్రయోజనాలు చేకూరినప్పటికీ, సామాజిక పరమైన ఇబ్బందులు కూడా తెలిసినాయి. పజలలో ప్రమాదానికి గురయ్యే అవకాశమేర్పడింది. అదే విధంగా వాతావరణ కాలుష్యం కూడా జరిగింది. వీటివల్ల అదనంగా చట్టాలను రూపొందించి పోలీసు శాఖపై అదనంగా వెచ్చించి, ప్రజలకు కావలసిన భద్రత చేకూర్చవలసి వచ్చింది.

క్లుప్తంగా చెప్పాలెనంటే ఆర్థిక వ్యవస్థలో చాలా రకాల అవకాశాలు, పరిమితులూ ఉంటాయి. వీటికి సమాజంపై ప్రభావం ఉంటుంది. ఉత్పత్తి చేసిన వస్తుసేవలను వినియోగించుకొనేది సమాజమే కాబట్టి వ్యాపారస్తుల నిర్ణయాలు సమాజంలో మార్పులను తీసుకొని రాగలుగుతాయి. వ్యాపార సంస్థలు వివిధ రకాలుగా ఉంటాయి. వాటి పరిమాణంలోను, యాజమాన్యంలోను, ధ్యేయాల లోను, వ్యవస్థానిర్మాణంలోను తారతమ్యాలు ఉంటాయి. సమాజంలోని ఆర్థిక వ్యవస్థకు, వ్యాపార సంస్థకు ఉండే సంబంధాన్ని తెలుసుకోవడానికి వ్యాపార విధానాన్ని పరిశీలించవలె.

## వ్యాపార విధానము

లోగడ పేర్కొన్నట్లు వ్యాపారస్తుని అవకాశాలు, పరిమితులు, అతని వ్యాపార సంస్థకు, ఆర్థిక-రాజకీయ-సాంఘిక వ్యవస్థకు మధ్య ఉండే సంబంధాలనుబట్టి ఉంటాయి. సమాజంలో వచ్చే మార్పుతోపాటు, ఈ సంబంధం కూడా మారిపోతూ ఉంటుంది. అందుచేత వ్యాపారసంస్థ, సమాజం రెండూ వేరువేరని భావించకూడదు. సమాజంతో పనిలేకుండా వ్యాపారాన్ని కొనసాగిస్తే కొన్నాళ్లకు ఆ వ్యాపారం మూతపడిపోతుంది. మేనేజర్‌కు, అతడు ఎంత పై స్థాయిలో ఉన్నాసరే, సంస్థపైన సరియైన అవగాహనైతే ఉండవచ్చుగాని, తన చుట్టూఉండే సమాజం గురించి ఆలోచించక తప్పదు.

## వ్యాపారవిధానము-పబ్లిక్ వనరులు

నేటి రోజులలో ప్రజలలో వివిధ వర్గాలవారి ఆసక్తులను గమనించి వాటి సమతౌల్యాన్ని సాధించడమే మేనేజ్‌మెంట్ బాధ్యతగా పరిగణింపబడుతున్నది. దీనికి కారణమేమిటంటే వ్యాపారస్తులు ప్రజల వనరులను ఉపయోగించే వ్యాపారాన్ని కొనసాగిస్తున్నారు. ప్రజలలో వివిధ వర్గాలయిన వాటాదారులు, ఋణదాతలు, వినియోగదార్లు, శ్రామికులు, సాధారణ ప్రజలు వీరందరూ ఈ వనరులలో భాగాన్ని పంచుకొంటారు. అయితే ఈ వనరులు పరిమితంగా ఉంటాయి కాబట్టి, వాటినుంచి అధికమైన ప్రయోజనం సమాజానికి ఉండేటట్లు వ్యాపారస్తులు వ్యాపారాన్ని నిర్వహించవలె. వ్యాపారస్తులకు వ్యాపారాన్ని అభివృద్ధి చేయవలెననే ధ్యేయం ఉండవచ్చు. కాని ఆ అభివృద్ధి సమాజానికి ఉపయోగకరంగా ఉంటేనే అది సార్థకమౌతుంది.

సమాజంలో వ్యాపార సంస్థ వహించే పాత్రను అంత సులువుగా గుర్తించడానికిగాని, వివరించడానికి గాని సాధ్యం కాదు. దీనికి కొంతవరకు మొదటి ప్రపంచ యుద్ధము, రెండో ప్రపంచ యుద్ధము మధ్య కాలంలో సామాజిక అవగాహనలోను, సాంకేతిక పరిజ్ఞానంలోను వచ్చిన మార్పులే కారణము. 1930 ఆరంభం నాటికి పాశ్చాత్యదేశాల ఆర్థిక వ్యవస్థలలో ఉండే స్వతంత్ర సంస్థా పద్ధతిలో (free enterprise system) ఉత్పత్తి కారకాలను సక్రమంగా వినియోగించుకోవడం జరగలేదు. ఆ కారణం వల్ల సంపూర్ణోద్యోగితను

(full employment) సాధించడానికి అవసరమయ్యేంత త్వరితగతిలో డిమాండు, సప్లయ్ శక్తులను సర్దుబాటు చేసుకోలేక పోవడం జరిగింది.

ఆ పైన ప్రభుత్వం సామాజిక ఇబ్బందులను తొలగించే బాధ్యతను చేపట్టింది. అందుకోసం ఆదాయానికి మూలమైన ఉత్పత్తి కారకాలను స్వాధీనం చేసుకొన్నది. మొట్టమొదట్లో ఇది కేవలం అప్పటి పరిస్థితుల దృష్ట్యాచేపట్టినా, యుద్ధానంతరకాలంలో సంపూర్ణోద్యోగ, సామాజిక సంక్షేమ విధానాలు విస్తృతంగా అంగీకరించబడినాయి. దేశంలోని ఉత్పత్తి చాలా వరకు పబ్లిక్ ఏజెన్సీల ద్వారా జరిగేది దేశంలో మిశ్రమవ్యవస్థ అవలంబించిన తరవాత, ప్రభుత్వ సంస్థలు, ప్రయివేటు సంస్థలు వస్తుసేవల ఉత్పత్తి చేపట్టిన తరవాత, సంపూర్ణోద్యోగాన్ని కల్పించడమే కాకుండా, ధరలస్థాయి స్థిరంగా ఉండేటట్లు చూడడం, జీవనప్రమాణం మెరుగుపరచడం కూడా ప్రభుత్వ బాధ్యతలుగానే పరిగణించ బడుతూ వచ్చినాయి. కొన్ని దేశాలలో ప్రభుత్వాలు జాతీయ విద్య, ఆరోగ్యము, ఇతర సామాజిక సేవలు కలిగించే బాధ్యతను కూడా స్వీకరిస్తున్నాయి. ఇవే సమాజం ఉద్దేశాలయినప్పుడు, వీటిని సాధించడంలో వ్యాపారం వహించే పాత్రను తక్కువగా అంచనా వేయలేము.

**ఆదాయ విధానము**

**1960-1970** మధ్య కాలంలో చాలా పారిశ్రామిక దేశాలలో అత్యధిక ధరలు, వేతనోల్బణం (Wage inflation) ఏర్పడినాయి. కొన్ని దేశాలలో అధిక నిరుద్యోగము, పారిశ్రామిక మిగులుశక్తి (Spare industrial capacity) కూడా ఉండేవి. వేతనోల్బణము, నిరుద్యోగము ఒకేసారి ఏర్పడడంతో, అప్పటి వరకూ ఉండే ద్రవ్యోల్బణాన్ని అరికట్టే విధానాలు విఫలం అయినాయి. మొత్తం డిమాండ్ (Total damand) తగ్గించే చర్యలు ఏవైనా తీసుకొన్నట్లయితే అందువల్ల వ్యవస్థలో మిగులుశక్తి (Spare capacity) ఎక్కువవుతుంది. ద్రవ్య (money) సప్లయ్‌ని ప్రత్యక్షంగా క్రమబద్ధం చేయడం వల్ల కొంత ప్రయోజనం ఉన్నప్పటికీ, ఇది నిరుద్యోగానికి దారితీస్తుంది.

తెలుసుకోదగిన విషయమేమిటంటే, రాజకీయ నిర్ణయాలకు ఆర్థిక కార్యకలాపంమీద ప్రభావం ఉంటుంది. అంతే కాకుండా, యజమాని, శ్రామికుల మధ్య సంబంధాలలోను, ఉత్పత్తిదారు, వినియోగదారు మధ్య సంబంధాలలోను కూడా ప్రభుత్వ అజమాయిషీ చోటు చేసుకొంటుంది. దీని కారణంగా వ్యాపార విధానా

లలో కొన్ని మార్పులు అనివార్య మవుతాయి. వ్యాపారస్తునికుండే స్వేచ్ఛ మరింత పరిమిత మవుతుంది. ద్రవ్యోల్బణాన్ని అదుపులో పెట్టడంలో ధరల విధానము, ఆదాయ విధానము కొంతవరకు తోడ్పడినా, దీర్ఘ కాలంలో వీటికంత ప్రాధాన్యం ఉండదు. అప్పుడు వ్యక్తిగత భావాలు, సామాజిక భావాలలో వచ్చే మార్పులకే ప్రాధాన్యం ఉంటుంది. వినియోగదారుని భవిష్యత్తు అవసరాలను సక్రమంగా అంచనా వేయగలిగితే అది ఎంతో ప్రయోజనకరంగా ఉంటుంది. కాని ఆ అంచనా తప్పయితే దాని వల్ల నష్టం వాటిల్లుతుంది. వనరులను కుంటు పడుతున్న పరిశ్రమలనుంచి అభివృద్ధి చెందుతున్న పరిశ్రమలలోకి తరలించినట్ల యితే లాభదాయకంగా ఉంటుంది.

దీర్ఘ కాలంలో ఆదాయ విధానం చట్ట సంబంధమైన ఆసరా లేకుండా, స్వతహాగా పాటించడానికి అనుకూలంగా ఉండవలె. ఆదాయ విధానం అంటే కేవలం వేతన వ్యయాన్ని తగ్గించడం, సాపేక్ష ఆదాయాల పంపిణీని అదుపులో పెట్టడమే కాదు. లభ్యమయ్యే వనరులలో భాగాన్ని పంచుకోవడంలో వివిధ వృత్తులకు చెందిన వ్యక్తుల మధ్య ఉండే పోటీని తొలగించే సమగ్ర విధానంలో ఒక భాగంగా అది కూడా ఉండవలె. ఆదాయ విధానము, ఆదాయ పంపిణీతో ఏ విధంగా ముడిపడి ఉంటుందో అదే విధంగా అవి పెరిగే రేటుతో కూడా ముడిపడి ఉంటుంది. అందుచేత ఆదాయ విధానము ద్రవ్యోల్బణం అరికట్టేదిగానే కాకుండా, అంతకుమించి సామాజిక ఇబ్బందిని తొలగించే సాధనంగా పరిగణించ బడుతుంది.

సమాజంలో ఏయే వ్యక్తుల జీవన ప్రమాణం ద్రవ్యోల్బణంతో బాగా దిగ జారిపోయిందో, కనీసం వారి ప్రయోజనం కోసమైనా ఆదాయ విధానాన్ని అను సరించవలె. అయితే సనాతన రాజకీయ, ఆర్థిక అభిప్రాయం ప్రకారం ఇట్లాంటి వ్యక్తుల పరిస్థితిని మెరుగు చేయవలెనంటే జాతీయాదాయాన్ని అధికరేటులో అభి వృద్ధి చేయవలె. ఎందువల్లనంటే ధనికులు ఇంకా ధనవంతులవడానికి తోడ్పడి నట్లయితే వారి సంపద కొంత పేదవారికి చేరుతుందనే అభిప్రాయముంది. ఈ రకంగా అభివృద్ధి చెందడం ద్వారానే పేదరికాన్ని తొలగించవచ్చు. అయితే ఈ అభిప్రాయం ప్రకారం యధార్థమైన పేదరికానికి, సాపేక్షమైన పేదరికానికి తేడా ఉండదు. ఆదాయమూ, సంపదా పంపిణీలో మార్పులేనంత కాలం సాపేక్షమైన పేదరికాన్ని నిర్మూలించడానికి అధిక ఆర్థిక అభివృద్ధి మార్గమనుకోవడం అర్థ

రహితము. సంపద ఆర్జించడానికి పోటీ పడడంవల్ల సాపేక్షమైన పేదరికం ఇంకా పెరుగుతుంది. ధనికుని ఆదాయంలోను, పేదవాని ఆదాయంలోను ఒక నిర్దిష్ట శాతం హెచ్చినట్లయితే, వారి సాపేక్ష జీవన ప్రమాణాలలో ఎంతో తారతమ్యం కనబడుతుంది. అధికమయ్యే సాపేక్షమైన పేదరికానికి, సామాజిక సంఘర్షణకు సంబంధమున్నట్లయితే, మొట్టమొదట దాని ప్రభావం అధిక వేతనాలకోసం డిమాండ్ చెయ్యడంద్వారా బయటపడుతుంది. అట్లాంటప్పుడు ధనికులకు తోడ్పడడంద్వారా వారి సంపద పేదవారికి చేరుతుందనే పంపిణీ యంత్రాంగం పని చేయదు. ఆర్థిక, సామాజిక విధానాలు అట్లాంటి యంత్రాంగంపై ఆధారపడ కూడదు.

ప్రస్తుతం, భవిష్యత్తులో కూడా సాధారణ, ప్రత్యేక ధరలు, ఆదాయాలు ఏవిధంగా ఉండవలెననేది సూచిస్తూ ధరల విధానము, ఆదాయాల విధానానికి సంబంధించిన నియమాలను రూపొందించవలె. ఎట్లాంటి చట్ట సంబంధమైన ఆధారం లేకుండా, ఈ నియమాలు పాటించవలెనంటే, మరొక మూడు షరతులు కూడా అనుసరించవలె. మొదటిది ఏ ప్రజలకైతే ఈ విధానం వర్తించడం జరుగుతుందో వారిలో అధిక భాగం దానిని బలపరచవలె. రెండోది, ధరలు, ఆదాయాలు నిర్ణయించడానికి చేసే సంస్థాపరమైన సర్దుబాట్లవల్ల ఏర్పడే పరిమితులలో ఆ విధానం అనుసరించతగినదై ఉండవలె. మూడోది, విధానము దాని స్వభావంలోను, పనిచేసే తీరులోనుకూడా సముచితంగా కనిపించవలె. దీని ప్రకారం సంప్రదింపుల పద్ధతికి ఆధారమైన సామాజిక సమానతను ఉల్లంఘించకుండా వేతనాలు తారతమ్యాలపై ఉండే సనాతన భావాలను మార్చడానికి ప్రస్తుత వేతన విధానం కృషి చేయవలె.

## వ్యాపారము - జీవనవిధానము

చాలా దేశాలలో కిందటి 200 సంవత్సరాల నుంచి ముందెన్నడూ లేనంత అధికంగా ఆర్థిక అభివృద్ధి, సాంకేతిక పరిశోధనా జరిగినాయంటే దానికి కారణం స్వేచ్ఛాయుతమైన ఆశావాదమే అంటే ఎక్కువ మందికి అత్యధిక సంతోషాన్ని సాధించడానికి మెటీరియల్ అభివృద్ధి (Material improvement) ప్రమాణాన్ని హెచ్చించడమే మార్గమని ప్రజలు అభిప్రాయపడుతున్నారు. బహుళ జనాభిప్రాయం ఏమిటంటే మెటీరియల్‌పరంగా అభివృద్ధిచెందుతున్న సమాజం, దాని ఫలితంగా అధిక సాంస్కృతిక, మెటీరియలేతర జీవితం ఉంటుంది. సామాజిక

వైజ్ఞానిక ప్రగతితో ఆర్థికాభివృద్ధిని సమాన పరచడం పారిశ్రామిక సమాజాలలో (Industrial societies) ఏనాటినుంచో ఉంటూ వచ్చింది.

పారిశ్రామికీకరణ ప్రారంభమయిన నాటినుంచి జీవన ప్రమాణంలో వచ్చే పెరుగుదలను ఏ విధంగానూ తక్కువగా అంచనా వేయరాదు. వ్యక్తి వ్యవసాయ ఉత్పత్తిదారునిగా ఉన్ననాటినుంచి తలసరి ఆదాయం ఏ కొద్దిమాత్రమే ఉండేది. 18వ శతాబ్దంలో స్టీమ్ పవర్ (Steam Power) కనుగొన్న తరవాత, పారిశ్రామికీకరణ జరిగిన తరవాత చాలా దేశాలలో జాతీయాదాయం పెరిగింది. నేడు అభివృద్ధిచెందిన దేశాలలో ఏ ఒక్కరుకూడా ఆకలితో అలమటించనవసరం లేదు. కట్టుకోవడానికి బట్ట కొరతలేదు. వైద్య సదుపాయం లేక మరణించ నవసరంలేదు. ఎంతో మందికి కూడు, బట్ట, ఇళ్ళు చాలినంతగా ఉన్నాయి. పరిశ్రమల ద్వారా సంపద సృష్టించడంతో ప్రభుత్వాలు సామాజిక సంక్షేమాన్ని సులువుగా నెలకొల్పగలిగినాయి. స్వేచ్ఛాయుత వ్యవస్థా విధానంలో ఈ అభివృద్ధి ఒక పెద్ద ఘనకార్యము. వ్యాపారంలో ఉండే పోటీ, లాభార్జనవల్ల వ్యాపార సంస్థలు సామాజిక అవసరాలను తీర్చడానికి ప్రోత్సాహం లభించింది.

ప్రపంచంలోని పారిశ్రామిక సమాజాలలోని ప్రజలు వారి అవసరాలను తీర్చడంలో వ్యాపారం విజయవంతం కావడంవల్ల వారు సుఖప్రదమైన జీవన ప్రమాణాలను పొందడమే జరిగితే భవిష్యత్తులో వారి అవసరాలు ఏవిధంగా ఉండవలెననే ప్రశ్న ఉదయిస్తుంది. ఒక రకంగా ఆలోచిస్తే ఈ అవసరాలు ముఖ్యంగా ఊహకు సంబంధించినవే. ఒక మోటారు కారు ఉండేవారికి యథార్థానికి రెండు అవసరంలేదు. ఒకటి కాకపోతే ఇంకొకటి అయినా కొనే వినియోగదార్లు ఉంటారు కాబట్టి అవసరాలకు అంతంలేదు అనే ప్రమేయం ఆధారంగా వ్యాపార ప్రక్రియలే కొనసాగినట్లయితే ఎన్నో అవాంఛనీయ పరిస్థితులు ఏర్పడతాయి. ఉత్పాదకత పెరిగినప్పటికీ, ఆటోమేటిక్ ప్రక్రియలు ఎన్నో అవలంబించినప్పటికీ ప్రజలకు విరామం లభించడం లేదు. వ్యక్తిగత సంతృప్తి కలగడం లేదు. దానికి కారణం వారు ఎప్పటివలెనే పెరుగుతున్న అవసరాలను తీర్చుకోడానికి ఇంకా ఎక్కువగా పనిచేయవలెనని భావించడమే. ఈ అవసరాలు వ్యక్తిగతంగా నిర్ణయింపబడేవి కావు. సామాజికంగా నిర్ణయింపబడతాయి. ఆధునిక వినియోగదారు సమాజంలో అదనపు అవసరాలు పూర్తిగా సాపేక్షమైనవే. సమాజంలో తన హోదా పెరుగుతున్నకొద్దీ వ్యక్తి తనకు అప్పటివరకు ఉండే ఇల్లు కంటే పెద్దది

ఉండవలెనని, అప్పటివరకూ ఉండే కారు కంటే పెద్ద మోటారుకారు ఉండవలెనని వాంఛిస్తాడు. ఇదంతా తన క్రొత్త హోదాను బహిర్గతం చేయడానికి ఉద్దేశించబడుతుంది. ఇతరులతో వారిని సరిపోల్చుకోవడం ద్వారానే ప్రజలు వారి అవసరాలను నిర్ణయిస్తారు. అందుకే ఆర్థికాభివృద్ధికి ముఖ్యంగా కావలసినది వ్యాపార సంస్థలద్వారా వినియోగదారులలో అప్పటివరకూ ఉండే జీవన ప్రమాణంపై అసంతృప్తిని కలగజేయడమే.

అభివృద్ధి అనేది రాజకీయపరంగాను, ఆర్థికపరంగాను ఉంటుంది. చాలా దేశాలలో రాజకీయ విజయానికి మూలం వినియోగము. కార్యకలాపాల సూచీ సంఖ్యలను అధికం చేయడంలో ప్రభుత్వానికి ఉండే సమర్థత అధికారంలో ఉండే రాజకీయవేత్తలు వారు పరిపాలనలో ఉన్న కారణంగానే ప్రజల స్థితిగతులు మెరుగుగా ఉన్నాయని అంటారు. అధికారంలో లేని రాజకీయవేత్తలు వారే పరిపాలనలో ఉంటే పరిస్థితులు ఇంకా మెరుగుగా ఉంటాయని ప్రకటిస్తారు. అయితే అభివృద్ధి ఎప్పుడూకూడా రాజకీయ విధానాన్ని ప్రోత్సహిస్తుంది. అంటే అధికార పంపిణీపై ఎట్లాంటి ప్రతిఘటననైనా వ్యతిరేకిస్తుంది. ఆర్థిక వ్యవస్థలో ధనికులు, పేదవారికి మధ్య తారతమ్యాలు కొనసాగినట్లయితే వాటిని ప్రజలు సహించరు. కాని రాజకీయవేత్తలకు, వ్యాపారస్తులకుకూడా మెటీరియల్ అభివృద్ధి భావమే ఉండడంవల్ల దీనికి అంత అవకాశంలేదు. ఎందువల్లనంటే క్రొత్త క్రొత్త వస్తువులపై ప్రజలకు ఉత్సాహాన్ని కలిగించి, అవి సాధించగలిగినంత కాలం పరిస్థితి అదేవిధంగా కొనసాగుతుంది. అందుచేత ఆచరణాపరమైన రాజకీయ దృక్పథంలో అధిక ఆర్థికాభివృద్ధి ప్రతి ఒక్కరి జీవిత విధానాన్ని మెరుగుపరుస్తుందనే అభిప్రాయం ప్రజలకు ఎందుకు ఉంటుందో సులువుగా తెలుసుకోవచ్చు.

పరిమిత వనరులు మాత్రమే ఉన్న ఈ ప్రపంచంలో మనం నివసిస్తున్నాము. పెరుగుతున్న జనాభాకు కావలసిన ఆహార పదార్థాలను సప్లయ్ చేయవలసిన ఆవశ్యకత ఉంది. అంతేకాకుండా రోజు రోజుకూ పెరుగుతున్న కోర్కెలను తృప్తిపరచవలె. అయితే అభివృద్ధి తొందరగా సాధించవలెననుకోవడంవల్ల సుమారు 19వ శతాబ్దారంభంనుంచి పరిసర ప్రాంతాలలో కొన్ని ఇబ్బందులు తలెత్తినాయి. ఒక పక్క స్వచ్ఛమైన నీరు కావలసివస్తే వేరొక పక్క అదే నీరు కలుషితమవుతున్నది. ఈ దృష్టిలో మానవ సంక్షేమానికి

అభివృద్ధి అవరోధంగా నిలుస్తుంది. బ్రిటన్‌లో మైషన్ (Mishan) అనే అతను అభివృద్ధిలో ఉండే ఇబ్బందులను పేర్కొన్నాడు. ప్రస్తుత పారిశ్రామికాభివృద్ధి, వినియోగము, జనాభా పెరుగుదల దృష్ట్యా ప్రపంచంలోని ఖనిజ సంపద, ఇతర వనరులు కొద్దికాలంలో తరిగిపోతాయి. ఆ తరవాత అభివృద్ధి జరగడానికి అవకాశమే ఉండదు. అయితే ఆర్థికాభివృద్ధి, సాంకేతికాభివృద్ధి ప్రమాదానికి దారి తీస్తాయనే వాదాన్ని ఖండిస్తూ కొంతమంది చెబుతున్నారు. ఆంథోని క్రాస్‌లాండ్ (Anthony Crosland) అభిప్రాయంప్రకారం అభివృద్ధికి, పరిసరాలకు ఎట్లాంటి సంబంధం ఉండదు అభివృద్ధి జరుగుతున్నంత మాత్రాన పరిసరాలు హీనంగా ఉండవలెనని లేదు. రసిల్ లెవిస్ (Russel Lewis) అభిప్రాయం ప్రకారం జనాభా పెరుగుదలను అదుపులో ఉంచడానికి విధానాన్ని రూపొందించవలెనని కొందరు భావిస్తే వారికి సమస్యలను పరిష్కరించడంలో మానవ సమాజానికి ఉండే శక్తిపై నమ్మకం లేదని అర్థము. సుమారు ఇవే అభిప్రాయాలను చాలా మంది పారిశ్రామికవేత్తలు కూడా వెలిబుచ్చినారు. క్లుప్తంగా చెప్పవలెనంటే చాలామంది రాజకీయవేత్తలు, వ్యాపారస్తుల అభిప్రాయం ప్రకారం ఆర్థికాభివృద్ధిలో ఎట్లాంటి లోపంలేదు. కొన్ని అవాంఛనీయమైన పరిస్థితులు ఏర్పడితే వాటిని మరింత ఆర్థికాభివృద్ధి సాధించడంద్వారా, సాంకేతిక పరిశోధనలు జరపడంద్వారా తొలగించవచ్చు.

సామాజిక సంతృప్తిలో భౌతిక సంపద ఒక భాగమని, భవిష్యత్తులో సమాజ సంక్షేమం ఉంటుందని కొందరు అభిప్రాయపడుతున్నారు. కాని ఈ అభిప్రాయం మూడు రకాలుగా సందేహానికి గురి అయింది. మొదటిది, ప్రపంచంలోని వనరులు శాశ్వతంగా మిగిలి ఉండవు. కాబట్టి ఆర్థికాభివృద్ధి ప్రస్తుతం జరిగే త్వరితగతిలో కొనసాగదు. రెండోది, అభివృద్ధివల్ల ఏర్పడిన భౌతిక వ్యయాలు చాలా అత్యధికంగా ఉంటాయి. చాలామంది అభివృద్ధిలో ఉండే భౌతిక ప్రయోజనాలను పొందుతున్నప్పటికీ, సమాజాభివృద్ధి జరిగినంతమాత్రాన ఆ సమాజంలో ప్రజలు సంతోషంగా ఉండవలెనని లేదు అనే అభిప్రాయం కొంత మంది వెలిబుచ్చినారు. మూడోది, అభివృద్ధివల్ల ఆధునిక పట్టణ జీవితంలో కలిగే అనర్థాలు అందరికీ తెలిసినవే. వాటిని అధికమైన అభివృద్ధే మార్గమని త్రోసిపుచ్చలేము.

బ్రిటన్‌లో ఒక సాంకేతిక సంస్థ చేసిన పరిశోధన ప్రకారం తెలిసేదేమి

ఉంచే జనాభా, పారిశ్రామికీకరణ, కాలుష్యం, ఆహారపదార్థాల ఉత్పత్తి, వనరుల తరుగుదల మొదలయిన అంశాలలో ప్రస్తుత పరిస్థితే కొనసాగినట్లయితే,రాబోయే శతాబ్ది కాలంలో అభివృద్ధికి పరిమితి ఏర్పడుతుంది. అయితే ప్రస్తుత పరిస్థితులు కొనసాగుతాయనే ప్రమేయంపైనే ఇది ఆధారపడి ఉన్నది. కాని ఇవే పరిస్థితులు కొనసాగడం జరగని పని. అంతేకాకుండా, కొందరు ఊహిస్తున్నట్లుగా భవిష్యత్తు అంత నిరాశాజనకంగా కూడా ఉండదు. కంప్యూటర్ లు, మోడల్ ల ద్వారా వేసిన అంచనాలు కొన్ని ప్రమేయాలపైనే ఆధారపడి ఉంటాయి. వాటిపై ఎవరైనా సందేహాన్ని వెలిబుచ్చితే విమర్శకు గురి అవుతాయి.

ప్రపంచంలో ప్రజలు ఎంత కాలంగా నివసిస్తున్నారు అనే దాని కంటే వారి జీవిత విధానము (Quality of life) ఏ విధంగా ఉన్నది అనేది ప్రధానమైన విషయము. దీని ప్రకారం భౌతిక సంపదతో నిండి ఉన్న సమాజానికి, నాగరికత, సంస్కృతి గల సమాజానికి మధ్య తేడా ఉన్నట్లు గమనించవచ్చు. అయితే కొన్ని అంశాలు ఆర్థికాభివృద్ధికి తప్పకుండా అవసరమవుతాయి. లేదంటే వాటిఫలితంగా ఏర్పడతాయి. ఇవి సమాజంలోని ప్రజల జీవిత విధానాన్ని మెరుగు పరచక పోవడమే కాకుండా, కొంతవరకూ పాడు చేస్తున్నాయి. అట్లాంటి సమాజంలో నాగరికత, సంస్కృతి ఉండవు. ఈ అంశాల ప్రభావం అభివృద్ధి చెందుతున్న దేశాలలో ప్రజల జీవన స్థితిగతులపై మరింత ఎక్కువగా ఉంటుంది ప్రస్తుత విషయం సారాంశ మేమిటంటే అభివృద్ధి ఎంతకాలం పాటు కొనసాగినా, ఆ అభివృద్ధి వల్ల ప్రజల జీవన విధానం మెరుగపడవలె. అభివృద్ధి ప్రక్రియలో చోటు చేసుకొనే అంశాలను కొన్నింటిని కింద వివరించడం జరిగింది.

**జనాభా పెరుగుదల-పట్టణ జీవితము**

ప్రస్తుతం జనాభా పెరుగుదల అత్యధిక స్థాయిని చేరుకొన్నది. ఇదే రేటులో జనాభా పెరుగుదల కొనసాగినట్లయితే కొద్ది కాలములోనే జనాభా రెట్టింపు అవుతుంది. జనాభా పెరుగుదల వల్ల ప్రపంచంలో ఎన్నో సమస్యలు తలెత్తుతాయి, ఉదాహరణకు చాలామంది ప్రజలకు చాలినంత ఆహారం లేదు. నివసించడానికి ఇళ్ళులేవు ధరించడానికి బట్టలేదు. ఇది ఇట్లాఉండగా, జనాభా ఉత్పత్తి రేటు ఈ పేద ప్రజలలోనే అధికంగా ఉన్నది. మన దేశంలో కుటుంబ నియంత్రణ చర్యల వల్ల జనాభా పెరుగుదలను అరికట్టవచ్చునుకోవడం కేవలం

క్రమే అయింది. కారణమేమిటంటే వాటిని సక్రమమైన రీతిలో అనుసరించడం జరగలేదు. 1951 లో కుటుంబ నియంత్రణ పథకాన్ని ప్రారంభించినారు. అయితే దాని ప్రభావం కేవలం ఏడు నెలల వరకే ఉంది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో, ప్రజలు ధనవంతులయినట్లయితే సంతానంపై వారి ఆసక్తి తగ్గుతుందని కొందరు భావిస్తున్నారు. కాని అది అర్థరహితము. ఇట్లాంటి దేశాలలో అభివృద్ధికి కూడా పరిమితి ఉంటుందనే విషయాన్ని విస్మరిస్తున్నారు

ఆర్థికంగా వెనకబడిన దేశాలలో నగరీకరణ (నాగరికత), (Urbanisation) ప్రజల జీవిత విధానాన్ని మెరుగుపరచడానికి బదులు, దిగజారుస్తుందనడానికి నిదర్శనాలు చాలా ఉన్నాయి. 1972లో ప్రపంచ బ్యాంకు నగరీకరణ వల్ల ఉత్పన్న మయ్యే సమస్యలపై ఒక రిపోర్టు జారీచేసింది. ఆ రిపోర్టు ప్రకారం సంవత్సరానికి 5 శాతం చొప్పున పట్టణ జనాభా పెరుగుతున్నది. కేవలం పట్టణాలలో కొత్తగా ప్రవేశించే వారికి 200 మిలియన్‌ల ఇళ్ళకు పైగా నిర్మించవలసి ఉంటుంది. మురికి వాడలు పెరుగు తున్నాయి. నిరుద్యోగం ఎక్కువ అవుతుంది. నేరాలు అధికమవుతున్నాయి. మన దేశంలో సుమారు సగభాగం ప్రజలు పేదరిక స్థాయికి దిగువనఉన్నారు.

## ఆహార పదార్థాలు

జనాభా పెరుగుదలతో పాటు ఆహారపదార్థాల ఉత్పత్తి కూడా పెరిగినప్పుడే ప్రజలు ఇబ్బందులకు గురి కావలసిన అవసరంఉండదు. లేదంటే ప్రజలు ఆకలితో అలమటించవలసి వస్తుంది, ఒక సాంకేతిక సంస్థ అందజేసిన అంచనా ప్రకారం వెనక బడిన దేశాలలో 50 నుంచి 60 శాతం ప్రజలు కావలసినంత ఆహారాన్ని పొందడం లేదు. కిందటి 20 సంవత్సరాల కాలం లోను తలసరి ఆహారపదార్థాల ఉత్పత్తి సుమారు స్థిరంగానే ఉండిపోయింది.

## సాంకేతిక పరిజ్ఞానము

ఇప్పటికి కూడా చాలామంది వ్యక్తులు సాంకేతిక పరిజ్ఞానం పెంపొందించినట్లయితే అన్ని రకాల ఆర్థిక సమస్యలను తొలగించవచ్చు అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చుతున్నారు. లార్ జకెర్మన్ (Lord zuckerman) అభిప్రాయం ప్రకారం "సాంకేతిక పరిజ్ఞానం పెంపొందించి దానిని అనువర్తించకుండా, ఆర్థికాభివృద్ధిని సాధించలేము. ఆర్థికాభివృద్ధిలేకుండా, మెరుగైన జీవన విధానంపై ప్రజలకుండేకోర్కెలను తృప్తిపరచడం సాధ్యంకాదు" ఇంకోరకంగా

చెప్పలెనంటేఅభివృద్ధివల్ల ఏర్పడే అనర్థాలను అభివృద్ధిద్వారానే తొలగించవచ్చు.

**కాలుష్యము**

ఆర్థికాభివృద్ధి లోని ముఖ్యఅనర్థం కాలుష్యము (Pollution). ఈ కాలుష్యము చాలా రకాలుగా ఉంటుంది. భూమి, గాలి, నీరు, సముద్రం ముఖ్యంగా కాలుష్యానికి గురి అవుతాయి, వ్యాపార విధానాలలో తక్కిన అంశాల కంటే ఈ కాలుష్యానికే ప్రాధాన్యం ఇస్తారు.

జీవిత విధానంపైన వ్యాపార ప్రభావం ఎంతగానో ఉంటుంది. ఎందు వల్లనంటే వ్యాపారమనేది వ్యక్తి భౌతిక, మానసిక సంక్షేమానికి ఒక మార్గంగా మారింది. వ్యక్తి నాగరికతాభివృద్ధికి ఇది ఎంతగానో తోడ్పడుతుంది. వ్యాపార నిర్ణయాలు సమాజంలో ఎన్నో మార్పులు తీసుకొనివస్తాయి. వ్యక్తి మొదటి నుంచి సంఘ జీవి కాబట్టి ఆ మార్పులు అతనిపై ప్రభావాన్ని చూపుతాయి. అంటే పరోక్షంగా వ్యాపార నిర్ణయాలే సమాజ పురోభివృద్ధికి గాని, తిరోగమనానికి గాని కారణ మవుతాయి అన్ని ఆర్థిక కార్యకలాపాలకు వ్యాపారమే కేంద్రస్థానమై ఉంటుంది. వ్యాపారంలో ఉత్పత్తి జరిగిన వస్తు సేవలు ప్రజల వినియోగానికి అందించబడతాయి. ఆ విధంగా ఆర్థిక వ్యవస్థే వ్యాపార విధానంపైన ఆధారపడి ఉండడం వల్ల సమాజంలో అన్ని వర్గాలకు అంటే వినియోగదార్లకు, వాటాదార్లకు, శ్రామికులకు, సాధారణ ప్రజలకువ్యాపార సంస్థలపైన ఆసక్తి ఉంటుంది. వ్యాపార సంస్థ, సమాజం ఎన్నో రకాలుగా ఒకదానితో ఒకటి ముడిపడి ఉంటాయి. ఇంకోరకంగా చెప్పవలెనంటే మానవునికి వివిధ అంగాలు ఏ విధంగా ఉంటాయో అదేవిధంగా సమాజంలో కూడా వ్యాపారం ఒక అంగంవలె ఉంటుంది. సమాజ ప్రజలే వ్యాపార సంస్థల లోని వివిధ కార్యకాలాపాలు–అంటే ఉత్పత్తి, అమ్మకాలు, కొనుగోలు, పంపిణీ మొదలైన వ్యవహారాలు నిర్వర్తిస్తారు, ఈ విషయాన్ని గుర్తించగలిగి వ్యాపార నిర్వహణను చేపట్టగలిగే మేనేజ్‌మెంట్ వ్యాపార ధ్యేయాల సాధనలో విజయాన్ని పొంద గలుగుతుంది. నేడు జపాను దేశం అంతఅభివృద్ధిని సాధించ గలిగిందంటే, దానికి వ్యాపారస్తుల ప్రజ్ఞాప్రపత్తులే కారణమని గ్రహించవలె.

# 3

# వ్యాపారసంస్థల సామాజిక బాధ్యతలు

**'సామాజిక బాధ్యతల' భావనఆవిర్భావము:**

**(Emergence of the concept of Social Responsibility)**

ఏ వ్యాపార సంస్థ అయినా కొన్ని వనరులను ఉపయోగించుకొని మాత్రమే కొనసాగుతుంది. ఆ వనరులే లేనట్లయితే ఇంక వ్యాపారమే లేదు. అట్లాంటప్పుడు ఆ వనరులను అందించే వివిధ వర్గాలకు ఆ వ్యాపార సంస్థ ఋణపడి ఉండడం సహజము. అంటే ఆ వర్గాలయొక్క ఆసక్తులను గ్రహించి, వారికి ప్రయోజనకరంగా వ్యాపారం సాగించవలసి ఉంటుంది. అంటే వ్యాపారస్తుడు కేవలం తన స్వార్థానికి, స్వప్రయోజనానికే కాకుండా, సమాజ అవసరాలను సంతృప్తిపరచడానికి కూడా వ్యాపారాన్ని చేయవలసి ఉంటుంది. లాభార్జన ఒక్కటే వ్యాపారధ్యేయం కాదు. లాభమనేది సంస్థ సామర్థ్యానికి ప్రతీకగా ఉంటుంది. సంస్థ కొనసాగడానికి అది అవసరమే అయినా, లాభం కోసమే సంస్థలను నడపడం జరగదు. నిజానికి అంతకంటె ఉన్నతమైన ధ్యేయ సాధనకోసం అవి నడపబడతాయి. ఆదే సమాజసేవ. లాభాలను కూడగట్టడం కంటే, సామాజిక విలువలను భద్రపరచడం సంస్థల కర్తవ్యం కావలె. అందువల్ల వ్యాపార సంస్థల లాభాలకంటే, సమాజ మంచిచెడ్డలే ప్రాధాన్యం వహిస్తాయి. ఈ కారణంగానే బాగా లాభాలు ఆర్జించే సంస్థలపై కూడా సమాజ శ్రేయస్సు దృష్ట్యా కొన్ని కొన్ని ఆంక్షలను విధించడం జరుగుతుంది.

**సామాజిక బాధ్యతల ఆవశ్యకత**

కాలానుగుణంగా సమాజ పరిస్థితులు మార్పు చెందినాయి. వాటి పరిణామ ఫలితంగా వ్యాపారస్తులకు సామాజిక బాధ్యతలను నెరవేర్చవలసిన ఆవశ్యకత ఏర్పడింది. కాలంతోపాటు సామాజిక చైతన్యం ఎంత త్వరగా పయనిస్తుందంటే వ్యాపారస్తులు దూరదృష్టి లేకుండా చేపట్టే కార్యకలాపాలు

తాత్కాలికంగాకూడా లాభదాయకం కావడం లేదు. ప్రజలలో మార్పు వచ్చిన తరవాత, జ్ఞానవంతులై వారు వ్యాపారస్తుని కార్యకలాపాలలో నిగూఢ రహస్యాలనుకూడా గ్రహించ గలుగుతున్నారు. అంతేకాకుండా వ్యాపారస్తుడు అవలంబించే నీచ కార్యక్రమాలను వెలికితీసి ఖండిస్తున్నారు. ఇదే చివరికి సమాజానికి, సంస్థలకు మధ్య విభేదాలకు దారితీసి, సామాజిక బాధ్యతలను నెరవేర్చవలసిన ఆవశ్యకతను సృష్టించింది. ఇట్లాంటి పరిస్థితులలో వ్యాపారస్తుడు సమాజంలో ప్రజలను త్రోసిపుచ్చలేడు. ఎందుకంటే వారి సహకారం, సానుభూతి లేనట్లయితే, తనకు మనుగడే లేదు. తన ధ్యేయాలను సాధించడం వీలుకాదు. అందుచేత వ్యక్తులందరి సమన్వయ కృషితోనే, సంపూర్ణ సహాయంతోనే వ్యాపారాన్ని విజయవంతంగా నిర్వర్తించవచ్చు. అయితే ఆ వ్యాపారం వల్ల అన్ని వర్గాలవారికి సముచితమైన ప్రయోజనం చేకూరినప్పుడే అట్లాంటి సహకారం లభిస్తుంది. ఇదే వ్యాపారస్తుడు తెలుసుకోవలసిన సత్యము. సామాజిక బాధ్యత భావన ప్రకారం వ్యాపార సంస్థలు సమాజంలో వివిధ వర్గాలవారి మధ్య పరస్పర నమ్మకము, విశ్వాసము ఏర్పడగల పరిస్థితిని సృష్టించవలె. ఇందులోకూడా అన్ని వర్గాలవారికి సమానత్వము, న్యాయము, సముచితత్వం ఉండేటట్లు చూడవలె. వీటికోసం కొన్ని సూత్రాలను నియమాలను పాటించవలసి ఉంటుంది. వ్యాపారంలో శ్రామికులు, వాటాదార్లు, వినియోగదార్లు, ప్రభుత్వము మేనేజర్లు, సాధారణ ప్రజలు భాగం పంచుకొంటారు వ్యాపార నియమాల ప్రకారం, వ్యాపారాన్ని, ఒక తరగతికి చెందిన వ్యక్తులు స్వాధీనం చేసుకొని, నియంత్రిస్తున్నప్పటికీ ఇది చివరికి సామాజిక సంబంధమని మాత్రం గుర్తించవలె. వ్యాపారం ఒక రకమైన పరిస్థితిలోను, సామాజిక నిర్మాణంలోను కొనసాగుతుంది. అందుచేత వ్యాపారమనేది వాటాదార్లు, మేనేజర్లే కాకుండా, దానితో ఏదో ఒకరకంగా సంబంధమున్న ప్రతివారితోను ఏర్పడుతుంది. కాబట్టి "సామాజిక బాధ్యతా" భావనను గుర్తించి, వివిధ వర్గాల విభిన్న ఆసక్తులను సమ్మిళిత పరచి, సంతృప్తి పరచి వ్యాపారం కొనసాగించవలసి ఉంటుంది.

**సమాజమార్పు**

పూర్వకాలంలో వ్యాపారసంస్థ వ్యాపారానికే బాధ్యత వహించి ఉండేదికాని దానికి సమాజంపట్ల ఎట్లాంటి బాధ్యతా ఉండేది కాదు. అంటే కేవలం అధిక

లాభార్జన చేసే ఉద్దేశంతోనే సంస్థలు కొనసాగేవి. అప్పటి రోజులలో సంస్థలు లాభాలపై కేంద్రీకరించడంతోనే సమాజ ప్రయోజనంకూడా చేకూరుతుందనే భావన ఉండేది. కాని కేవలం అధిక లాభాపేక్షతోనే వ్యాపారంచేసే వ్యాపార సంస్థలను క్రమంగా ప్రజలు తిరస్కరించడం ప్రారంభించినారు. అటువంటి సంస్థలపట్ల వారిపై ఏవగింపు పెంచుకొన్నారు. దీనికి కారణం లేకపోలేదు. వ్యాపారస్తులు లాభాలను దోచుకోనే ఉద్దేశంతో వస్తు నాణ్యతను తగ్గించినారు. కల్తీ మొదలుపెట్టినారు. కృత్రిమ కొరతను (artificial scarcity) సృష్టించినారు. ధరలు పెంచినారు. వినియోగదార్లను హీనంగా చూసినారు. ఆర్థిక శక్తిని కేంద్రీకరించినారు. పారిశ్రామిక రాజ్యాలను ఏర్పరిచినారు. పన్నులను ఎగవేసినారు. బ్లాక్ మార్కెటింగ్ ప్రారంభించినారు. తప్పు లెక్కలు చూపించినారు. పరిపాలకులతో లంచగొండితనం అలవర్చుకొన్నారు. అమాయక ప్రజలను మోసగించినారు. వనరులను దుర్వినియోగం చేసినారు. స్మగ్లింగ్ ఆరంభించినారు. దీనితో ప్రజలలో ఒక చైతన్యం ఏర్పడింది. ఇట్లాంటి వ్యాపార నడివడిపై చర్య తీసుకోవలెననుకొన్నారు. అట్లాంటి వ్యాపారస్తులఆటకట్టించవలెననుకొన్నారు. అందుకే ప్రజాస్వామిక సమాజాన్ని ఏర్పరిచినారు. ఈ విధానంలో సామాజిక బాధ్యతను నిర్వర్తించని వ్యాపారస్తులపై కఠినచర్యలు తీసుకోవలసిందిగా ప్రభుత్వం పై ఒత్తిడి తీసుకొని వచ్చినారు. ఈనాడు ప్రభుత్వం ఇట్లాంటి విషయాలలో కలగజేసుకోవడం ప్రపంచమంతటా ఉన్న సత్యమే. ఈ విధంగా సమాజంలో అమోఘమైన మార్పు వచ్చింది శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానము, ప్రజాస్వామ్యము, చైతన్యము, సమసమాజ ఆవశ్యకత మొదలయిన అంశాలు నేడు ఈ ప్రపంచాన్ని ఒక కొత్త సమాజంగా రూపొందించినాయి. దీని ఫలితంగా వ్యాపార వ్యవస్థల నడవడి, తీరుతెన్నులు కూడా మారవలసి వచ్చింది. అప్పటివలె కాకుండా వ్యాపారస్తులు సామాజిక సంక్షేమం కోసం పాటుపడవలసి వచ్చింది. ప్రస్తుతం వ్యాపారస్తులు సమాజంలోని వ్యక్తుల విషయంలో వారికుండే బాధ్యత అవగాహన చేసుకొన్నారు. కొద్ది సంవత్సరాల క్రిందట వ్యాపారస్తులు వారు సమాజసేవకులుగా కూడా ప్రకటించడం జరిగింది ఒక్క వాటాదారులే కాకుండా, సమాజంలో ఇతర వర్గాలవారి ఆసక్తులనుకూడా పరిగణనలోకి తీసుకోవలసిన ఆవశ్యకతను వ్యాపారస్తులు గుర్తించినారు.

**లాభార్జనా ధ్యేయము**

లాభార్జన, సామాజిక బాధ్యత అనేవి ఒకదానికొకటి పోటీపడతాయనే

అభిప్రాయ మున్నది. ఎందుకంటే సమాజాన్ని ఏదో ఒక రకంగా దోచుకొంటే తప్ప లాభాలను అధికం చేయడం కష్టము. కాకుండా సమాజ శ్రేయస్సు దృష్టిలో పెట్టుకొంటూ వ్యాపారాన్ని చేస్తే నష్టాలకు గురికావలసి ఉంటుంది. కాని యథార్థానికి ఇది అసత్యము. ఎందుకంటే సామాజిక బాధ్యతలు చేపట్టి నంత మాత్రాన లాభాలు వదులుకోవలసిన అవసరం లేదు. లాభాపేక్ష ప్రతి సంస్థకు ఉండవలె. అందుకోసమేకదా వ్యాపారాన్ని ప్రారంభించేది. అంతే కాకుండా నష్టాలకు గురిఅవుతూ ఏ సంస్థ ఎంతకాలం వ్యాపారాన్ని కొనసాగించ గలదు? కొన్నాళ్ళకు శాశ్వతంగా మూతపడుతుంది. ఇంక ఆ సంస్థ సామాజిక బాధ్యతలేమి నిర్వర్తిస్తుంది? అందుచేత సంస్థ వ్యాపారంలో నిలదొక్కుకోడానికి లాభాలను తప్పకుండా ఆర్జించవలె. ఈ విషయాన్ని ఎవరూ తోసిపుచ్చలేరు. అయితే లాభాలు హెచ్చిస్తూ పోవడం ( Profit maximisation ) ఏ సంస్థకూ కూడని పని. ఎందుకంటే ఇది సామాజిక బాధ్యతలను నిర్వర్తించ డంలో అవరోధంగా ఉంటుంది. అంటే సామాజిక బాధ్యతలు కాలదన్ని మాత్రమే అధిక లాభాలు పొందవచ్చు. కాని దీనిని ఎవరూ హర్షించరు. ఆర్థిక సూత్రాల ప్రకారం లాభమనేది వ్యవస్థాపనకు ప్రతిఫలము. కాని ఆధునిక వ్యవస్థా విధానంలో దీనికి కొత్త అర్థం ఏర్పడింది. వాటాదారులు మూల ధనాన్ని పెట్టుబడి పెట్టి, వ్యాపారాన్ని చేసి లాభాలు సంపాదిస్తారు. అయితే ఈ లాభాలు కేవలం వాటాదారులు మూలధన పెట్టుబడివల్లనే రాలేదు కదా. ఆపైన శ్రామికులు, ప్రభుత్వము, వినియోగదార్లు, సాధారణ ప్రజలు సమష్టిగా సంస్థ కార్యకలాపాలలో తోడ్పడితేనే లాభాలు వచ్చినాయి. అట్లాంటి పరిస్థితులలో మేనేజ్‌మెంట్‌కు వాటాదారుల పట్లే కాకుండా, వీరందరియెడల కొన్ని బాధ్యతలు ఉండడం సమంజసము.

## సేవాతత్పరత

సమాజానికి సేవచేయడం ద్వారానే లాభాలు ఆర్జించవచ్చు అనే విష యాన్ని నేడు వ్యాపారస్తులు గుర్తించడం జరిగింది. సేవ చేయడం ద్వారానే లాభం ఆర్జించవలె అనేది ప్రస్తుత సూత్రమయ్యింది. సేవలను అంద జేయడం ద్వారానే ఏ సంస్థ అయినా శాశ్వతంగా వినియోగదార్లను సృష్టించుకోగల్గు తుంది. సేవా తత్పరత, సామాజిక బాధ్యతా భావన ఉండే సంస్థ గుడ్‌విల్‌ను ఆర్జించగలదు. సామాజిక చైతన్యంలో నిరంతర మార్పు వస్తున్నందువల్ల

క్రమంగా సేవాభావానికి ప్రాధాన్యం పెరుగుతూ వచ్చింది.

సమాజసేవ, లాభార్జనకు మధ్య ఎట్లాంటి వ్యతిరేకత లేదు. ఎందుకంటే నష్టాలకు వస్తువులు అమ్మడంగాని, ఇతరులకోసం వనరులు వినియోగించడం కాని 'సేవాభావం'తో కూడిన ఉద్దేశాలు కావు. 'సేవ' అంటే వ్యాపార వ్యవహారాలలో మోసం లేకుండా, వినియోగదారుని పీడించకుండా, అతని అమాయకత్వాన్ని ఆసరాగా తీసుకోకుండా ప్రవర్తించడమని అర్థము. అంతే కాకుండా వినియోగదారునికి సక్రమ మార్గాన్ని చూపి, సహాయపడవలె. అవసరమైతే సలహాల నివ్వవలె. నిజాయితీగా ప్రవర్తించవలె. అతని సమస్యలకు సానుభూతి చూపవలె. వాటిని పరిష్కరించవలె. ఆ రకంగా వ్యాపారస్తులకు, వ్యక్తులకు మధ్య పరస్పర అవగాహన ఉండవలె. అప్పుడే నిజమైన సేవాతత్పరత ఆ సంస్థలకున్నట్లు ఋజువవుతుంది. ఈ సేవాతత్పరత లేకుండా కూడా లాభాలు పొందవచ్చు. అయితే ఇది అమాయకమైన, అజ్ఞానంగా ఉన్న సమాజంలోనే సాధ్యమవుతుంది. ప్రస్తుత సమాజ పరిస్థితుల దృష్ట్యా, సేవాతత్పరత, సామాజిక బాధ్యతా భావన ప్రయోజన కరమనే విషయాన్ని గుర్తించవలసి ఉంటుంది.

## గుడ్‌విల్ ప్రాముఖ్యము

వ్యాపారంలో గుడ్‌విల్ అనే అంశానికి ఎంతో ప్రాధాన్యము ఉంటుంది. గుడ్‌విల్ అంటే ప్రజల దృష్టిలో సంస్థకుండే గౌరవము, పేరు ప్రతిష్ఠలు. సమాజ ప్రజల పట్ల ముఖ్యంగా వినియోగదారుల పట్ల సంస్థ చూపే శ్రద్ధ, దాని నడవడినిబట్టి ఈ గుడ్‌విల్‌ను ఆర్జించవచ్చు. వినియోగదార్లకు కంపెనీపైన నమ్మకము, ఆదరణ, అభిమానము ఏర్పడతాయి. అయితే ఇందుకు సంస్థ నిరంతరం యథార్థాన్ని, నిజాయితీని, మంచి నడవడిని ఎప్పుడూ అవలంబించవలె. సామాజిక అవగాహన పెరుగుదలతోపాటు, ప్రజల గ్రాహ్యశక్తి ఎన్నోరెట్లు పెరిగింది. తత్ఫలితంగా వ్యాపార వ్యవహారాల తీరును నిశితంగా పరిశీలిస్తూ, సంస్థలు ఏకొద్దిగా పక్కతోవ పట్టినా అది వారి ఆగ్రహానికి గురి అవుతుంది. వ్యాపారం తీరుతెన్నులతో సమాజానికి సాన్నిహిత్యం ఉంది. అందువల్ల వ్యాపారం సక్రమ పద్ధతిలో సాగిస్తే తప్ప గుడ్‌విల్ సంపాదించడం కష్టము. ఈ గుడ్‌విల్ సంపాదించుకోగలిగిన సంస్థలు వాటి ధ్యేయాలను నెరవేర్చుకోగలుగుతాయి.

## సామాజిక బాధ్యతలు—నిర్వచనము

సంస్థ దాని వ్యాపార కార్యకలాపాలను నిర్వహించడంలోను, లాభాలను ఆర్జించడంలోను న్యాయపూర్వకంగాను, సముచిత పద్ధతులను అవలంబించి, సమాజంలోని వ్యక్తుల శ్రేయస్సు దృష్టిలో పెట్టుకొన్నట్లయితే ఆ వ్యాపారం ఒక రకమైన సామాజిక నిర్మాణంతో నడుస్తున్నట్లు అర్థము. కాబట్టి వ్యాపారసుల అసక్తి, సామాజిక ఆసక్తి రెండూ కూడా అందులో పొందు పరచబడి ఉంటాయి. ఈ రెండింటి మధ్య సమతౌల్యం లేనప్పుడు సామాజిక అశాంతి ఏర్పడుతుంది. అందుకే సంస్థ దాని కార్యకలాపాలు నిర్వహించడంతో సంబంధముండే సమాజంలోని అన్ని వర్గాల సంక్షేమాన్ని కూడా పరిగణనలోకి తీసుకొంటుంది. ఉదాహరణకు మార్కెట్‌లోని డిమాండు, సప్లయ్ శక్తులు తాత్కాలికంగా వ్యాపారస్తునికి అనుకూలంగా ఉండి ధరలు హెచ్చించడానికి అవకాశం ఉన్నప్పటికీ అట్లాచేసేటప్పుడు సమాజంలో రాబోయే ప్రతిచర్య (reaction) దృష్ట్యాగాని, లేదా ప్రజల సంక్షేమం దృష్ట్యాగాని ధరలు పెంచకూడదనే నిర్ణయం అతడు తీసుకోవచ్చు. వినియోగదారులకు ఎట్లాంటి ఇబ్బంది లేకుండా సప్లయ్‌ని సర్దుబాటు చేయవలెనని నిర్ణయించుకోవచ్చు. ఈనిర్ణయాలలో సామాజిక బాధ్యతా భావం ఇమిడి ఉన్నది.

విలియమ్ ఫ్రెడెరిక్ (William Freder ick) అభిప్రాయం ప్రకారం సామాజిక బాధ్యత అంటే వ్యాపారస్తుడు ప్రజల ఆశయాలకు అనుగుణంగా వ్యాపార వ్యవహారాలు నడపవలె. సాంఘిక - ఆర్థిక సంక్షేమం అధికంగా నెలకొనేట్లు ఉత్పత్తి కారకాలను వినియోగించవలె. ఈ ఉత్పత్తి వనరులను కొద్దిమంది వ్యక్తుల ప్రయోజనం కోసం కాకుండా సాంఘిక ధ్యేయాన్ని సాధించేందుకుగాను వినియోగించవలె. డేవిస్ (Davis) సాంఘిక బాధ్యత కనీసం కొంతమేరకైనా సంస్థ ఆర్థికలేదా సాంకేతికఆసక్తితో కాకుండా ఇతర కారణాల కోసం తీసుకొనే వ్యాపార నిర్ణయాలను సూచిస్తుందని చెప్పినాడు. హోవర్డ్ బోవెన్ (Howard Bowen) అభిప్రాయం ప్రకారం సమాజ విలువలు, ధ్యేయాలపరంగా వాంఛనీయమైన విధానాలను రూపొందించడం, నిర్ణయాలను తీసుకొనడం లేదాచర్యలను అవలంబించడంలో వ్యాపారస్తులకుండే బాధ్యతలే సాంఘిక బాధ్యతలు.

**సామాజిక బాధ్యతల స్వభావము-పరిధి:-**

ప్రస్తుత సామాజిక నిర్మాణంలో, వ్యాపారమనేది కంపెనీ వ్యవస్థా రూపంలో జరుగుతున్నది. ఆధునిక శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానంతో ఉత్పత్తి భారీ ఎత్తున కొనసాగుతున్నది. భారీ ఎత్తున ఉత్పత్తి చేస్తే తప్ప కంపెనీలు శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం నుంచి ప్రయోజనాన్ని పొందలేవు. సొంత వ్యాపారంనుంచి భాగస్వామ్య సంస్థలకు, భాగస్వామ్య సంస్థలనుంచి కంపెనీలకు వ్యాపారం మార్పు జరగడం చాలా ఆసక్తిదాయకమైన విషయము కంపెనీవ్యవస్థ ఉద్భవించడంతో వ్యాపార స్వరూపమే మారిపోయింది. అందుచేత సామాజిక బాధ్యతలను కంపెనీ పరంగానే తెలుసుకోవడం సహేతుకంగా ఉంటుంది. ప్రాథమికంగా వ్యాపారస్తులకు ఆర్థిక ఆసక్తే ఉంటుంది. ఆర్థికంగా మంచి ఫలితాలు పొందడమే వారి గమ్యంగా ఉంటుంది. వ్యయాలు, లాభాలే వారి ఆలోచన అంటే ఎంత మొత్తాన్ని ఉత్పత్తి చేయవలె, ఏ విధంగా ధరలు నిర్ణయించవలె, ఎంతెంత వేతనాలు చెల్లించవలె, ఎంతెంత లాభాలు గడించవలె, ఇవే వారి ముఖ్యాంశాలు. కాని ప్రస్తుతం ఈ పరిస్థితిలో చాలా మార్పు జరిగింది. నేటి కంపెనీ వ్యవస్థ మానవ జీవితంలో వివిధ అంశాలతో సంబంధమున్న సామాజిక ఆర్థిక సంస్థగా మారింది. ఈ ఆధునిక కంపెనీ వ్యవస్థలో ఉండే ముఖ్య లక్షణమేమిటంటే వాటాదారులు అధిక సంఖ్యలో ఉంటారు. దేశం నలుమూలలా వ్యాపించి ఉంటారు. కొద్దిమంది వ్యక్తులే కంపెనీని నిర్వహిస్తారు. యాజమాన్యము, మేనేజ్‌మెంట్ వేరువేరుగా ఉంటాయి. మేనేజర్లను సాధారణ సమావేశంలో వాటాదార్లే ఎన్నుకొన్నప్పటికి, మేనేజర్లే కంపెనీనంతటిని నియంత్రిస్తుంటారు. వాటాదారుల పాత్ర నామ మాత్రమే కంపెనీపై అతనికుండే నియంత్రణాధికారం కేవలం ఒక భ్రమే.

కంపెనీలో వాటాదార్లతో పాటు, శ్రామికులకు, వినియోగదార్లకు, ప్రభుత్వానికి, సాధారణ ప్రజలకు కూడా ఆసక్తి ఉంటుందని లోగడ తెలుసుకొన్నాము. వీరందరి సహాయ సహకారాలతోనే సావ్యాపారం ఫీగా నడుస్తుంది. సంస్థ సామాజిక బాధ్యతల గురించి చర్చించేటప్పుడు ట్రస్టీషిప్ సిద్ధాంతాన్ని కూడా తెలుసుకోవలె. వాటాదారులు మేనేజ్‌మెంట్ చేతులలో కంపెనీనిపెట్టి, నిర్వహణ బాధ్యతను వారికి అప్పజెప్పుతారు కాబట్టి మేనేజ్‌మెంట్ వాటాదారులకు ట్రస్టీగాఉంటుంది. అందుచేత వాటాదారుల ఆసక్తులను మేనేజ్‌మెంటు వారు పరిరక్షిస్తారు వారి పట్ల ఉండే బాధ్యతలను నిర్వర్తిస్తారు. అయితే వారు

చేపట్టే బాధ్యత కేవలం వాటాదారులకే పరిమితం కాకూడదు. ఎందుకంటే కంపెనీలో ఆసక్తి గలవారు ఒక్క వాటాదారులే కాదు. కంపెనీ మంచి చెడ్డలలో పాలుపంచుకొనే ఇతర వర్గాలకు కూడా మేనేజ్‌మెంట్ ఈ ట్రస్టీషిప్ బాధ్యత వహించవలసి ఉంటుంది దీని ప్రకారం కంపెనీ వాటాదారులతో పాటు శ్రామికులు, వినియోగదార్లు, ప్రభుత్వము, సాధారణ ప్రజల యెడల మేనేజ్‌మెంట్ నిర్వర్తించవలసిన కొన్ని బాధ్యతలు ఉంటాయి మేనేజ్‌మెంట్ ఈ వేరువేరు బాధ్యతలను సమన్వయ పరచవలసి ఉంటుంది. ఒక వర్గం పట్లఉండే బాధ్యతలను విడనాడి, ఇంకో వర్గానికి ఉండే బాధ్యతలను నిర్వర్తించరాదు. అన్ని వర్గాల యెడల సమాన శ్రద్ధ చూపవలసి ఉంటుంది.

## ప్రయివేటు బాధ్యత Vs సాంఘిక బాధ్యత

సంస్థ నిర్వర్తించే బాధ్యతలలో ఏది ప్రయివేటు బాధ్యత, ఏది సాంఘిక బాధ్యత అనేది నిర్ణయించడం చాలా కష్టము. ఎందుకంటే ప్రతి చర్యకు ఒక్కొక్కప్పుడు ప్రయివేటుగాను, ఒక్కొక్కప్పుడు సాంఘికంగాను దాని పరిణామాలు ఉంటాయి. లాభాలు ఆర్జించడము, కంపెనీని అభివృద్ధి చెయ్యడ మనేది ప్రయివేటు బాధ్యతగా చెప్పవచ్చు. ఇవికాక సంస్థ సాంఘిక వ్యవహారాలలో పాల్గొంటుందంటే ఆది సామాజికంగా బాధ్యతాయుతంగా ఉన్నదని చెప్పవచ్చు. అంటే ఉత్పత్తిని పెంచడమే కావచ్చు. సముచిత రీతిలో పంపిణీ చేయవచ్చు. అధికార వికేంద్రీకరణే కావచ్చు. లేదంటే వస్తునాణ్యతనే పెంచవచ్చు. ఏదైన ప్పటికిహూడా ఇవి సామాజిక బాధ్యతలే అవుతాయి. ఎందుకంటే వీటి ధ్యేయం లాభ సంపాదన కాదు. ఉదాహరణకు సాధారణ అలభ్యత (Scarcity) ఏర్పడేటప్పుడు ఉత్పత్తిదారులు ధరలు పెంచకుండా ఎప్పటివలె వస్తువులను అమ్మవచ్చు. నాణ్యత తగ్గించకుండా ఇదివరకటి నాణ్యతతోనే వస్తువులను ఉత్పత్తి చేయవచ్చు. ఇంతకంటే అతడు సాంఘిక బాధ్యతలు వేరే చేపట్టవలసిందేముంది?

వ్యాపార నిర్ణయాలు కూడా ఒకటి, రెండు వర్గాల వారికే కాకుండా అందరికీ ప్రయోజనకరంగా ఉండేటట్లు సమానత్వము, న్యాయము, సంక్షేమం కలిగేటట్లు తీసుకోవలె. మేనేజర్లు స్వార్థాన్ని విడనాడుకోవలె. ప్రయివేటు బాధ్యతతోపాటు సామాజిక బాధ్యతను కూడా దృష్టిలో పెట్టుకోవలె. వ్యాపార పెర్‌ఫార్మెన్స్‌ను వాటాదారులకు పంచి ఇచ్చే లాభాల పరంగా కాకుండా

నెరవేర్చిన సామాజిక బాధ్యతలపరంగా నిర్ణయించడం జరుగుతుంది. సంస్థలు సమాజంలో ఉండే వివిధరకాల సమస్యలను ఏవిధంగా పరిష్కరించ గలుగుతున్నాయి, అందులో ఎంతవరకు విజయాన్ని పొందుతున్నాయి అనే దానిని బట్టి వాటి సామర్థ్యం నిర్ణయమవుతుంది.

వ్యాపార సంస్థలకుండే బాధ్యతలను ఈ కింది విధంగా వర్గీకరించవచ్చు.

1. సంస్థకు దాని పట్ల ఉండే బాధ్యతలు
2. వాటాదారుల పట్ల ఉండే బాధ్యతలు
3. వినియోగదారుల పట్ల ఉండే బాధ్యతలు
4. శ్రామికుల పట్ల ఉండే బాధ్యతలు
5. ప్రభుత్వం పట్ల ఉండే బాధ్యతలు
6. సాధారణ ప్రజల పట్ల ఉండే బాధ్యతలు
7. తోటి సంస్థల పట్ల ఉండే బాధ్యతలు

## సంస్థపట్ల దానికుండే బాధ్యతలు

ప్రతి సంస్థకు దానిపట్ల దానికి కొన్ని బాధ్యతలు ఉంటాయి. ఒక వ్యక్తి తన కుటుంబాన్ని పోషించుకోవడానికి ఏ విధంగా తన ఆరోగ్యాన్ని కాపాడుకొంటాడో, అదే విధంగా సంస్థకూడా దానికుండే వివిధ బాధ్యతలను నిర్వర్తించడానికి అది పటిష్ఠంగా ఉండవలె. అంటే దాని అభివృద్ధికి, పెరుగుదలకు, స్థిరత్వానికి పాటుపడవలె. లాభాలను ఆర్జించవలె, అప్పుడు మాత్రమే సామాజిక బాధ్యతలను అది నిర్వర్తించ గలుగుతుంది. సంస్థస్థిరత్వాన్ని సాధించిన తరవాత పరిశోధన, పెరుగుదలద్వారా అభివృద్ధి చెందగలదు. సాంఘిక ఆర్థిక ధ్యేయాలను సాధించగలదు. తద్వారా దాని సంపదను సముపార్జించుకొనే శక్తిని పెంచుకోగలుగుతుంది, సాంఘిక, ఆర్థిక ధ్యేయాలను సాధించవలెనంటే సామర్థ్యానికి ప్రాధాన్యత నివ్వవలె, అంటే వస్తు, సేవలను తక్కువ వ్యయానికి ఉత్పత్తి చేయగలిగితే, ఆ సంస్థ సాంకేతిక సామర్థ్యం పెరిగినట్లు చెప్పవచ్చు. వస్తుసేవలను సక్రమమైన మొత్తాలలో ఉత్పత్తిచేసి, సక్రమమైన సమయానికి అందజేసి, వినియోగదార్ల అభీష్టం ప్రకారం ఉన్నట్లయితే ఆర్థిక సామర్థ్యం పెరిగినట్లు చెబుతాము. వ్యాపారంలో ధరలు, ఉత్పత్తి, లాభాలు అనే అంశాలు జీవనప్రమాణంతో ముడిపడి ఉంటాయి. కాబట్టి లాభదాయకంగాను, సమర్థవంతంగాను ఉత్పత్తి సాగించడమే సంస్థయొక్క ప్రధాన కర్తవ్యం కావలె.

సంస్థ బలహీనంగా ఉన్నట్లయితే సమాజానికి అది నిరుపయోగమవుతుంది. నిరుద్యోగాన్ని ఏర్పరుస్తుంది. పదార్థాల వృధా జరుగుతుంది. జాతీయాదాయం దెబ్బతింటుంది. ప్రజల విశ్వాసాన్ని కోల్పోతుంది.

**వాటాదారులపట్ల సంస్థకుండే బాధ్యతలు**

కంపెనీ చట్టం ప్రకారం వాటాదారుల తరఫున వారి ఆసక్తులను పరిరక్షించడానికి మేనేజ్‌మెంట్ సంస్థను నడపవలె. వాటాదారులకోసమే సంస్థను నడపడం జరుగుతుంది. కాబట్టి వారికి అధిక లాభాలను సంపాదించవలె. ట్రస్టీలుగా వాటాదారుల ఆసక్తిని పరిరక్షించడమే మేనేజ్‌మెంట్ విధి. అంటే వాటాదారులు ఎక్కువ లాభాలు పొందేటట్లు చూడవలె. వారి పెట్టుబడిని భద్రపరచవలె. అట్లాకాకుండా వినియోగదారుల ఆసక్తికిగాని, శ్రామికుల ఆసక్తికిగాని, ప్రజల ఆసక్తికిగాని ప్రాధాన్యమిచ్చి ప్రత్యక్షంగానైనా, పరోక్షంగానైనా వాటాదారులకు నష్టం కలిగించేటట్లుగా మేనేజ్‌మెంట్ ప్రవర్తిస్తే అది ట్రస్టు ధర్మాలకు వ్యతిరేకమవుతుంది. ఇదంతా న్యాయాత్మకమైన పరిస్థితి. కాని మనం ముందు చెప్పుకొన్నట్లు సామాజిక బాధ్యతల భావన ప్రకారం సమాజంలో ఇతర వర్గాల ఆసక్తులనుకూడా గమనించి, వాటిని కూడా సంతృప్తి పరిస్తే తప్ప వాటాదారుల ఆసక్తిని సంతృప్తిపరచడం సాధ్యం కాదు. వాటాదారుల తరఫున సంస్థను కొనసాగించడమే సాధ్యం కాదు ఆచరణ పరంగా చూస్తే వాటాదారుకు కంపెనీపై ఉండే అధికారం చాలా తక్కువ. వాటాదారులు సంస్థయజమానులే అయినప్పటికీ, సిద్ధాంతపరంగా వారికే సంస్థపై నియంత్రణాధికారం ఉన్నప్పటికీ, యథార్థానికి మేనేజ్‌మెంట్ చేతులలో ఈ అధికారమంతా ఇమిడి ఉంటుంది. ప్రస్తుత వాటాదారుని హోదా, నియంత్రించే యాజమాన్య స్థానం నుంచి, కేవలం లాభాంశాన్ని పొందే ఒక సాధారణ వ్యక్తి స్థానానికి దిగజారిపోయింది. అయితే ఈ విధంగా వాటాదారులు వారికుండే అధికారాలు కోల్పోవడానికి కారణం లేకపోలేదు, సంస్థలో వేల సంఖ్యలో ఉండే వాటాదార్లు దేశం నలుమూలలా వ్యాపించి ఉంటారు. అందుచేత వారందరూ ఒక స్థలంలో కలిసి సంస్థ మంచి చెడ్డలు చర్చించే అవకాశం లేకపోయింది. చాలామంది వాటాదారులు కంపెనీపట్ల ఉదాసీన భావంతో ఉంటారు. వారి పెట్టుబడిమీద కొంత లాభం కోసం తప్పితే కంపెనీపై వారికి ఆసక్తి ఉండదు. అంతేకాకుండా కంపెనీ మొత్తం పెట్టుబడిలో

ఒక్కొక్క వాటాదారునికుండే భాగం చాలా తక్కువ. వారు ఈ విధంగా ఎన్నో కంపెనీలలో పెట్టుబడి పెట్టి ఉండవచ్చు, అట్లాంటి వాటాదార్లు ఏ ఒక్క కంపెనీపై కూడా శ్రద్ధ వహించలేరు. అంతే కాకుండా ఎంతో దూరాన ఉన్న ఆ కంపెనీ సమావేశాలకు హాజరు కావలెనంటే చాలా ఖర్చుతో కూడుకొన్న పని. వాటాదారులలో ఉండే అజ్ఞానం కూడా ఇందుకు ఒక కారణము. చాలామంది వాటాదారులకు కంపెనీ చట్టంలోని నియమాలు, నిబంధనల గురించి తెలియదు. ఇది ఇట్లా ఉండగా కంపెనీ మేనేజ్‌మెంట్ కంపెనీ చట్టాన్ని క్షుణ్ణంగా తెలుసుకొంటుంది. దానితోపాటు వారు కంపెనీ అంతర్గత విషయాలతో నిత్యమూ వ్యవహరిస్తారు కాబట్టి పరిచయముంటుంది. వారు కంపెనీ నిర్వహణ పైస్థాయిలో ఉంటూ కంపెనీని నియంత్రిస్తుంటారు. ఇట్లాంటి మేనేజ్‌మెంట్‌ను ఏ ఒక్క వాటాదారు కూడా తనకు తాను ప్రతి ఘటించలేడు. పరిస్థితుల అనుకూలత వల్ల వాటాదారులకుండే నియంత్రించే అధికారాన్ని చేజిక్కించుకొని తిరిగి వారిపైనే మేనేజ్‌మెంట్ అజమాయిషీ చలాయించడం జరుగుతున్నది. వారే నిజమైన యజమానులుగా ప్రవర్తి స్తుంటారు. మేనేజ్‌మెంట్ ఇంతటితో చాలించక ప్రాక్సీ పద్ధతి (Proxy-system) ద్వారా ఓటులను సంధానపరచి (manipulate) తానే తిరిగి అధికారంలో కొనసాగుతుంటుంది. వారు కంపెనీలోని శ్రామికులను, కొన్ని సార్లు వనరులను కూడా స్వప్రయోజనం కోసం వినియోగించుకొంటారు. వాటాదార్లకు చట్టం ప్రకారం తెలియచేయవలసిన సమాచారానికి మిం తెలియజేయరు.

వాటాదారులు వారి పెట్టుబడిపైన ఎక్కువ లాభాన్ని కంపెనీనుంచి ఆ స్తారు. ఎక్కువ లాభాలు వస్తే చాలు వారు సంతృప్తిపడతారు. ఇంక కంపె నియంత్రణ విషయమే పట్టించుకోరు. తిరిగి వాటా విలువలు స్టాక్ ఎక్స్చేంజిల్ తగ్గిపోయినప్పుడో, లాభాలు వారి చేతికి రానప్పుడో కంపెనీ మేనేజ్‌మెంట్ గురించి కొద్దిగా ఆలోచిస్తారు. కాని ఇట్లాంటి పరిస్థితిని మార్చవలసిన ఆవశ్యక ఎంతో ఉంది. వాటాదారు తనకు వచ్చే డివిడెండ్‌పైన కాక, కంపెనీ నియం ణపై ఆసక్తిని చూపవలె. అందుకు మేనేజ్‌మెంట్ వాటాదారులలో ఉత్సాహాన్ని కలిగించి, యథార్థ పరిస్థితిని వారికి తెలియజేసి, యాజమాన్య బాధ్యతల వారికి గుర్తెరిగించవలె. వారితో వ్యక్తిగత పరిచయాన్ని కొనసాగించవ

వాటాదారు స్టాకు లెడ్జరులో ఒక పేరుగా కాకుండా, సంస్థలో ఒక యజమానిగా గుర్తించబడవలెననే అతని కోరికను నెరవేర్చవలె. వాటాదారులకు కంపెనీ స్థితిగతుల గురించి ఎప్పటికప్పుడే తెలియజేస్తూఉండవలె. వాటాదారుల సంఘాల ఏర్పాటుకు కృషిచేసి అవి సక్రమంగా పనిచేసేటట్లు చూడవలె. మేనేజ్‌మెంట్ కంపెనీ లాభనష్టాల పరిస్థితిని, ఆర్థిక స్థితిగతులను సక్రమంగా వాటాదారులకు తెలియజేయవలె. అట్లాగే కంపెనీకి సంబంధించిన ప్రధాన విషయాలను గురించి, అంటే శ్రామిక సంబంధాలు, పరిశోధనా ఫలితాలు, కొత్త వస్తువులు, సంస్థాభివృద్ధి పథకాలు మొదలయినవాటిగురించి, వాటాదారులకు తెలియజేస్తూ, వారితో సంప్రదింపులు చేయవలె. సాధారణ సమావేశాలు జరిగేటప్పుడు తీసుకొన్న నిర్ణయాల గురించి సంక్షిప్తంగా వాటాదారులకు తెలియచేయవలె. వారిపట్ల నిజాయితీగా వ్యవహరించవలె. వారికి ట్రస్టీగా మేనేజ్‌మెంట్ తన బాధ్యతను తు॥ చ॥ తప్పకుండా నిర్వర్తించవలె.

**వినియోగదారులపట్ల సంస్థకుండే బాధ్యతలు**

వస్తువులు వినియోగదార్లకోసమే ఉత్పత్తి చేయడం అందరికీ తెలిసినదే. ఉత్పత్తి అంతిమ ధ్యేయం వినియోగం కదా. అందుకే పీటర్ డ్రకర్ (Peter F. Drucker) ఈ విధంగా పేర్కొన్నాడు వ్యాపార ప్రధాన ఉద్దేశం వినియోగదార్లను సృష్టించడమే. వ్యాపారం సమాజంలో ఒక భాగం కాబట్టి, సమాజమే (వినియోగదారులు) వ్యాపారం ఏవిధంగా ఉండవలెనో నిర్ణయిస్తుంది. వినియోగదారే వ్యాపారానికి మూలము అతడు లేనిదే వ్యాపారం లేదు. వినియోగదారులకు కావలసిన వస్తు సేవలను అందించడంకోసమే సమాజం వ్యాపార సంస్థకు కొన్ని వనరులు అందిస్తుంది. అట్లాంటప్పుడు మేనేజ్‌మెంట్ వినియోగదారునికి ఎంతో ప్రాముఖ్యం ఇవ్వవలసి ఉంటుంది. అంతే కాకుండా అతని అభీష్టాన్ని, అవసరాలను దృష్టిలో పెట్టుకొని వస్తువులు ఉత్పత్తి చేయవలసి ఉంటుంది. ఉత్పత్తి చేసిన వస్తువులు వినియోగదారునికి సంతృప్తినివ్వవలె ముఖ్యంగా వినియోగదారులకు రకరకాల భావాలు ఉంటాయి. వారి అభిరుచులు వేరు వేరుగా ఉంటాయి. అందుచేత మేనేజ్‌మెంట్ వినియోగదారులకు కావలసిన వస్తువులను వారికి లభ్యమయ్యేటట్లు చూడవలె. అట్లాగే వినియోగదారుల జీవన ప్రమాణం వారికి లభ్యమయిన వస్తువులపైన, వాటి ధరలపైన ఆధారపడి ఉంటుంది కాబట్టి, వారికి వస్తువులను సాధ్యమైనంత చౌక ధరలకు అందజేయ

వలె. దీని వల్ల వినియోగదారులు వారికుండే కొనుగోలుశక్తితో వివిధ రకాల వస్తువులను కొనుక్కోగలిగి, జీవన ప్రమాణాన్ని మెరుగుపరచుకోగలరు. అదే విధంగా మేనేజ్‌మెంట్ వస్తువులను మంచి నాణ్యతతో ఉత్పత్తి చేయవలె. నాణ్యతను తగ్గించి వస్తువులను ఉత్పత్తి చేస్తే, వినియోగదారులను మోసపుచ్చినట్లు అవుతుంది. వినియోగదారుల అవసరాలను గుర్తించి, వాటిని సంతృప్తిపరచడానికి కొత్త వస్తువులను కొనుక్కోవలె.

సంస్థ జరిపే వ్యాపార ప్రకటనలవల్ల ఆర్థిక ప్రయోజనాలున్నప్పటికీ అవి సమాజానికి మంచిని చేకూర్చి, ఉపయోగపడవలె. వ్యాపార ప్రకటనలపై ఒక రకమైన అదుపు (Control) ఏర్పరచవలె. లేకుంటే అవి వినియోగదారుని మోసం చేయవచ్చు. సాధారణంగా వ్యాపార ప్రకటనలు ప్రాథమికావసరాలైన వస్తువుల విషయంలో కాకుండా భోగలాలసమైన వస్తువులు, సౌకర్యం కూర్చే వస్తువులు, కొన్ని రకాల మందుల విషయంలో ఉపయోగిస్తారు ఉదాహరణకు పాలు, తేనె, పళ్ళు విషయంలో కాకుండా సిగరెట్లకు ఎక్కువ వ్యాపార ప్రకటనలు చేస్తుంటారు. ప్రొఫెసర్‌గాల్‌బ్రిత్(Prof. Galbraith)'ఆకలితో ఉన్న ప్రజలకు ఆహారం గురించిగాని, చలితో ఉన్న ప్రజలకు వేడినిచ్చే ఇంధనం గురించిగాని, ఇళ్ళు లేని ప్రజలకు ఇళ్ళగురించిగాని వ్యాపార ప్రకటనలు చేయనవసరం లేదు'అన్నారు. వినియోగదారులలో ప్రాముఖ్యం లేని వస్తువులనుకూడా కొనడానికి ఆదాయముండేప్పుడు వ్యాపార ప్రకటనల ఆవశ్యకత వస్తుంది. సదుద్దేశంతో చేసే వ్యాపార ప్రకటనలున్నప్పటికీ, చాలామట్టుకు వ్యాపార ప్రకటనలు వినియోగదారుని తప్పుత్రోవ పట్టించేవిగా ఉంటాయి. పదే పదే వ్యాపార ప్రకటనను పునరావృతం చేస్తే వినియోగదారునిపై దానికి ఒక రకమైన ప్రభావం ఏర్పడుతుంది. నిజాయితీలేని వ్యాపార ప్రకటనలు వినియోగదారులను మోసపుచ్చేటట్లుగా ఉంటాయి. వ్యాపార ప్రకటనలలో ఒక విషయాన్ని అబ్బురపరచి చెప్పడం, తప్పు విషయాలు పేర్కొనడం చాలా సహజం. అధిక స్థాయిలో వ్యాపార ప్రకటనలు పదే పదే చేయడంవల్ల వినియోగదారులు తలకు మించి జీవితాన్ని గడపడానికి ప్రోత్సాహపరుస్తుంది. ఒక్కొక్కప్పుడు వాటిని కొనుగోలు చేసే శక్తిలేని వినియోగదార్లలో ఒక రకమైన అసంతృప్తిని కలగజేస్తుంది. వ్యాపార ప్రకటనలు సామాజికంగా అవాంఛనీయమైన చర్యలకు కూడా సిద్ధపడతాయి. సెక్సును ప్రాతిపదికగా తీసుకొని వ్యాపార ప్రకటనలు చేస్తే అవి

సమాజానికి ఎంతో హాని కలగజేస్తాయి.

వస్తువులలో నాణ్యత లేకపోవడం, కల్తీ, బరువు తక్కువ ఉండడం, వస్తువుకు ఎక్కువ ధర విధించడం మొదలయిన అంశాలలో వ్యాపారస్తులు వినియోగదార్లను మోసంచేస్తుంటారు. పెద్ద పెద్ద సంస్థలు గుడ్‌విల్ సంపాదించుకోవడం కోసం, కంపెనీపేరు ప్రతిష్ఠలకు భంగం వాటిల్లకుండా జాగ్రత్త పడడం కోసము, కొన్ని ప్రామాణికాలను (Standards) పాటించినా, గుడ్‌విల్ గురించి ఖాతరు చేయని చిన్నచిన్న సంస్థలు వస్తువులను తక్కువ నాణ్యతలో ఉత్పత్తి చేయడం, కల్తీరకమైన వస్తువులు అమ్మడం మొదలయిన అనాచారాలకు పాల్పడతాయి లాభాలు ఎక్కువ సంపాదించవలెనన్న కాంక్షతో ఇట్లాంటి అనుచితమైన పద్ధతులను అవలంభిస్తాయి. అయితే పెద్ద పెద్ద సంస్థలలో కూడా ఇట్లాంటి అనుచిత పద్ధతులు లేక పోలేదు. ఆ మాటకొస్తే పెద్ద సంస్థలలో వాటికుండే పేరుప్రతిష్ఠల చాటున జరిగే అనుచిత కృత్యాలు, చిన్న సంస్థలతో పోల్చి చూస్తే ఎన్నోరెట్లు మించి ఉంటాయి. భారీఎత్తున నడిచే సంస్థలు చేపట్టిన ఈ నీచ కార్యక్రమాలు భారీఎత్తునే ఉంటాయి. అయితే అంతకుమించి భారీఎత్తున ఉండే గుడ్‌విల్ వాటిని కప్పిపుచ్చుతుంది. అనుచిత కృత్యాలగురించి ఒక ఉదాహరణ తెలుసుకోవలెనంటే పాలలో నీళ్లు కలపడం ఏనాటి నుంచో వస్తూ ఉంది. ఇది పాల వినియోగదారులను మోసంచేసినట్లుకాదా! ఇది మానవునిలో ఉండేబలహీనత. ఎక్కువ సంపాదించవలెనని ఉండే బలీయమైన కోర్కె. ఇట్లాంటి చర్యలనుంచి మోసపోకుండా వినియోగదారే జాగ్రత్త పడవలసి ఉంటుంది అనే భావం లోగడ ఉండేది. కాని ఈ భావన ఇప్పుడు వర్తించదు. వస్తువులు కొనేటప్పుడు వాటిలో ఉండే లోపాలకు కొనుగోలుదారే జాగ్రత్తపడవలసి ఉంటుందంటే అది అనుచితము. ఎందుకంటే ఈ రోజులలో ఉత్పత్తి జరుగుతున్న వస్తువులు చాలా సాంకేతిక అంశాలతో కూడుకొని ఉంటాయి. ముందుగానే పేకింగ్ (Packing) చేయబడి ఉంటాయి. యాంత్రికపరంగా ఉండే ఆ వస్తువులలో లోపాలు వినియోగదారు ఎంత జాగ్రత్త వహించినా తెలుసుకోలేడు. అట్లాంటప్పుడు అతడు కేవలం రిటైలర్ ఇచ్చే సలహాపైనే ఆధారపడవలసి ఉంటుంది. కాబట్టి వస్తువుల గురించి వినియోగదారు తనకు తాను తెలుసుకోలేనప్పుడు వర్తకుడు అతనికి విడమరచి చెప్పవలసిన బాధ్యతను వహించవలె. ఏవైనా వస్తువులలో లోపాలున్నట్లయితే వాటిని వినియోగదారునికి

తెలియజేయవలె. వినియోగదారు ఆవస్తువు తనకు ఉపయోగపడక పోయినట్లయితే తిరిగి ఇచ్చివేసే సదుపాయం అతనికి ఉండవలె. కంపెనీ వస్తువులు పంపిణీ జరిగేటప్పుడు మధ్యవర్తకులు ఆ వస్తువులను కల్తీచేయకుండా అదే నాణ్యతతో వినియోగదారుకు చేరేటట్లు చూడవలె. అట్లాగే వారు ఎక్కువ ధరలు వినియోగదారుకు విధించకుండా సముచితమైన ధరలకు అందేటట్లు చూడవలె.

వ్యాపారస్తుడు సరుకులు అమ్మడంలో వినియోగదారుని మోసంచేస్తే, వినియోగదారు అతనిపై కోర్టులో దావా వెయ్యడానికి అతడు కొన్న వస్తువుపై వెచ్చించిన మొత్తం చాలా తక్కువగా ఉంటుంది. అందుచేత వినియోగదారులు వీటిపట్ల ఉదాసీనంగా ఉంటారు. దీనిని ఆసరాగా తీసుకొని అమ్మకందార్లు నిజాయితీని కోల్పోవడానికి సిద్ధపడతారు. వస్తునాణ్యతలను తగ్గిస్తారు. చివరికి లాభాలు అధికం చేసుకొంటారు. వీరికివచ్చే లాభాలలో ఒక వినియోగదారుని భాగము (Contribution) కొద్ది మాత్రమే కావచ్చు. అయినా ఒక్కొక్క వినియోగదారుపట్ల చేసిన ఈ ఘోరకృత్యమే సామాజిక అత్యాచారమవుతుంది. వరదలు, యుద్ధకాలాలలో వర్తకులు సామాజిక వ్యతిరేక చర్యలకు పూనుకొంటారు. అట్లాంటి పరిస్థితులలో వినియోగదారుకు బేరమాడేశక్తి (Bargaining Capacity) ఉండదు. కేవలం వర్తకుల దయాదాక్షిణ్యాలపైనే ఆధారపడవలసి వస్తుంది. ద్రవ్యోల్బణ పరిస్థితులలోను, కృత్రిమ అలభ్యపరిస్థితులలోను అధికధరలను నిర్ణయించి వినియోగదారులను దోచుకొంటారు. కొన్నిసార్లు వర్తకులు ఉద్దేశపూర్వకంగా వస్తువుల అలభ్యతా పరిస్థితిని ఏర్పరుస్తారు. ఎందుకంటే అట్లాంటి పరిస్థితులలో వారు ఎంతైనా ధరలను విధించగలుగుతారు.

## శ్రామికులపట్ల సంస్థకుండే బాధ్యతలు

శ్రామికులు సంస్థలో ప్రధాన పాత్రవహిస్తారు. శ్రామికుల కృషి ఫలితంగానే, సంస్థ లాభాలు ఆర్జిస్తుంది. అందుకే శ్రామికులపట్ల మేనేజ్‌మెంట్ కొన్ని బాధ్యతలు నిర్వర్తించవలసి ఉంటుంది. శ్రామికులకు, యజమానులకు మధ్య వైరం చాలా కాలం నుంచి వస్తున్నదే. ప్రస్తుత పారిశ్రామిక సమస్యలు చాలావరకు ఈ విషయానికి సంబంధించినవే. ప్రస్తుత వ్యాపారంలో శ్రామికులను తొలగించడం జరగని పని. వారు లేకుండా ఉత్పత్తిని సాధించడం జరగదు. శ్రామికుని దృక్పథంలో ఫ్యాక్టరీ అంటే జీవనాన్ని గడపడానికి పని

చేసే స్థలమే తప్పితే అంతనుమించి ఏమీ కాదు. తను జీవితాంతం పని చేసినా వ్యవస్థలో ఆతనికి యాజమాన్యపు హక్కులురావు. యాజమాన్యానికి, మేనేజ్ మెంట్‌కు ఉండే వైరుధ్యము, మేనేజ్‌మెంట్‌కు, శ్రామికులకుండే వైరుధ్యము ప్రస్తుత శ్రామికుల సమస్యలకు మూల కారణము. దీనికి తోడు ఉత్పత్తిలో శ్రామికుల పాత్ర తక్కిన కారణాలతో పోల్చి చూస్తే విభిన్నంగా ఉంటుంది. అంటే వీరిలో జీవం ఉంటుంది. శ్రమను వ్యక్తులనుంచి వేరుపరచలేము. నిత్యమూ మేనేజర్లకు, శ్రామికులకు ఒకరితో ఒకరికి సంబంధాలు ఉంటాయి. మేనేజర్లు మానసికమైన పనిని చేస్తారు. వారికి వ్యాపారంలో కేంద్రస్థానాలు ఉంటాయి. వారు శ్రమకు ఎన్నో రెట్లుమించి జీతాలను పొందుతారు. పెద్దస్థానాలలో ఉండేవారికి చేయవలసిన పని ఎక్కువగా లేకపోయినా బాధ్యతలు ఎక్కువగా ఉంటాయి. అందుకే వారికి అంతంత జీతాలు ఇవ్వడం జరుగుతుంది.

శ్రామికుల తరపువాదన ఏమిటంటే వ్యాపారలాభాలు శ్రామికుల శ్రమ దోచుకొంటేనే వస్తాయి. శ్రామికులకు తక్కువ వేతనాలు చెల్లించడం మొదటి నుంచీ ఉన్నదే. లాభాలు వాటాదారులు తీసుకొన్న రిస్కుకు (Risk) ప్రతిఫలమనే సిద్ధాంతం కేవలం భ్రమే. వాటాదారులు పెట్టుబడి పెడుతున్నారు కాబట్టి వారు వడ్డీ పొందగలరు. వారి ఋణ బాధ్యత పరిమితం కాబట్టి ఆ మేరకు వారికుండే రిస్కు కూడా పరిమితమే. ఆ పరిమిత రిస్కుకు మాత్రమే వారు లాభానికి అర్హులవుతారు. అంతేకాని పూర్తి లాభాలు వారికి దక్కకూడదు. వాటాదారులు పెట్టుబడిని "ఎంటర్‌ప్రైజ్"(Enterprise) గా భావిస్తే, అది వీళ్ళ విషయంలో మూలధనం రూపంలో ఉంటుంది. మేనేజ్‌మెంట్ విషయంలో మానసిక ప్రక్రియ రూపంలో ఉంటుంది. శ్రామికుల విషయంలో శ్రమ రూపంలో ఉంటుంది. ఇన్‌స్టిట్యూషనల్ ఫైనాన్సింగ్, పబ్లిక్ సొమ్ము వినియోగించడం, యాజమాన్యము మేనేజ్‌మెంట్ వేరువేరుగా ఉండడం శ్రామికులు జీవితాంతం శ్రమను వెచ్చించడం మొదలయిన వాటివల్ల ప్రయివేటు రంగంలో ఎంటర్‌ప్రైజ్ వికేంద్రీకరణ జరిగింది. అందువల్లనే లాభాలలో శ్రామికులుకూడా పాలుపంచుకోడం అనేభావం సాధారణ ఆమోదాన్ని పొందినది.

మేనేజ్‌మెంట్ ముఖ్యంగా శ్రామికులను వ్యక్తులుగా పరిగణించి, వారికుండే మానసిక భావాలను పరిశీలించి, వారిని సంతృప్తిపరచ వలసి ఉంటుంది.

అంటే సంస్థకు లాభాలను సంపాదించి, శ్రామికులకు సక్రమంగా వేతనాలు చెల్లించవలె. వేతనాలు శ్రామికుని సామర్థ్యానికి సముచితంగా ఉంటూ, అతనికి ప్రోత్సాహకరంగా ఉండవలె. అప్పుడే శ్రామికుని ఉత్పాదక శక్తి పెరుగుతుంది. శ్రామికులు అధికంగా కృషిచేసి లాభాల సంపాదనకు తోడ్పడితే వారికి సమంజసంగా లాభాలలో భాగాన్ని బోనసుగా ఇచ్చి వారిని సంతోషపరచవలె. అట్లాగే ఉద్యోగ గ్యారంటీ కూడా శ్రామికులకు కలగజేయవలె. దీనివల్ల శ్రామికులు ఎట్లాంటి ఆందోళనకు గురికాకుండా నిశ్చింతగా ఉండగలుగుతారు. చేసే పనిపైన కూడా శ్రద్ధ చూపగలుగుతారు. దీనితోపాటు మేనేజ్‌మెంట్ శ్రామికులకు వారి శక్తి సామర్థ్యాలను బట్టి పైకివచ్చే అవకాశాలను కలగజేయవలసిన బాధ్యతనుచేపట్టవలె. ప్రతివ్యక్తి వ్యక్తిగతాభివృద్ధికి ప్రయత్నిస్తాడు.కాబట్టి శ్రామికులకు కూడా వారి సమర్థతనుబట్టి పెద్దపెద్ద స్థానాలు చేరుకోవడానికి అవకాశాలు కలగజేయవలె. శ్రామికులు సంపదను సమకూర్చుకోడానికి వారికి తగిన అవకాశాలు కలిగించవలె. అతనిలో పొదుపు చేయగల శక్తి పెంచవలె శ్రామికుల జీవితం దినదినగండంగా కాకుండా వారికాళ్ళపైవారు నిలబడడానికి తోడ్పడవలె. శ్రామికులకు పనిచేయడానికి అనువైన పరిస్థితులను కలగజేయవలె. పని చేసే పరిస్థితులు అనుకూలంగా లేకపోతే, శ్రామికుని ఉత్పాదక శక్తితగ్గి, అలసటకు గురిఅయి, పనిచేయలేకపోవడం జరుగుతుంది.దీనితో ఇంకా ఎన్నో అనర్థాలు కూడా ఉన్నాయి. పనిచేసే ప్రదేశంలో శ్రామికునికి సరి అయిన భద్రతను చేకూర్చవలె. ప్రమాదాలకు గురికాకుండా రక్షణ ఏర్పరచవలె. వారికి విరామ సమయము, వినోదము, ఇతరసౌకర్యాలు కలిగించవలె. అప్పుడే మేనేజ్‌మెంట్ శ్రామికులపట్ల దాని కుండే బాధ్యతలను సక్రమంగా నిర్వర్తించినట్లవుతుంది.

## ప్రభుత్వంపట్ల సంస్థకుండే బాధ్యతలు

ప్రభుత్వం సమాజ సంక్షేమానికి, పౌర రక్షణకు బాధ్యత వహిస్తుంది. అంటే ప్రజా సంక్షేమమే ప్రభుత్వ ధ్యేయము. ప్రజలు ఇతరులచేత మోసపోకుండా, వారికి సరిఅయిన భద్రతను చేకూర్చి వారి అభివృద్ధికి తోడ్పడుతుంది. అందుకే ప్రభుత్వం కొన్ని చట్టాలు రూపొందిస్తుంది. వాటి సహాయంతో అవాంఛనీయమైన ధోరణులు తొలగించడానికి కొన్ని చర్యలు కూడా తీసుకొంటుంది. వ్యాపారసంస్థ సమాజానికి హాని చేసే సంఘ విద్రోహ కార్యకలాపాలకు పాల్పడినట్లయితే దానిపై తగు చర్య తీసుకొంటుంది సమా

జాన్ని పరిరక్షిస్తుంది. కొన్ని కొన్ని సంస్థలకు అవసరమయితే సహాయపడు తుంది కూడా. చట్టపూర్వకంగా వాటికి కావలసిన రక్షణను కల్పిస్తుంది. అటు వంటప్పుడు సంస్థలకు ప్రభుత్వం పట్ల కొన్ని బాధ్యతలు ఉండడం సహజము. ప్రభుత్వం రూపొందించిన చట్టాన్ని గౌరవించవలె. ప్రభుత్వం ఏర్పరిచిన నియమాలు, నిబంధనలను శిరసావహించవలె. వాటికి లోబడి వ్యాపారాన్ని చేయవలసి ఉంటుంది. అంతే కాకుండా కంపెనీ వ్యవహారాల్లో తప్పు లెక్కలు చూపించి ప్రభుత్వాన్ని మోసగించకూడదు. యదార్థంగా ఖాతాలను పుస్త కాలను తయారుచేసి, నిజాయితీగా చెల్లించ వలసిన పన్నులను ఎగవేయకుండా కట్టవలె. ఎందుకంటే ప్రభుత్వం ఈ పన్నులరూపంలో వచ్చే ఆదాయాన్ని తిరిగి సమాజ ప్రయోజనం కోసమే వినియోగిస్తుంది. ప్రభుత్వం తీసుకొనే చర్యలుగాని, ప్రభుత్వం ఏర్పరిచే నియమాలుగాని, సంస్థకు ఇబ్బందిని కలిగించేవిగా ఉంటే సక్రమమైన పద్ధతులలో ప్రభుత్వానికి తెలియజేయవలె. అవసరమయితే కొన్ని కొన్ని సలహాల నివ్వవలె.

## సాధారణప్రజలపట్ల సంస్థకుండే బాధ్యతలు

సాధారణ ప్రజలకు, సంస్థకు ఎట్లాంటి సంబంధం లేదనిపించినా, వారికి కూడా ఒక రకమైన ఆసక్తి సంస్థపై ఉంటుంది. ఎందుకంటే సంస్థ అనేది సామాజిక నిర్మాణంలో ఒక భాగమే కదా. సామాజిక ప్రజలుగా సంస్థ వ్యాపార వ్యవహారాల ప్రభావానికి పరోక్షంగానైనా గురిఅవుతారు. నిజానికి సంస్థకు ఈ సాధారణ ప్రజల పట్లే ఎక్కువ బాధ్యత ఉండవలె. సాధారణ ప్రజల జీవన ప్రమాణం సంస్థ ఉత్పత్తి చేసి, అందించే వస్తుసేవలపైనే ఆధారపడి ఉంటుంది. అందుచేత సంస్థ ప్రజలకు కొత్త కొత్త అవసరాలను సృష్టించి వాటిని సంతృప్తిపరచడానికి కొత్త కొత్త వస్తువులను ఉత్పత్తిచేయవలసి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ప్రజలు ప్రకృతి సంబంధమైన విపత్తులు అంటే వరదలు, తుఫానులు, భూకంపాలు, పంటనష్టాలు మొదలయినవాటికి గురి అయినట్లయితే సంస్థలే వారిని ఆదుకోవలసి ఉంటుంది. సంస్థలు వనరుల వినియోగంలో కూడా బాధ్యతాయుతంగా ప్రవర్తించవలె. దేశంలో లభించే వనరులు ఎన్నో తరాలవరకూ ప్రజలకు లభ్యమవుతూ ఉండవలె. వాటిని దుర్వినియోగం చేయరాదు. నేడు ఎక్కడ చూసినా కలుషిత వాతావరణమే కనబడుతుంది. సంస్థలు కొనసాగడంవల్ల వాతావరణం కలుషితమయి, ప్రజలకు

హానిచేస్తుంది. సంస్థ ఇందుకు కొన్ని చర్యలు తీసుకొని కాలుష్యాన్ని నివారించవలె. సమాజం ఎప్పుడూ ఒకేరకంగా ఉండేదికాదు. కాలానుగుణంగా ఎన్నో మార్పులు వస్తాయి. వాటికి అనుగుణంగా సంస్థకూడా మార్పుచెంది సమాజ అవసరాలను తీర్చవలె మానవాభివృద్ధికి తోడ్పడవలె. అంటే ప్రజలకు సాధారణ విద్యను నేర్పడానికి కృషి చేయవలె. నిరుద్యోగ ప్రజలకు ఉపాధి కల్పించవలె. ఇట్లాంటి సేవలు చేసి సాధారణ ప్రజల పట్ల సంస్థకుండే బాధ్యతలను నెరవేర్చవచ్చు.

## తోటి సంస్థలపట్ల సంస్థ కుండే బాధ్యతలు

వ్యాపారస్థుల మధ్య పోటీ ఉండడం సహజము. వ్యాపారం ఒక ఆట వంటింది. ఆటలో ఆటగాళ్ళు ఇతరులను ఓడించడానికి ప్రయత్నిస్తుంటారు. ఇందులో కొన్ని నియమాలను కూడా పాటిస్తుంటారు. ఆ నియమాలను విస్మరిస్తే తాత్కాలికంగా గెలుపొందవచ్చునేమోగాని దీర్ఘకాలంలో ఓడిపోవడం తప్పదు. ఒకరిని మించిన వారు ఒకరు ఎప్పుడూ ఉంటారు. తాటిని తన్నేవాడుంటే వాడి తలదన్నే వాడుంటాడు. ఏ వ్యక్తి శాశ్వతంగా ఒక స్థానంలో ఉండిపోలేడు. అందుచేత నియమాలు పాటించకపోవడం ఏ ఒక్కరికీ మంచిది కాదు. వ్యక్తి తను చేసిన అగత్యాలే తన వినాశనానికి దోహదం చేస్తాయి. అందుకే చెడు మార్గాలు తలపెట్టరాదు. వ్యాపారంలో కూడా కొన్ని నియమాలు పాటించడం వ్యాపారస్థులకు మంచిది. తోటి వ్యాపారస్థులకు దెబ్బకొట్టే విధంగా వ్యాపారం చేయకూడదు. సామాన్యంగా వ్యాపారస్థులు పెద్ద మనుషుల ఒప్పందానికి (Gentlemen's Agreement) కట్టుబడి ఉంటారు. ఏ వ్యాపారస్థుడైనా ఒప్పందాన్ని ధిక్కరిస్తే, తక్కిన వ్యాపారస్థులు అతనిపై చర్య తీసుకోగలరు. తాత్కాలికంగా లాభాలు పొందవలెనన్న ఉద్దేశంతో కొంతమంది వ్యాపారస్థులు వస్తువుల ధరలను మార్కెట్‌లో తగ్గిస్తారు. ఇది తోటి వ్యాపారస్థుల పట్ల బాధ్యతారహితంగా ప్రవర్తిస్తున్నట్లే. వ్యాపార ప్రకటనలలో కూడా తోటి వ్యాపార సంస్థల వస్తువులను కించపరచకూడదు. తోటి వ్యాపార సంస్థలతో పోటీ చేసేటప్పుడు కూడా ఒక పరిమితి ఏర్పరచుకోవలె. ఎందుకంటే ఈ పోటీ గొంతు కోత పోటీకి ( cut throat competition ) దారితీసి, చివరికి నష్టాలకు తావు ఏర్పడుతుంది. అందుచేత ఆరోగ్యకరమైన పోటీ అవలంబించవలె.

## సామాజిక బాధ్యతల భావన చరిత్ర

వ్యాపార పరిస్థితులు కొన్ని శతాబ్దాల ముందు వేరొక విధంగా ఉండేవి. వివిధ దేశాల మధ్య కొద్ది వర్తక సంబంధాలు మాత్రమే ఉండేవి. పరస్పరం ప్రయోజనకరంగా ఉండే వస్తువుల మార్పిడి (Exchange of goods) అప్పుడు ఉండేది కాదు. కారణం ఆ వస్తువుల మార్పిడి వల్ల ఒకరి నష్టంతో రెండోవారు ప్రయోజనం పొందడం జరుగుతుందనే అభిప్రాయం ఉండేది.

వినియోగం కోసం వస్తువులు కొంటే అది సక్రమమైనదిగాను, అట్లా కాకుండా తిరిగి లాభానికి అమ్మడం కోసం కొంటే అది తప్పుగాను భావించబడేది. హిందూ ఫిలాసఫీ (Hindu Philosophy) ప్రకారం వ్యవసాయము, దైరీ ఫారమ్‌లలో మాత్రమే వర్తకం అంగీకరించబడింది. అప్పుడు కూడా వ్యక్తిలో తనకు కావలసిన మేరకు మించి వనరులను స్వాధీనం చేసుకోవానికి వీలులేదనే ఆంక్ష విధించడం జరిగింది.

పారిశ్రామిక విప్లవ కాలంలో స్వేచ్ఛా వాణిజ్య వ్యవస్థ (laissez-faire) ప్రాముఖ్యాన్ని పొందింది. దీని పకారం సంస్థలు చిన్నవిగా ఉండి, వాటిమధ్య పోటీ ఎక్కువగా ఉంటూ, వ్యాపార నిర్ణయాలు వివిధ స్థానాలలో తీసుకొంటూ, అధికార వికేంద్రీకరణ జరిగి ఉన్నంతకాలం సామాజికమైన మంచి, సామాజిక సంక్షేమం వాటంతటవే ఏర్పడతాయి ఎందుకంటే స్వేచ్ఛా వాణిజ్య యంత్రాంగం దానంతట అదే పనిచేస్తుంది పరిశ్రమలలో ప్రయివేటు పెట్టుబడి అధికంచేస్తున్న కొద్దీ ఉద్యోగస్తుల నియామకం ఎక్కువవుతుంది. వినియోగ ప్రవృత్తి ఏర్పడుతుంది. దీనితో ఉత్పత్తి ఎక్కువ చేయవలసి వస్తుంది. అనే అభిప్రాయముండేది. అట్లాగే వ్యాపార నిర్వహణలో ప్రత్యామ్నాయాలను ఎన్నుకొనేటప్పుడు లాభాలను అధికము చేయడం ముఖ్యాంశమని, తీసుకొన్న రిస్కును బట్టి లాభాలు ఉండవలెనని, మేనేజ్‌మెంట్‌కు చివరికి మూలధనం సమకూర్చిన వాటాదారులపట్ల బాధ్యతలు ఉండవలెనని అభిప్రాయపడేవారు. ఇదే అభిప్రాయం ఈ రోజులలో కూడా చాలామంది వ్యాపారస్తులలో ఉంది. క్రమంగా వనరుల దుర్వినియోగం జరిగింది. గొంతు కోతపోటీ (Cut throat Competition) ధరల తరుగుదలకు దారితీసింది. దీని ఫలితంగా వ్యాపార సంస్థల్లో పెద్ద మనుషుల ఒప్పందాలు, సమ్మేళనాలు ఏర్పడినాయి. ప్రభుత్వం పరిశ్రమలకు సహాయాన్ని, రక్షణను ఇచ్చింది. ఈరక్షణతో వ్యాపారం చాలా

అభివృద్ధి చెందింది. అయితే వ్యాపారం సామాజిక అవసరాలను గుర్తించలేమ. ఎందుకంటే అప్పటికి స్వేచ్ఛావాణిజ్య వ్యవస్థపై నమ్మకం ఉండడమే కారణం.

1880 నాటికి సామాజిక జవాబుదారీతనం పూర్తిగా (Social accountability) నశించలేమ. వ్యాపారంలో మూలధనికవాదంవల్ల శ్రామిక, మాధ్యమిక తరగతుల అసంతృప్తికి దారితీసింది. తరవాత కొన్నాళ్లకు వాటాదారులకు పెట్టుబడులపైన సముచితమైన లాభం సంపాదించవలెనంటే శ్రామికులను, వినియోగదారులను, ప్రభుత్వాన్ని సంతృప్తిపరచడానికి కొన్ని చర్యలు తీసుకోవలెనని స్పష్టమైంది. దీనినే పాటర్నిలిజమ్ (Paternilism) భావనా కాలమంటారు. వ్యాపారస్థులలో ఉండే పాటర్నలిస్టిక్ భావం క్రమంగా అధికమైనది. 1920లో జనరల్ఎలక్ట్రిక్ బోర్డు చైర్మెన్ ఓవెన్ యంగ్ (Owen D. Young), జనరల్ ఎలక్ట్రిక్ కంపెనీలో ఉండే 50,000 వాటాదార్లకు, 1,00,000 శ్రామికులకు ఎంతోమంది వినియోగదార్లకు, సాధారణ ప్రజలకు అతను ట్రస్టీగా ప్రకటించినాడు అంత పెద్దసంస్థ వ్యాపారాన్ని సక్రమంగాను, నిజాయితీగాను చేయడమే కాకుండా ప్రజలపట్ల ఉండే బాధ్యతలను నెరవేర్చేటట్లు, ప్రజలపట్ల ఉండే విధులను నిర్వర్తించేటట్లు చేయవలెనని డిమాండ్ చేసే హక్కు వీరందరికీ ఉండేది. జాన్ రాక్‌ఫెల్లర్ (John D. Rockfeller) కూడా దీనిని అంగీకరించినాడు. సంస్థ ఉద్దేశం సంపదను సృష్టించడంతోపాటు, సామాజిక సంక్షేమాన్ని నెలకొల్పడం కూడా అనే అభిప్రాయాన్ని అతడు వ్యక్తం చేసినాడు. 1930లో ఆర్థిక మాంద్యకాలంలో సంస్థ కొనసాగడమే కష్టమవడంతో ఇతర బాధ్యతలన్నింటిని కూడా త్రోసివేయడం జరిగింది. రాను రాను ప్రభుత్వము, శ్రామికుల ప్రతిఘటన ఎక్కువవడంతో సామాజిక బాధ్యతలను నిర్వర్తించడంలో వ్యాపారస్థులపై ఒత్తిడి తీసుకు వచ్చినారు. తనకు తాను సేవచేసుకోవడం కాకుండా సమాజం పట్ల బాధ్యతను నిర్వర్తించడమే తన జీవిత లక్ష్యంగా పెట్టుకొన్న రోబర్ట్ ఓవెన్ (Robert Owen) వ్యాపారం సామాజిక బాధ్యతలను చేపట్టడం ద్వారా రాణిస్తుందని ఋజువు చేసినాడు. తన స్వంత సంస్థలో అతను ఎన్నో మార్పులు తీసుకు వచ్చినాడు. అతని వ్యాపార జీవితంలో ఎన్నడూ ఎవరినీ ఉద్యోగంనుంచి తొలగించలేదు. అతడు సంస్థ మేనేజరుగా ఉండి ఆ తరవాత సామాజిక సంస్కర్త (Social Reformer) అయినాడు. సిబ్బంది నిర్వహణలో అతను ప్రావీణ్యాన్ని పొందినాడు. సక్రమంగా

సిబ్బందిని నిర్వహిస్తే ప్రయోజనకరంగా ఉంటుందన్నదే అతని ప్రాథమిక సూత్రము. ఇదే అభిప్రాయాన్ని అతడు ఎప్పుడూ వెలిబుచ్చు తుండేవాడు. అతడు తీసుకొని వచ్చే మార్పుల ఫలితంగా 50 శాతం లాభాలు పెరిగినాయి. తక్కిన చర్యలు కూడా పూర్తిచేస్తే 100 శాతం పెరుగుతాయని అంచనా వేసినారు. అయితే ఇతర పారిశ్రామిక వేత్తలు దీనిని గమనించలేదు: యునైటెడ్ కింగ్‌డమ్‌లో చిన్న చిన్న వ్యాపార సంస్థలలో వ్యాపారస్థులకు శ్రామికులతో వ్యక్తిగత సంబంధాలు ఉండేవి. ఆ పేరుతో వారిని హీనమైన పరిస్థితులలో పనిచేయించే వారు: ఆర్థిక వ్యవస్థలో ఆడమ్ స్మిత్ (Adam Smith). మాల్థస్ (Malthus) రికార్డో (Recardo)లు చెప్పిన స్వేచ్ఛా వాణిజ్యం ఉండేది. శ్రమనేది ఉత్పత్తిలో ఒక కారకం మాత్రమే. దీనిని మార్కెట్ మార్పుల ప్రకారం కొనవచ్చు, అమ్మవచ్చు. ఈ శ్రమ మనిషి శరీరంలో ఉంటుంది. దాన్ని ఏ విధంగానైనా ఉపయోగించుకో వచ్చు. ఈ అభిప్రాయంతోనే వ్యక్తులు ఫాక్టరీ చట్టాన్ని, నిబంధనలను వర్తకం చేయడానికి, లాభాలు పొందడానికి అవరోధం కలిగించేవిగా భావించే వారు, శ్రామికుల సంక్షేమానికి, వారి పరిస్థితుల మెరుగుదలకు ఇచ్చిన సలహాలను తోసిపుచ్చేవారు. విచారకరమైన విషయమేమిటంటే, శ్రామికుల సంక్షేమానికి వినియోగించే సొమ్ము ఇంకెందులోనూ రానంత మొత్తాన్ని సంపాదిస్తుందని ఋజువుచేసిన రోబర్ట్ ఓవెన్ (Robert Owen) సూత్రాన్ని వీరు గుర్తించలేక పోయినారు. పారిశ్రామిక వేత్తలు, చట్టప్రకారం గాని, శ్రామికులు ఒత్తిడి చేసే మేరకు మించిగాని ఎట్టాంటి అభివృద్ధి చర్యలు తలపెట్టలేదు.

1817లో సిబ్బందిని సక్రమంగా చూస్తేనే ప్రయోజనకరంగా ఉంటుం దనే రోబర్ట్ ఓవెన్ సూత్రాన్ని తిరిగి వంద సంవత్సరాల తరవాత బ్రిటన్‌లో 1916లో ఒక అఫీషియల్ కమిటీ (Official Committee) వెల్లడి చేసింది. చరిత్ర ప్రకారం తెలిసేదేమిటంటే పారిశ్రామిక వేత్తలు 'శ్రామికసంబంధాలను' అయిష్టంగాను చట్టానికి లోబడి మాత్రమే అంగీకరించినారు. జేమ్స్‌వాట్ జూని యర్ (James watt Junior 1770-1848), మేథ్యూ రోబిన్‌సన్ బౌల్టన్ (Mathew Robinson Boulton 1770—1842), వీరిరువురూ శ్రామిక సంక్షేమం కోసం సిక్‌నెస్ బెనిఫిట్ స్కీము (Sickness Benefit scheme) ఏర్పరచినారు. 18 వ శతాబ్దంలో ఒక ఫ్రెంచి వేదాంతి ఉత్పత్తిలో వ్యక్తుల

భాగాన్ని (Contribution) బట్టి ఆదాయ పంపిణీ జరగవలెననే అభి ప్రాయాన్ని వ్యక్తీకరించినాడు. యఫ్.డబ్ల్యు. టేలర్ (F.W Taylor,1856-1915) సామర్థ్యాన్ని, ఉత్పాదకతను పెంచడంపైనే తన కృషిని కేంద్రీక రించినా, అతడుకూడా తన శాస్త్రీయ నిర్వహణా సూత్రాలలో సామరస్యము, సహకారం ఉండవలెనన్నాడు. యజమానులు, శ్రామికులలో కూడా మానసిక విప్లవం (Mental Revolution) రావలెనన్నాడు. ఇదికాకుండా శాస్త్రీయ నిర్వ హణలో శ్రామికులు మేనేజర్లకు సేవకులు కాదు. మేనేజర్లే శ్రామికులకు సేవ కులు అని పేర్కొన్నాడు.

టేలర్ అనుచరుడైన గాంట్ (H.L. Gantt, 1861-1919) ఒత్తిడి చేసే యుగం (the era of force) తొలగి పోయి విజ్ఞాన యుగము (th era of knowledge) రావలెనని పేర్కొన్నాడు. సమష్టి ప్రయోజనమే భవిష్యత్ లక్షణమై ఉండవలె. అతడు చనిపోయేముందు 'ది రెలీజియన్ ఆఫ్ డెమోక్రసీ' (The Religion of Democracy) అనే పుస్తకాన్ని వ్రాసినాడు. చేసే సేవకు ప్రతిఫలం ఉండవలె. ఇదే మన పారిశ్రామిక వ్యాపార వ్యవస్థకు శాశ్వత మైన ఆధారమవుతుందని అందులో పేర్కొన్నాడు. ఈ సూత్రాన్ని తోసి పుచ్చడంవల్లనే సోషలిజం (Socialism), కమ్యూనిజం (Communism) ఉద్భవించినాయి. వీటిని తొలగించవలెనంటే 1847లో అబ్రహాం లింకన్ చెప్పిన సూత్రాలు ఆధారంగా పారిశ్రామిక వ్యాపార విధానాన్ని తిరిగి వ్యవ స్థాపన చేయవలె అని చెప్పినాడు. దీనిని బట్టి తెలుసుకోవలసిన పాఠమే ంటంటే వ్యాపార వ్యవస్థ సామాజిక బాధ్యతలను అంగీకరించవలె. ముఖ్య సేవకు అంకితం కావలె. లేదంటే సమాజమే దానిని స్వాధీనం చేసుకొని ప్రయోజనానికి వ్యాపారం పనిచేసేట్లు కృషిచేస్తుంది. హెన్రీ ఫయో (Henri Fayol 1841 – 1925) అడ్మినిస్ట్రేషన్‌కు (Administratio పధ్నాలుగు సూత్రాలను ప్రతిపాదించినాడు. అందులో కొన్ని డిసిప్లి (discipline), సమష్టి ఆసక్తికోసం వ్యక్తిగత ఆసక్తిని వదులుకోవడం, ఆర్డ (order), ధర్మము (Equity). ఫ్రాన్సులో అడ్మినిస్ట్రేటర్‌గా ఫయోల్ తెలు కొన్నదేమిటంటే చెడు అనేది లీడర్ల అసమర్థతవల్లనే ఏర్పడుతుంది. వ్యక్తిగతా సక్తిని వదులుకోవడం అనే సూత్రాన్ని గురించి అతడు చెప్పేదేమిటంటే, ఒక శ్రామికుని ఆసక్తికంటే వ్యవస్థ ఆసక్తి ముఖ్యము. కుటుంబంలో ఒక వ్యక్తికంటే

కుటుంబం ముఖ్యము. ఒక పౌరుడు లేక కొద్దిమంది పౌరుల ఆసక్తికంటే జాతి ఆసక్తి ప్రాధాన్యం వహిస్తుంది. అయితే వ్యక్తులలో ఉండే అజ్ఞానము, స్వార్థపరత్వము, బద్ధకము, బలహీనత ఇంకా కొన్ని వ్యక్తిగత వాంఛలు సమష్టి ఆసక్తిని త్రోసిపుచ్చి, వ్యక్తిగత ఆసక్తికే ప్రాధాన్యమిస్తాయి ఆర్డరు అంటే సక్రమమైన స్థానంలో సరియైన వ్యక్తి అని అర్థము. ప్రతి స్థానంలోను సరియైన వ్యక్తి ఉన్నట్లయితే పరిపూర్ణమైన సామాజిక ఆర్డరు (Social order) ఏర్పడుతుంది. ధర్మము అంటే దయార్ద్రత, న్యాయాల సమ్మేళనము. ఇది ఉన్నట్లయితే సిబ్బంది వారి విధులను హృదయపూర్వకంగా నిర్వర్తిస్తుంది. నమ్మకంగా పనిచేస్తుంది. శ్రామికుల విషయంలో వారు వాంఛించే ధర్మము, సమానత అంశాలను సక్రమంగా వ్యవహరించవలె.

హెన్రీ డెనిసన్ (Henry Dennison) అనే అమెరికా దేశస్థుడు మాధ్యమిక సంస్థగల పారిశ్రామిక వేత్త అతడు 1911లో లాభాలు పంచుకొనే పద్ధతిని (Profit Sharing Scheme), మేనేజ్‌మెంట్‌లో పాలుపంచుకొనే ప్లాను (Management Sharing Plan) తన వ్యాపారంలో ప్రవేశ పెట్టినాడు. 200 మంది శ్రామికులను ఓటుహక్కు ఉండే వాటాదార్లుగా మేనేజ్‌మెంట్‌తో భాగస్వామ్యాన్ని ఏర్పరిచినాడు. 1920 తొలి రోజులలోనే అతను శ్రామికులకు నిరుద్యోగ ఇన్సూరెన్సు స్కీమును ప్రారంభించినాడు. శ్రామికులను మేనేజ్‌మెంట్ సిబ్బందిగా తయారుచేయడానికి ఒక కార్యక్రమాన్ని ఏర్పరిచినాడు. వ్యాపారసంస్థ వాటాదారులకు సేవచేసినట్లుగానే శ్రామికులకు, సమాజానికి కూడా సేవచేయవలె అనే అభిప్రాయం అతనికి ఉండేది. వాల్టర్ రేథెన్ (Walther Rathnau) అనే అతడు జర్మనులో 80 కంపెనీలకు డైరెక్టరుగా ఉండేవాడు. అతడు 1921లో జర్మనీ గవర్నమెంటులో రికన్‌స్ట్రక్షన్ మంత్రి (Reconstruction Minister) అయినాడు. 1922లో విదేశాంగమంత్రి అయినాడు. అతని అభిప్రాయం ప్రకారం చలనాత్మకమైన పారిశ్రామిక వ్యవస్థలో సంస్థను యాజమాన్యాన్ని వేరుచేసి, లాభార్జనా ధ్యేయాన్ని ఉన్నత పరచవలె. వ్యాపార సంస్థలు శ్రామికులకు మేనేజ్‌మెంట్‌లో భాగాన్నిచ్చి ప్రజాస్వామిక సంస్థలుగా మారవలెనని అతని అభిప్రాయము. యాజమాన్యము, మేనేజ్‌మెంట్ వేరువేరుగా ఉండవలెనని అతని నమ్మకము. సంస్థ ప్రత్యేకమైనదిగా కనిపించవలె. దీనివల్ల శ్రామికులు తృప్తి పడతారు. లాభార్జనా ధ్యేయం కూడా సమాజ సేవా ఉద్దే

శాలకు లోబడి ఉండవలె. ఆలివర్ షెల్డన్ (Oliver Sheldon) అనే బ్రిటిష్ మేనేజ్‌మెంట్ నిపుణుడు 1923లో 'ది ఫిలాసఫీ ఆఫ్ మేనేజ్‌మెంట్' (The Philosophy of Management)అనే పుస్తకాన్ని ప్రచురించినాడు. అందులో సమాజంలో శ్రామికులు, పెట్టుబడిదార్లతో పాటు మేనేజ్‌మెంట్ కూడా ఒక భాగస్వామిగా పేర్కొని దాని సామాజిక బాధ్యతలను వివరించినాడు. నైతిక, శాస్త్రీయ సూత్రాలను పెంపొందించవలసిన ఆవశ్యకతను నొక్కి చెప్పినాడు.

గొప్ప వ్యాపార నిర్వాహకుడు, హార్వర్డ్ స్కూల్ ఆఫ్ బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ ప్రొఫెసర్ అయిన చెస్టర్ బర్నార్డ్ (Chester Barnard) అనే ఆయన 1938లో 'ది ఫంక్షన్స్ ఆఫ్ ది ఎక్సిక్యూటివ్' (The Functions of the Executive) అనే పుస్తకాన్ని ప్రచురించినాడు. అందులో ఆర్థిక సిద్ధాంతాన్ని ఆర్థిక ఆసక్తిని ద్వితీయ స్థానానికి తోసివేస్తేగాని అతనికి వ్యవస్థలో వ్యక్తుల ప్రవర్తన అర్థం కాలేదని పేర్కొన్నాడు. 1940లో హార్వర్డ్ బిజినెస్ రివ్యూ(Harward Business Review)లో పబ్లిష్ అయిన అతని ఆర్టికల్‌లో వ్యాపార సంస్థ మేనేజ్‌మెంట్ విధానంలో వినియోగదారు కూడా అంతర్గతమైన సభ్యుడు కావలెనని చెస్టర్ బర్నార్డ్ వాదించినాడు. వాటాదారులు, శ్రామికులతో సమానంగా వినియోగదార్లను కూడా పరిగణనలోకి తీసుకోవలెనన్నాడు.

సీబమ్ రౌన్‌ట్రి (B. Seebohm Rowntree) అనే ఆయన రౌన్‌ట్రి అండ్ కంపెనీలో డిపార్టమెంటల్ మేనేజరుగా ఉండేవాడు. అంతే కాకుండా యునైటెడ్ కింగ్‌డమ్‌లో రక్షణ మంత్రిత్వ శాఖలో 1916 నుంచి 1918 వరకు శ్రామిక సంక్షేమ డిపార్టుమెంటు (Labour welfare Department) డైరెక్టరుగా కూడా ఉండేవాడు. పార్టిసిపేటివ్ మేనేజ్‌మెంట్ (Participative Management) ప్రవేశ పెట్టడానికి అతడు చర్యలు తీసుకొన్నాడు. శ్రామిక సౌకర్యాలు, సలహాలు, ఎడ్యుకేషన్ ప్రోగ్రాములు, వినోద సదుపాయాలు, ఇళ్ల సదుపాయాలు మొదలయిన ఎన్నో చర్యలను సూచించినాడు. ఎల్టన్‌మయో (Elton Mayo) ప్రకారం నిరంకుశమైన పర్యవేక్షణా విధానం తొలగిపోయి ఆ స్థానంలో సాధారణ, సౌహార్ద్రమైన నియంత్రణ రావలెనన్నాడు. దీనివల్ల శ్రామికులు స్వేచ్ఛగా పనిచేయగలుగుతారు. పీటర్ డ్రకర్ (Peter F.Drucker) అభిప్రాయం ప్రకారం సబార్డినేటుపై అధికృత రూపంలో సుపీరియర్ నియంత్రణకు మేనేజ్‌మెంట్‌లో స్థానం లేదు. నియంత్రణా పరిమాణము

(Span of Control) తక్కువగా ఉండే సమతల వ్యవస్థా ( Horizon'al Organiisaton) నిర్మాణం మంచిదని అతని అభిప్రాయము. వ్యాపారంలో శ్రామికులు స్వేచ్ఛగా ఉండవలెనని చెబుతూ చాలామంది వ్యాపారస్తులు, పారిశ్రామికవేత్తలు, మేనేజ్‌మెంట్ నిపుణులు వ్యక్తపరచిన అభిప్రాయాలు చరిత్రలో నిదర్శనంగా ఉన్నాయి.

విలియమ్ స్ప్రీగల్ (William R. Spriegel) 'ప్రిన్సిపుల్స్ ఆఫ్ బిజినెస్ ఆర్గనైజేషన్ అండ్ ఆపరేషన్' అనే అతని పుస్తకంలో ఒక ఆటోమొబైల్ వర్తకుడు 1927లో పలికిన మాటలను ఉదహరించినాడు. అవి 'మా సంపదను మా వినియోగదార్లు, శ్రామికుల ప్రయోజనంకోసం నిర్వహించవలసిన ట్రస్టీషిప్‌గా పరిగణిస్తాము.'

ఆ విధంగా ట్రస్టీషిప్ సిద్ధాంతం ఒకేసారి ఆకస్మాత్తుగా మహాత్మాగాంధీ ప్రతిపాదించినదికాదు. పాశ్చాత్యదేశాలలో చాలా రోజుల కిందటే వ్యాపారస్థులకు ఈ అభిప్రాయం ఉండేది. అప్పటి ఆ భావనలే ఈ 20వ శతాబ్దంలో సామాజిక బాధ్యతలుగా వెల్లడి అవుతున్నాయి. గాంధీ ప్రతిపాదించిన ట్రస్టీషిప్ సిద్ధాంతం వ్యాపార సామాజిక బాధ్యతలను మరింత విస్తృతం చేసింది.

## సామాజిక బాధ్యతలపై ఉండే విమర్శ

వ్యాపారస్తులు సామాజిక బాధ్యతలు నిర్వర్తించవలసిన ఆవశ్యకతను గుర్తించినప్పటికీ, వాటిపై విమర్శకూడా లేకపోలేదు. ఆ విమర్శను ఈ దిగువన చర్చించడం జరిగింది.

## వ్యాపారస్తుల మధ్య పోటీ

వ్యాపారస్తులకు ఎంత సదుద్దేశం ఉన్నప్పటికీ, మార్కెట్‌లో డిమాండ్ ఉన్న వస్తువును కనీస వ్యయంతో ఉత్పత్తిచేయడానికి మించి సామాజిక బాధ్యతను చేపట్టలేకపోతున్నారు. వ్యాపారస్తుడు ఏదైనా ఒక ప్రజోపయోగ కార్యక్రమాన్ని చేపడితే దానివల్ల ఉత్పత్తి వ్యయం పెరిగిపోతుంది. అంతేకాకుండా తక్కిన వ్యాపారస్తులందరూకూడా అట్లాంటి కార్యక్రమాలలో పాల్గొంటే తప్ప తాను వ్యాపారంలో వారితో పోటీచేయలేడు. అయితే తక్కిన పోటీదారులందరూ ఈ విధంగా అట్లాంటి సత్కార్యాలు చేపట్టడం ఎప్పుడూ జరగని పని. అట్లాంటప్పుడు సామాజిక దృక్పథంతో వ్యాపారం చేసే ఈ వ్యాపారస్తుడు దీర్ఘకాలంలో విఫలుడవుతాడు. తన ప్రయత్నాలు వ్యర్థమవుతాయి. దీని ప్రకారం

ఏ వ్యాపారస్తులకైతే పోటీ లేకుండా గుత్తాధిపత్యం ఉంటుందో అట్లాంటివారు మాత్రమే సామాజిక బాధ్యతలను చేపట్టగలుగుతారు అంటే ప్రజోపయోగ కార్యాలకోసం కొంత వ్యయాన్ని చేయగలుగుతారు. ఇట్లాంటి వ్యాపారస్తులు గొప్ప గొప్ప కార్యకలాపాలను సామాజిక శ్రేయస్సుకోసం నిర్వర్తించగలుగుతారు. అయితే అది కేవలం వారికి గుత్తాధిపత్యం ఉండడంవల్ల, ప్రజలనుంచి అధిక లాభాలు సంపాదించడంవల్ల ఆ లాభాలనుంచి కొంత వ్యయాన్ని చేయగలుగుతారు. కాని ఇక్కడ ఆలోచించవలసిన విషయం ఒకటుంది. అదేమిటంటే గుత్తాధిపత్యపు లాభాలు వచ్చినప్పుడే సామాజిక బాధ్యతలు నిర్వర్తించవచ్చు. అట్లాంటప్పుడు గుత్తాధిపత్యపు ధరలను, నిబంధనలు ఏర్పరచడంద్వారాగాని పోటీని పెంపొందించడం ద్వారాగాని క్రమబద్ధం చేయడం ఉత్తమమా? లేదా సామాజిక బాధ్యతలనే పూర్తిగా మరచిపోవడం ఉత్తమమా? అనేది నిర్ణయించవలె. కొంతమంది పోటీదార్లు సామాజిక బాధ్యతలను నిర్వర్తించకపోవడంవల్ల మిగిలిన వ్యాపారస్తులుకూడా వేతనాలు, పని సౌకర్యాలు, వస్తు నాణ్యత, ఆర్థిక స్థిరత్వం మొదలయిన విషయాలలో సక్రమమైన పద్ధతులను విడనాడవలసి వస్తుంది. వ్యాపారస్తులు దివాలాతీసే పరిస్థితి వచ్చినట్లయితే వారిని సామాజిక బాధ్యతలు చేపట్టమనడం సముచితం కాదు. వ్యాపార కార్యకలాపాలలో చట్టపూర్వకంగా కొన్ని ప్రామాణికాలు నిర్ణయించినప్పటికీ, అవిశ్వాసంగా ప్రవర్తించే కొంతమంది పోటీదార్లవల్ల, ఇతర వ్యాపారస్తులుకూడా ప్రామాణికాలను విడనాడితే తప్ప వారితో పోటీ చేయలేరు. పరిపూర్ణమైన పోటీ యథార్థానికి ఉండదని అందరికీ తెలిసిందే. నేటి వ్యాపార ప్రపంచమంతటాకూడా వివిధ స్థాయిలలో గుత్తాధిపత్యం చోటుచేసుకొంది. అయినా అన్ని వ్యాపార సంస్థలకు కూడా కొంతమేరకు పోటీ అనేది ఉంటుంది. పోటీ అనేది తాత్కాలికంగా లేకపోయినప్పటికీ, కొన్నాళ్లకైనా రావచ్చు. అంటే కొత్త సంస్థలు స్థాపించవచ్చు. కొత్త ఉత్పత్తి పద్ధతులు తెలుసుకోవచ్చు. కొత్త వస్తువులు ఉత్పత్తి చేయవచ్చు. అయితే వ్యాపారంలో చాలామేరకు ఉత్పత్తి, ధరలు, అమ్మకాలు, ఆదాయ పంపిణీ, విత్తము, సిబ్బంది మొదలయిన అంశాలలో సంస్థలకు స్వాతంత్రత ఉన్నది. ఈ సంస్థలకు నియంత్రించే శక్తి ఉంటుంది. ఈ సందర్భంలో వ్యాపారస్తుల మధ్య పోటీని పెంపొందించడం సమంజసంగా ఉంటుందా లేదా గుత్తాధిపతులను సామాజిక శ్రేయస్సుకు కృషిచేసే విధంగా మార్చడం సమంజసంగా

ఉంటుందా? పరిపూర్ణమైన పోటీ ఉండే మార్కెట్‌ను సృష్టించవలెనంటే ఇమిడి ఉన్న సాంకేతిక, ఆచరణపూర్వకమైన సమస్యలు, ఇబ్బందులు ఎన్నో ఉన్నాయి. అంతేకాకుండా పై రెండు ధ్యేయాలు ఒకదాని కొకటి వ్యతిరేకమైనవి కూడా కాదు. అందుచేత అటు పోటీని ప్రోత్సహిస్తూ, ఇటు వ్యాపారస్తులలో సామాజిక బాధ్యతల ప్రాధాన్యాన్ని గుర్తించవలె.

తొందరగా మార్పుచెంది, అభివృద్ధిచెందుతున్న సమాజంలో, పరిశ్రమలో పోటీ ఉన్నప్పటికీ సమాజం కొంతవరకు ప్రయోజనం పొందవచ్చు. అంటే మెరుగైన పని పరిస్థితులు, తక్కువ పని గంటలు, అధికమైన భద్రత (Safety), ఎక్కువ స్వాతంత్రత, నాణ్యముగల వస్తువులు మొదలయినవాటి రూపంలో సమాజానికి ప్రయోజనం ఉంటుంది వస్తు, సేవలను అధికంగా ఉత్పత్తిచేయడంలోనే ప్రయోజనం ఉందనుకోవడం పొరపాటు జీవన ప్రమాణం పెంచడానికి కావలసినది ఒక వస్తు, సేవల భౌతిక పరిమాణమే (Physical Quantity) కాదు. దానితోపాటు వస్తు సేవలు ఎట్లాంటి పరిస్థితులలో ఉత్పత్తి చేయబడినాయో కూడా ముఖ్యమే. వస్తు, సేవలు ఉత్పత్తి చేయడంలో మెరుగైన పరిస్థితులు కల్పించడం సామాజికంగా వాంఛనీయమైనదే. అందువల్ల వ్యాపార సంస్థకు లాభదాయకంగానే ఉంటుంది. ఎందుకంటే వాటివల్ల ఉత్పత్తి వ్యయాలయినా తగ్గుతాయి. లేదంటే ఆదాయమైనా పెరుగుతుంది. వ్యాపార నిర్వహణలో ఏదైనా ఒక మార్పు తీసుకొని రావడంవల్ల వ్యయం తగ్గినా, ఆదాయం పెరిగినా, ఆ ప్రయోజనం పొందడంకోసం ఆ మార్పు అవలంబించడం జరుగుతుంది. అందుచేత పనిలో తక్కువ గంటలు, పనిచేసే ప్రదేశంలో మంచి వెలుతురు, పరిశుభ్రమైన గదులు ఉన్నట్లయితే, శ్రామికుల సామర్థ్యం పెరిగి శ్రామిక యూనిట్ వ్యయం తగ్గుతుంది. ఇట్లాంటి మార్పులు తీసుకొనిరావడానికి వెనుకాడవలసిన పనిలేదు. ఎందుకంటే అటు వాణిజ్యపరంగాను, ఇటు సామాజిక దృక్పథంలో కూడా అవి ప్రయోజనకరమే. అయితే ఈ చర్యలనుంచి వచ్చే ప్రయోజనం, సామాజిక దృక్పథంలో అంగీకృతమైన ప్రమాణాలకు కొంతవరకు సాపేక్షంగా ఉంటుంది. ఉదాహరణకు, రోజుకు 12 గంటలు పని చేయడం సముచితమైనదిగాను, సక్రమమైనదిగాను భావించే సమాజంలో పని గంటలు తగ్గించడంవల్ల ఉత్పత్తి తగ్గిపోతుంది అట్లాగే రోజుకు 12 గంటలు పని చేయడం చాలా అధికమని భావించే సమాజంలో పని గంటలు తగ్గించడంవల్ల ఉత్పత్తి పెరగవచ్చు.

ఒకానొక పరిస్థితిలో 12 గంటల నుంచి 10 గంటలకు తగ్గించడంవల్ల వ్యాపారస్తులకు ప్రయోజనం లేదు. వేరొక రకమైన భావాలు, అభిప్రాయాలు, విలువలు కల పరిస్థితులలో పని గంటలు తగ్గించడంవల్ల వ్యాపారస్తులకు ప్రయోజనం ఉంటుంది. ఈ దృక్పథంలో సమాజంలో అంగీకృతమైన ప్రమాణికాలు కొంత వరకు వ్యాపార విధానాలవల్ల వచ్చే ప్రయోజనాన్ని నిర్ణయిస్తాయి. అదేవిధంగా అపరిశుభ్రమైన గదులే సంస్థలో సాధారణ విషయమైననాడు, శుభ్రమైన గదులు కల్పించవలసిన ఆవశ్యకత వ్యాపారస్థునికుండదు. అట్లా కాకుండా సామాజికంగా అంగీకృతమైన ప్రమాణాల ప్రకారం ఇంకా మెరుగైన పరిస్థితులు కల్పించవలసి ఉంటే, వ్యాపారస్తులు అట్లాంటి పరిస్థితులను కల్పించడం ద్వారా ప్రయోజనం పొందగలుగుతారు. ఇదే పద్ధతి పని త్వరితము (Speed) ఉద్యోగ స్థిరత్వము (employment stability), వృద్ధ కాల భద్రత (old age security), వినోదము, మొదలయిన విధానాలకుకూడా అనువర్తించడం జరుగుతుంది.

### అధిక వ్యయాలు

సామాజిక బాధ్యతలు నిర్వర్తించడానికి సంబంధించి, వ్యాపారస్తులు వాటిని చేపట్టినట్లయితే అధిక వ్యయాలకు గురి అవుతారు. తిరిగి వాటిని అధిక ధరల రూపంలో గాని, తక్కువ వేతనాల రూపంలో గాని వినియోగదారుల నుంచి లేదా శ్రామికుల నుంచి రాబట్టుకోవలసి ఉంటుంది. వ్యాపారస్తులు ఎక్కువ వేతనాలు, పెన్షనులు, వినోదపు కార్యకలాపాలు, స్థిరమైన ఉద్యోగ పరిస్థితి, దాన ధర్మాలు, ఆహ్లాదకరమైన పని పరిస్థితులు, యాజమాన్యంలో శ్రామికులు పాల్గొనడం, సహజ వనరుల పరిరక్షణ, పెట్టుబడి స్థిరీకరణ మొదలైన అంశాలను చేపట్టినట్లయితే, వీటికి అదనంగా ఖర్చు చేయవలసి ఉంటుంది. అంతేకాకుండా ఈ వ్యయాన్ని వినియోగదారుని నుంచి గాని, శ్రామికుల నుంచి గాని రాబట్టుకోకపోయినట్లయితే, ఆ సౌకర్యాలను కలిగించడం సాధ్యంకాదు. అయితే ఇక్కడ పరిష్కరించవలసిన ప్రశ్న ఏమిటంటే ప్రజలకు కావలసింది తక్కువ ధరలా మెరుగైన ఉత్పత్తి పరిస్థితులా? లేదా వారు కొనే వస్తువులకు తక్కువ ధరలా?

సామాజిక బాధ్యతలు నిర్వర్తించవలెనంటే అధిక వ్యయమవుతుందనడంలో సందేహం లేదు. ఈ వ్యయాలు వస్తువులకు అధిక ధరలు విధించడం ద్వారా గాని, శ్రామికులకు తక్కువ వేతనాలు చెల్లించి గాని రాబట్టుకోడానికి

అవకాశముంది జీవన ప్రమాణం అధికం చేయడానికి ఉత్పత్తిని పెంచవలె. అంటే ఇంతకు ముందుకంటే ఇప్పుడు అదనంగా ఉత్పత్తి కారకాలు వినియోగించవలసి ఉంటుంది. వ్యాపారస్తుడు వృద్ధకాల పెన్షన్ కల్పించవలెనన్నా, శ్రామికులకు భద్రత చేకూర్చే ఖరీదైన యంత్రాలు, ఎక్విప్‌మెంట్ కొనవలెనన్నా, పరిశుభ్రమైన, ఆహ్లాదకరమైన పని పరిస్థితులు ఏర్పరచవలెనన్నా, వీటివల్ల వ్యయం ఎక్కువ అవుతుంది కాబట్టి, అతనిపైన ఒక రకమైన పన్ను విధిస్తున్నట్లే.

అయితే లాభాలను తగ్గించి, వారికొచ్చే లాభాలనుంచే ఈ సామాజిక బాధ్యతలకు అయ్యే వ్యయాన్ని ఖర్చు చేయడం కూడా వ్యాపారస్థుని సామాజిక బాధ్యతే. సామాజిక బాధ్యతలను చేపట్టడంవల్ల వ్యాపారస్తుడు కొంత వ్యయాన్ని చేస్తే తిరిగి ఆ వ్యయాన్ని వినియోగదారులనుంచి గాని, శ్రామికులనుంచి గాని రాబట్టుకోడం సముచితం కాదు. వ్యాపారస్తులు గుత్తాధిపత్య పరిస్థితివల్ల ఎక్కువ లాభాలు ఆర్జించేటట్లయితే తప్పకుండా వారు సామాజిక బాధ్యతలకు అయ్యే వ్యయాన్ని వారికొచ్చే లాభాలనుంచి ఖర్చు చేయడమే కాకుండా, దానితోపాటు వినియోగదారులకు అమ్మే వస్తువులకుకూడా తక్కువ ధరలు నిర్ణయించవలె. శ్రామికులకు ఎక్కువ వేతనాలు చెల్లించవలె. సామాజిక బాధ్యతలు నిర్వర్తించడంవల్ల అధిక వ్యయమవుతుందని తెలుసుకొన్నాము. దీనివల్ల వినియోగదారులకు అమ్మే వస్తువుల ధర ఎక్కువగా ఉంటుంది. వినియోగదారులకు అమ్మే వస్తువులకు అధిక ధరలు నిర్ణయించకూడదన్న కారణంగా, సామాజిక బాధ్యతలు విస్మరించవలెనని అర్థంకాదు. ధరలు ఎక్కువ చేయడంవల్ల ఉత్పత్తి చేసిన వస్తువుల పరిమాణం (సంఖ్య) తగ్గిపోతుంది. అయితే సమాజం శ్రేయస్సు కేవలం ఉత్పత్తి చేసిన వస్తువుల భౌతిక పరిమాణంపైనే కాక, ఆ ఉత్పత్తి జరిగేటప్పుడు ఉండే పని పరిస్థితులపైనకూడా ఆధారపడి ఉంటుంది. ఉదాహరణకు హీనమైన పని పరిస్థితులలో ఉత్పత్తి చేసే ఒక వస్తువు ధర రూ. 10 కావచ్చు. కాని అదే వస్తువు మెరుగైన పరిస్థితులలో ఉత్పత్తిచేస్తే వినియోగదారునికి దాని ధర రూ. 25 కావచ్చు. కాని మానవ సంక్షేమ దృక్పథంలో ఆలోచిస్తే వినియోగదారునికి వచ్చే ఆ నష్టం, అవి ఉత్పత్తి చేయడంలో కల్పించిన మెరుగైన పరిస్థితులవల్ల శ్రామికులు పొందే ప్రయోజనం కంటే చాలా తక్కువ.

అందుచేత మన జీవనప్రమాణంలో ముఖ్యంగా రెండు అంశాలు ఉంటాయి.

i) ఉత్పత్తి చేసిన వస్తు, సేవలు

ii) ఆ ఉత్పత్తి కొనసాగించిన పని పరిస్థితులు

ఉత్పత్తి జరిపే పని పరిస్థితులు మెరుగుపరచడంవల్ల ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందినట్లయితే, ఆ అభివృద్ధి ఉత్పత్తి చేసే వస్తువులు, సేవలు తగ్గించినందువల్ల వచ్చే ప్రతిఫలమయినప్పటికీ సముచితమే. ఇతర ఆర్థిక సమస్యలవలెనే ప్రస్తుత సమస్య ఏమిటంటే జీవన ప్రమాణాన్ని నిర్ణయించే రెండు అంశాలు. అంటే ఉత్పత్తి చేసిన వస్తు, సేవలు, ఉత్పత్తి జరిగేటప్పుడు కల్పించిన పని పరిస్థితుల మధ్య సమతౌల్యతను ( balance ) సాధించడమే.

కొన్నిసార్లు వ్యాపారస్థులు కల్పించడానికి వీలులేని మెరుగైన పరిస్థితులు శ్రామికులు డిమాండ్ చేసే ప్రమాదముంది. ఆ విధంగా శ్రామికులు పొందిన ప్రయోజనాలు అక్రమమైనవే. ఎందుకంటే దానివల్ల అధిక ధరల రూపంలో వినియోగదారులకు వచ్చే నష్టము, ఆ శ్రామికవర్గానికి వచ్చే ప్రయోజనంకంటే చాలా ఎక్కువగా ఉంటుంది.

సామాజికబాధ్యతలు నిర్వర్తించడానికిచేసే వ్యయాలను బదిలీ చేయడానికి వీలున్నది కాబట్టి దాని నాధారంగా చేసుకొని సామాజిక బాధ్యతలు చేపట్టవలె. వ్యాపారస్తులు సామాజిక బాధ్యతల నిర్వహణకు అయ్యే వ్యయాన్ని వారికొచ్చే లాభాలనుంచే ఖర్చు చేయవలసి ఉంటుందంటే అది చాలా అనుచితము. ఇది వ్యాపారస్తునిపై పెద్ద ఒత్తిడి అవుతుంది. సమాజానికి కావలసినది వ్యాపారస్తులు దాన ధర్మాలు చేయడం కాదు. కేవలం వారి కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించడమే.

## వ్యాపారసుని కుండే ఆసక్తి

సామాజిక బాధ్యతలపై ఉండే ఇంకోవిమర్శ ఏమిటంటే వ్యాపారస్థులకు ముఖ్యంగా లాభాలపైన, వారి సంస్థలపైన మాత్రమే ఆసక్తి ఉంటుంది. అందు చేత వారిని సామాజిక బాధ్యతలు నిర్వర్తించమని అడగడం అసమంజసము. వారి దృష్టిఅంతా కేవలం లాభాలు ఆర్జించడం పైనే కేంద్రీకరిస్తారు. ఆర్థిక పరంగానే ఆలోచిస్తారు. కాబట్టి వారు వారి కార్యకలాపాలలో ఇతర అన్య సామాజిక అంశాలను గమనించలేరు. వారు సామాజిక దృష్టితో విధానాలను రూపొందించలేరు అనే అభిప్రాయం ఉంది. ఇది కొంతవరకూ యథార్థమే అయినప్పటికీ, వ్యాపారస్థునికి లాభాలపైనే ఆసక్తి ఉంటుందనుకోవడం

పొరపాటు. ఎందుకంటే వ్యాపారస్థుడు కూడా సమాజంలో నివసించే వ్యక్తే. సమాజంలో ఉండే విలువలు, భావాలలో అతడు కూడా పాలుపంచుకొంటాడు. ఇతరుల దృష్టిలో తనకు మంచి ప్రతిష్ఠ ఉండవలెననుకొంటాడు. ఆ ప్రతిష్ఠ సాధించడానికి ఇతరులు తననుంచిఆశించేదానిని వారికి అందించవలెననుకొంటాడు. అందుకే అతనిపైఉండే ఒత్తిడులను (demands) అతడు ఎప్పటికప్పుడు తెలుసుకొంటాడు. ముఖ్యంగా శ్రామికులు, ప్రభుత్వం, ప్రజలు అతని నుంచి ఏమి ఆశిస్తారో అతనికి తెలుస్తుంది. ఆర్థిక సమస్యలతోపాటు అతనికి శ్రామిక సమస్యలు కూడా తెలుస్తాయి. అతని విధానాలకు, సామాజిక ఫలితాలకు మధ్య సర్దుబాటు చేయవలసిన ఆవశ్యకతను అతడు గుర్తించగలడు. ప్రజల అభిప్రాయానికి అతడు ఇచ్చే ప్రాధాన్యము అతని ప్రవర్తనలో వెల్లడి అవుతుంది.

**అధికారము**

సామాజిక బాధ్యతలపై ఉండే ఇంకో విమర్శ ఏమిటంటే, వ్యాపారస్థులు అధికారాన్ని స్వాధీనం చేసుకోవడానికి, దానిని సముచితమైనదిగా ఋజువు చేయడానికి, ఈ సామాజిక బాధ్యతల సిద్ధాంతాన్ని వినియోగించుకొంటారు. నేటి సమాజంలో ముఖ్యంగా అధికారానికి సంబంధించి పోటీ పడతారు. కాపిటలిజమ్ (Capitalism )లో అధికారం ముఖ్యంగా వ్యాపారస్థులలోనే ఉంటుంది వారే ముఖ్యమైన ఆర్థిక నిర్ణయాలు తీసుకొంటారు. అంటే ఏ వస్తువులు ఉత్పత్తి చేయవలె, ఉత్పత్తిని ఏ విధంగా కొనసాగించవలె, ఎవరిని నియమించవలె, పని సౌకర్యాలు ఏ విధంగా ఉండవలె, ఆదాయం ఏ విధంగా పంపిణీ జరగవలె. మొదలైన నిర్ణయాలు వ్యాపారస్థులే తీసుకొంటారు. కమ్యూనికేషన్ మీడియమ్లపై (Communication media ) వారి కుండే నియంత్రణ వల్ల వ్యాపారస్థులు, వినియోగదారుల అభిరుచులను మార్చగలరు. ప్రజల అభిప్రాయాలను కూడా మార్చగలరు. వారికుండే ఆర్థిక శక్తి (Economic Power) ద్వారా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రభుత్వంపై పలుకుబడి సాధించగలరు. వ్యాపారస్థులు వారికుండే అనుకూల పరిస్థితి వల్ల వారే సమాజానికి లీడర్లు, సంరక్షకులుగా అభిప్రాయాన్ని కలిగిస్తారు. వ్యాపారస్థులు అధికారాన్ని వారి సొత్తుగా చేసుకొని వారే సామాజిక అవసరాలు నిర్ణయించే వర్గంగా భావించినంత కాలం సామాజిక బాధ్యతల సిద్ధాంతం సందేహాస్పదంగానే మిగిలి పోతుంది.

## సామీప్య పరోక్ష నైతిక బాధ్యతలు

సామాజిక బాధ్యతలపై ఉండే విమర్శ ఏమిటంటే, వ్యాపారస్థులు మోయ లేనంత భారాన్ని అవి వారిపై ఉంచుతాయి. వారి నైతిక విలువల నుంచి వారిని దూరం చేస్తాయి. చాలామంది వ్యాపారస్థులు ఏదో సామాజిక మార్పు (Social change) లేదాపరోక్షమైన (Remote)సామాజిక సమస్యల పరిష్కారం చేయ వలెననే ఉపేక్షతో వారి సమీపంలో ఉండే వ్యక్తులపట్ల వారికి గల బాధ్యతలు, వారికుండే ప్రత్యక్ష సమస్యల పరిష్కార బాధ్యత తోసిపుచ్చడం జరుగు తుందనే అభిప్రాయముంది. అయినా సామాజిక బాధ్యతలపై ఉండే ఈ విమర్శ సక్రమమైనది కాదు. ఎందుకంటే ఈ విమర్శలో సమాజంలోని వివిధఅంశాలు ఒక దానితో ఒకటి ముడిపడి ఉంటాయనే సత్యాన్ని గుర్తించడం లేదు. ఇందులో వ్యాపారస్థుని కార్యకలాపాల ప్రభావం సమాజంపై ఏ విధంగా ఉంటుందో గుర్తింపు జరగడం లేదు. యథార్థానికి వ్యాపారస్థుల కుండే నైతిక బాధ్యతలు కేవలం తమ చుట్టు పక్కల పరిస్థితులకు, తమకు సమీపంలో ఉండే వ్యక్తులకు పరిమితం కాకూడదు. ఆర్థిక స్థిరత్వం సాధించడం. వర్గ విభేదం తొలగించడం మొదలయిన సామాజిక ధ్యేయాల కోసం పాటుపడుతున్నంత మాత్రాన, వ్యాపారస్థుడు తన ఇరుగు పొరుగు వారిని అన్యాయం చేస్తున్నట్లు కాదు. అదే విధంగా తన సమీపంలో ఉండే వ్యక్తులకు అతడు కొన్ని విధులు నిర్వర్తిస్తున్నందువల్ల పరోక్షంగా తనకుండే బాధ్యతలు విడనాడవచ్చని కూడా కాదు.

# 4

# భారతదేశంలో వ్యాపారసంస్థల సామాజిక బాధ్యతలు

భారత దేశంలో సామాజిక బాధ్యతలను నిర్వర్తించవలసిన ఆవశ్యకత రెండు రకాలుగా ఏర్పడుతుంది. ఒకటి వ్యాపార సమాజంలో ఉండే స్వప్రయోజనము రెండు సామాజిక శ్రేయస్సు. అభివృద్ధిచెందిన ఇతర దేశాల వలెనే భారత దేశంలో కూడా సంక్షేమ సమాజము (Welfare Society) అనే సిద్ధాంతం అంగీకరించబడింది. ఇది రాజ్యాంగంలోనే పొందుపరచడం జరిగింది. నిర్దేశిక సూత్రాల (Directive Principles) ప్రకారం సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయంతో కూడుకొన్న సామాజిక శాంతిని వీలైనంత ఎక్కువగా పరిరక్షించి ప్రజా సంక్షేమాన్ని స్థాపించడానికి ప్రభుత్వం కృషి చేయవలె. అంతే కాకుండా ప్రజా సంక్షేమార్థం సమాజ వనరుల స్వాధీనాన్ని (Ownership) వికేంద్రీకరణ చేసి, వాటిపై నియంత్రణ అధికారాన్ని పొందవలె సంపద, ఉత్పత్తి కారకాలు కేంద్రీకరణానికి దారితీసి, ప్రజలకు హాని జరగకుండా ఆర్థిక విధానాన్ని కొనసాగించవలె.

నిర్దేశిక సూత్రాలు ముఖ్యంగా రెండు లక్ష్యాలను సూచిస్తాయి. ఒకటి ప్రజా సంక్షేమము, రెండు సాంఘిక, ఆర్థిక న్యాయము (Socio-economic Justice), వ్యాపార సంస్థలు సాంఘిక న్యాయాన్ని భద్రపరచ వలసిన బాధ్యతను విడనాడినట్లయితే, ఆ బాధ్యతను ప్రభుత్వమే చేపడుతుంది. అయితే సంస్థలే ఈ బాధ్యతను వహించి నప్పుడు, ఆర్థిక ప్రగతి యంత్రాంగం కూడా తమ చేతులలో ఉండవలెనని డిమాండు చేస్తాయి. ఎందువల్లనంటే ఆర్థిక శక్తి లేకుండా సాంఘిక న్యాయం చేకూర్చడం సాధ్యం కాదు. అరవింద్ మఫతలాల్ (Arvind N. Mafatlal) అనే అతను ఇదే అభిప్రాయాన్ని వెలిబుచ్చినాడు. అంతేకాకుండా "అభివృద్ధి సాధించగల మేనేజర్‌లుగా మన పాత్రను నిర్వర్తించ

వలెనంటే. ఆర్థిక ప్రగతికి సామాజిక సంక్షేమం ఒక ముఖ్యాంశంగా గుర్తించ
వలె''నన్నాడు. అదే విధంగా లాలా చరత్ రామ్ (Lala Charat Ram)అనే
అతను ''వ్యాపారం కొనసాగించవలెనంటే సమాజానికి సేవ చేయవలె'' అని
చెప్పినాడు. ఇండియన్ టొబాకో కంపెనీ చైర్మన్ హక్సర్ (A.N. Haksar)
''పరిశ్రమ సమాజంలో ఒక భాగము. దానికి మానవాళి అభివృద్ధి, సాంఘిక
న్యాయము సాధించగలశక్తి ఉంటుంది'' అన్నాడు. రామక్రిష్ణ బజాజ్ అనే పారి
శ్రామికవేత్త అభిప్రాయం ప్రకారం 'వ్యాపారస్థులు, ఆర్థిక, సాంఘిక పరంగా
వారి ద్వంద్వ పాత్రను తెలుసుకొంటే తప్ప, సమాజంలో గౌరవనీయమైన
వర్గంగా నిలవడానికి అవసరమయ్యే గుడ్‌విల్‌ను సంపాదించలేరు. దీనివల్ల మన
కర్తమయ్యేదేమిటంటే వ్యాపారం మన సమాజంలో ఒక అంగంగా, మన
సంస్కృతిలో ఒక భాగంగా, సామాజిక సంక్షేమ బాధ్యతను స్వీకరించవలె.

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత ఆర్థికాభివృద్ధిపంచవర్ష ప్రణాళికల ద్వారా
జరిగింది. ప్రస్తుతం భారత దేశంలో మిశ్రమ వ్యవస్థ ఉండడం మనకందరకూ
తెలిసినదే. వ్యాపారం ముఖ్యంగా పబ్లిక్ రంగంలోను, ప్రయివేటు రంగంలోను
కొనసాగుతుంది అయితే వ్యాపారం ఏయేరంగాలలో జరుగుతున్నది అనేది
ప్రధానం కాదు. వ్యాపారం ఏ రంగంలో జరిగినప్పటికీ, వ్యాపార సంస్థల
కుండే సామాజిక బాధ్యత ఏ విధంగా నిర్వర్తించబడుతున్నది అనేదే ముఖ్యము.
ఎందువల్లనంటే సంస్థ పబ్లిక్ రంగంలో ఉన్నా, ప్రయివేటు రంగంలో ఉన్నా,
అది సమాజంలోని భాగమె కదా. అందుచేత లోగడ తెలుసు కొన్నట్లు ప్రతి
సంస్థకూ సమాజం పట్ల కొన్ని బాధ్యతలు ఉంటాయి.

భారత దేశంలో పూర్వపు రోజులలో వ్యాపార సంస్థలు లాభార్జన అనే
ధ్యేయాన్ని సాధించిన తరవాత మాత్రమె సామాజిక బాధ్యతలు నిర్వర్తించవలసి
ఉంటుందనే అభిప్రాయం ఉండేది. అయితే ప్రస్తుతం వ్యాపార ధ్యేయాలు,
సామాజిక ధ్యేయాలు విడదీయలేనివిగా గుర్తించడం జరిగింది. అంటే వ్యాపార
ధ్యేయాలు, సామాజిక ధ్యేయాలు సమష్టిగా మాత్రమే సాధించ వచ్చుని ఋజు
వయింది. ఆ రకంగా సామాజిక బాధ్యతల భావము, పరిధి క్రమంగా మారుతూ
వచ్చినాయి. భారతదేశ ప్రస్తుత పరిస్థితులనుబట్టి ఈ దిగువ అంశాల ఆవశ్యకత
నేడు ఏర్పడింది.

i) అధికార వికేంద్రీకరణ జరపవలె.

ii) వ్యక్తి అర్హతలను బట్టి అతనికి అవకాశాలను కలిగించవలె.
iii) శ్రామికుల పట్ల మేనేజ్‌మెంట్ నిరంకుశంగా ప్రవర్తించరాదు.
iv) మేనేజ్‌మెంట్ సమస్యలలో పాలుపంచుకొనే అవకాశాన్ని శ్రామికులకిచ్చి వాళ్ళ అభివృద్ధికి అవకాశాలు కలగజేయవలె.
v) వ్యాపారంలో ఆధునిక శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి పరిశోధక సిబ్బందిని పెంపొందించవలె.
vi) శిక్షణ పొందిన యువకులకు ఉద్యోగాలు ఏర్పరచవలె.
vii) ఆర్థిక ప్రగతిని సాధించడానికి వ్యాపార సంస్థలు ప్రభుత్వానికి తోడ్పడవలె.

భారత దేశ పబ్లిక్ రంగంలో కొనసాగే వ్యాపార సంస్థలలో లాభార్జనా ధ్యేయం లేకపోవడం నిజమే. అయినా ఆ సంస్థలు సమాజానికి చేసే సేవలను గుర్తించి ప్రశ్నించుకొంటే చాలా విచారకరమైన సమాధానం లభిస్తుంది. ఎందువల్లనంటే చాలా పబ్లిక్ వ్యవస్థలు అవి విధించే ధరల గురించి గాని, అవి అందించే సేవల నాణ్యత గురించి గాని అంతకంటే మించి వాటి వేతనాల విధానాన్ని గురించి గాని, ప్రజా సంబంధాల ( Public Relations ) గురించి గాని శ్రద్ధ చూపడం లేదు. అయితే ప్రభుత్వ ఆదాయము, వ్యయము, ఉద్యోగ అవకాశాలు మొదలయిన అంశాల దృష్ట్యా పబ్లిక్ రంగం అభివృద్ధి అధికంగా ఉందని చెప్పవలె.

భారతదేశంలో 1977 మార్చి 31 నాటికి ప్రయివేటు రంగంలో 46,155 కంపెనీలు ఉన్నాయి. వీటియొక్క చెల్లించిన మూలధనము రూ. 2,769 కోట్లు ఉండేది. దీనిలో రూ. 2085 కోట్లు మేరకు ప్రయివేటు రంగంలో ఉండే 7,746 పబ్లిక్ లిమిటెడ్ కంపెనీలకు చెందినదే. అదే విధంగా ప్రయివేటు రంగంలోనే ప్రభుత్వేతర కంపెనీలు సుమారు 68.04 లక్షల మందికి ఉద్యోగాలు ఏర్పరిచినాయి. చెల్లించిన మూలధనంలో సుమారు 18 శాతానికి మించి 388 కంపెనీలలో ఐదు ఫైనాన్షియల్ ఇన్‌స్టిట్యూషన్స్ పెట్టుబడి పెట్టినాయి. ఇంత ప్రజాధనంలో, అంతమంది ఉద్యోగస్తులు ఉండే ఈ కంపెనీలు ఎంత మాత్రం ప్రయివేటు పరిధిలో ఉన్నట్లు కాదు. ఇట్లాంటి కంపెనీల పని తీరును సమాజం చూసీ చూడనట్లు ఊరుకోలేదు. అట్లాగే ఈ కంపెనీల పటిష్టత సమాజానికి ఎంతో ముఖ్యము. ఎందువల్లనంటే ఉద్యోగ అవకాశాలు, సమాజ ఆర్థి

కాభివృద్ధి, సమాజ ఆరోగ్యము మొదలయినవి వీటి మీదే ఆధారపడి ఉన్నవి.

కంపెనీ రంగంలో పెట్టే మూల ధనంలో సుమారు 70 శాతానికి మించి పబ్లిక్ రంగంలోనే పెట్టుబడి పెట్టడం జరిగింది. అట్లాంటప్పుడు దీనివల్ల ఉండే సామాజిక ప్రయోజనాలను తెలుసుకోవలసిన ఆవశ్యకత ఉంటుంది. అందుకే పార్లమెంట్ ద్వారా ఈ రంగంలోని కంపెనీలను ప్రజలకు జవాబుదారీ (accountable) చేయడం జరిగింది. గోయదర్ (Goyder), అనే ఆయన శ్రామికులు, వినియోగదార్లు, వాటాదార్లు, మేనేజ్‌మెంట్ నుంచి కొంతమంది ప్రతినిధులు ఉండే ఒక వ్యవస్థ సోషల్ ఆడిట్‌ను నిర్వహించవలెనని అభిప్రాయ పడింది.

భారత దేశ వ్యాపార చరిత్ర తీసుకొంటే సంస్థలు సమాజ అవసరాలకు అనుగుణంగా తక్షణమే సర్దుబాటు చేసుకోలేకపోవడం వల్ల అవి సామాజిక బాధ్యతలను విడనాడుతున్నాయనే అభిప్రాయం ఉండేది. 1947లో స్వాతంత్ర్యం వచ్చిన తరవాత వ్యాపార సంస్థలలోనే కాక ప్రజల వైఖరిలో కూడా చాలా మార్పులు వచ్చినాయి. ప్రస్తుతం మన సమాజంలో ప్రజలు సమాన అవకాశాలు పొందవలెనని, అందుకు వ్యాపార సంస్థలు తోడ్పడవలెనని ఆకాంక్షిస్తున్నారు.

మనదేశ సంస్థలలో పనిచేసే శ్రామికులు వారి అభివృద్ధికి మేనేజ్‌మెంట్ తగిన అవకాశాలు కల్పించడం లేదని, వారిపట్ల నిరంకుశ భావం చూపుతున్నదని కూడా అభిప్రాయపడుతున్నారు. మేనేజ్‌మెంట్‌లో శ్రామికులకు పాలుపంచుకొనే అవకాశాలు కల్పించి, వారి అభివృద్ధికి కృషిచేసి వారిపట్ల సుహృద్భావాన్ని చూపవలె. ప్రస్తుతం సంస్థలు సామాజిక బాధ్యతలను నిర్వర్తించడంలేదని సామాజిక సేవా ధ్యేయాన్ని స్పష్టంగా ఏర్పరచుకోలేదని అందువల్లనే సమాజ ఉన్నతి, రాజకీయ స్థిరత్వం కుంటుపడ్డాయని అభిప్రాయం కూడా ఉంది. దీనికి తోడు కొన్ని సంస్థలలో లాభార్జనాధ్యేయం మిక్కుటంగా ఉండడంవల్ల అది విమర్శకు గురి అయింది. 1965లో 'వ్యాపార సంస్థల సామాజిక బాధ్యతలు' అనే అంశంపై భారత దేశంలో జరిగిన అంతర్జాతీయ సెమినారులో కంపెని వ్యవస్థను అభివృద్ధి పరచవలెనని, ప్రయోజనకరమైన పనికి అవకాశాలు కల్పించవలెనని, వినియోగదారుల సంతృప్తి, సమాజ సేవ జరగవలెనని ప్రకటించడం జరిగింది ఈ సెమినారు ప్రారంభ ఉపన్యాసాన్ని ఇస్తూ అప్పటి ప్రధాని లాల్ బహదూర్ శాస్త్రి ఏమన్నారంటే 'వ్యాపారస్థునికి సాధారణ సంక్షేమాభివృద్ధి కాకుండా,

స్వప్రయోజనోద్దేశమే ఉంటుందని సమాజం తరచూ అభిప్రాయపడుతుంది. వ్యాపారం దాని సామాజిక బాధ్యతలు నెరవేర్చగలిగి, సమాజం సామరస్యంతో పనిచేయడానికి తోడ్పడగలిగినట్లయితే ఆ అభిప్రాయాన్ని తొలగించవచ్చు."

భారత దేశంలో వ్యాపార సంస్థలు 'దోహదకర న్యాయాన్నే'' (Contributive Justice) కలిగించినాయి గాని పంపిణీ న్యాయాన్ని (Distributive Justice) కలిగించలేదు. స్వాతంత్ర్యానికి ముందు, తరవాత కూడా ఎన్నో అవరోధాలు ఎదుర్కొని వ్యాపార సంస్థలు పారిశ్రామికీకరణకు దోహదం చేసినాయి. భారతదేశ పారిశ్రామిక ప్రగతిలో ప్రయివేటు రంగం ప్రధాన పాత్ర వహించింది. కాబట్టి ఈనాటి పారిశ్రామిక అభివృద్ధి ఆనాటి పారిశ్రామికవేత్తల కృషి, ఉత్సాహము, ఎంటర్‌ప్రైజ్ (Enterprise) కు ఎంతో ఋణపడి ఉంటుంది. పారిశ్రామికాభివృద్ధి ప్రారంభదశలో శ్రామికులకు వారి హక్కులను గురించి అంత అవగాహన ఉండేది కాదు. ట్రేడ్ యూనియన్లు అప్పటికి అభివృద్ధి కాలేదు. పరిస్థితులు ఆ విధంగా ఉండడంవల్ల పారిశ్రామిక వేత్తలు వారి మూలధనాన్ని ఉపయోగించి, కృషిచేసి పరిశ్రమలను నెలకొల్పి 'దోహదకర న్యాయాన్ని' మాత్రమే చేకూర్చినారుగాని శ్రామికులపట్ల 'పంపిణీ న్యాయాన్ని' చేకూర్చలేదు. శ్రామికులు చైతన్యవంతం కాకపోవడంవల్ల, వారికి సరియైన అవగాహన లేకపోవడంవల్ల ఆ కాలంలో ఈ పారిశ్రామికవేత్తలు చెప్పలేనంత ఎక్కువ మొత్తాలలో లాభాలు సంపాదించి, సంపదలను కూడవేసుకొన్నారు. రెండో ప్రపంచ యుద్ధ కాలంలోను, ఆ తరవాత వ్యాపారస్థులు ఆర్జించిన లాభాలే ఇందుకు నిదర్శనము. ఈ కాలంలో శ్రామికులు అజ్ఞానులుగా ఉండి తక్కువ వేతనాలకు ఫాక్టరీలలో పనిచేసి, పేద జీవితాలను గడుపుతుండేవారు. ఈ శ్రామికులను పూర్తిగా వినియోగించుకొని, కొద్దివేతనాలు చెల్లించి వ్యాపారస్థులు లాభాలు సంపాదించుకొన్నారని చెప్పడానికి చరిత్రే ఒక నిదర్శనము.

## శ్రామికులలో వచ్చే చైతన్యము

భారత దేశంలో విజ్ఞానము, ప్రజాస్వామ్యము పారిశ్రామికీకరణ, సామాజిక పరిస్థితి మొదలయిన అంశాలలో మార్పులు రావడంతో, కొత్తశక్తులు ఉద్భవించినవి. వాటి ఫలితంగా ట్రేడ్ యూనియన్‌లు ఏర్పడినాయి. వీటికి ప్రతిఘటించగల శక్తి ఉంటుంది. ట్రేడ్ యూనియన్లు సక్రమంగా నిర్వహించడంతో అవి సమర్థవంతంగా తయారయినాయి. శ్రామికుల ఐక్యము సంఘటిత పడుతూ

వచ్చినది. ఈనాడు ప్రభుత్వ కార్యాలయాలలోను, పరిశ్రమలలోను, బ్యాంకుల లోను అన్నిచోట్ల కూడా శ్రామికులకు అధిక శక్తి ఉంది యజమానులపై ఒత్తిడి తీసుకొనివచ్చి వారి కోరికలను నెరవేర్చుకోగలుగుతున్నారు ఇప్పుడు యజమానులు శ్రామికులపై ఏచర్యలు తీసుకొన్నా ఫలితం శూన్యమే శ్రామికులు పరిశ్రమలలో వారి ఆవశ్యకతను గుర్తించినారు. వారి సహాయం లేకుండా ఉత్పత్తి జరగదని తెలుసుకొన్నారు పెట్టుబడిదారుల ప్రాముఖ్యం క్రమంగా తగ్గుతూ వచ్చింది. ఇంకోపక్క శ్రామికుల ప్రాముఖ్యం ఎక్కువవుతూ వచ్చింది. ఇది సామాజిక చైతన్యంలో ఒక మార్పు. సమాజంలో వచ్చే ఒక అభివృద్ధి. శ్రామికులు వారి హక్కులను పరిరక్షించుకోగలరు. ఎక్కువ వేతనాలను, ఎక్కువ సదుపాయాలను పొందగలరు. సమాజంలో వ్యక్తులందరూ సముచిత మైన ప్రయోజనాన్ని పొంది సమానతను సాధించవలెననిచేసే ప్రయత్నంలో ఇది ఒక మెట్టు. వ్యాపారస్థులకు అధిక సంపద ఉండడం, ఆపైన ఆడంబర విని యోగం (Conspicuous Consumption) చేయడం వంటి అంశాలపై శ్రామి కులు నమ్మకాన్ని కోల్పోయినారు. వ్యాపారస్థులు ఉత్పత్తిని పెంచవలెనని చేసే కృషిలో ఈ అపనమ్మకం అవరోధంగా నిలిచింది. దీనికి చాలా ఆర్థిక ప్రాముఖ్యం ఉన్నది. మన భారతదేశంలో వ్యక్తుల ఆదాయాలలో అధికమైన తారతమ్యాలు ఉన్నాయి. కొద్దిమంది చేతులలోనే ఆర్థిక శక్తి కేంద్రీకృతమై ఉంది. సమాజంలో చాలా మంది ప్రజలు పేద జీవితాలను గడుపుతున్నప్పుడు, ఆ కొద్దిమంది ఆడంబర వినియోగం చేస్తే వారిలో నిస్పృహ ఏర్పడుతుంది. వారిలో శత్రుత్వం జనిస్తుంది. అందువల్లనే గాంధీ ట్రస్టీషిప్ సిద్ధాంతం వ్యాపా రస్థులు సామాన్యజీవితాన్ని గడపవలెనని సూచిస్తుంది. వ్యాపారస్థులుచేసే ఆడం బర వినియోగము, శ్రామికులు వారిని దోచుకొని ఆర్జించిన ఫలితమేనని భావి స్తారు. ఇది ధనిక, పేద ప్రజల మధ్య మంచి సంబంధాలకు అవరోధంగా నిలు స్తుంది. అందుచేత శ్రామికులు వారిపై కోల్పోయిన నమ్మకాన్ని తిరిగి పునరుద్ధ రించుకొనవలెనంటే వ్యాపారస్థులు ఆడంబరంగా కాకుండా సామాన్యమైన, నిస్వార్థమైన జీవితాన్ని గడపవలె.

## వ్యాపార సంస్థల్లో ఆర్థికశక్తి కేంద్రీకరణ

ఆర్థిక శక్తి కేంద్రీకరణ అంటే కొద్దిమంది వ్యక్తులే ఉత్పత్తి కారకాలను స్వాధీనం చేసుకోవడమని అర్థము. అంటే వీరికే ఎక్కువ ఆదాయం ఉంటుంది.

కొద్ది మంది వ్యాపారస్థులే చాలా సంస్థలలో యాజమాన్యాన్ని చేపట్టి, కార్యకలాపాలను నియంత్రిస్తారు. భారతదేశంలో ఆర్థిక శక్తి కేంద్రీకరణ రెండురకాలుగా ఉన్నది. ఒకటి యాజమాన్య పరంగాను, రెండు నియంత్రణ పరంగాను ఉన్నది. నేషనల్ సాంపుల్ సర్వే(National Sample Survey), నేషనల్ కౌన్సిల్ ఆఫ్ అప్లయిడ్ ఎకనామిక్ రిసెర్చ్ వారు సేకరించిన దత్తాంశం ఆధారంగా మన దేశంలో ఆర్థికశక్తి కేంద్రీకరణ అధికంగా ఉన్నట్లు వెల్లడిఅయింది. కంపెనీలలో వాటాలపరంగా పరిశీలస్తే, కేంద్రీకరణ అధికస్థాయిలో ఉన్నట్లు తెలియ వచ్చింది. 1959-60లో డివిడెండు పొందే వ్యక్తులలో 1.5 శాతం వ్యక్తులు మాత్రమే మొత్తం డివిడెండ్‌లో 34.6 శాతాన్ని పొందినారు. దీని ప్రకారం తెలిసేదేమిటంటే పది సంవత్సరాల ప్లానింగ్ అనంతరం కూడా ఆర్థిక వనరుల పంపిణీలో చాలా తారతమ్యాలు ఉన్నట్లు, కొద్దిమంది చేతులలోనే అవి కేంద్రీకృతమయినట్లు తెలుస్తుంది. ఇప్పుడు చెప్పిన యాజమాన్య పరమైన కేంద్రీకరణకంటే నియంత్రణాపరమైన కేంద్రీకరణ చాలా ముఖ్యమైనది. కొద్దిమంది వ్యక్తులు మాత్రమే ఓటింగ్‌లో అభిసంధానపరచి (manipulate) ఎక్కువ కంపెనీలపై నియంత్రణ శక్తిని పొందుతారు. అయితే వీరికి ప్రతి కంపెనీలోకూడా మెజారిటీ వాటాలు ఉండక్కర్లేదు. కంపెనీల మధ్య ఉండే పరస్పరం పెట్టుబడి ద్వారా చాలా కంపెనీలపై నియంత్రణాశక్తిని పొందవచ్చు. వాటాలను ఎక్కువ మంది వ్యక్తులకు వ్యాపింపజేసి, ప్రాక్సీలద్వారా ఓట్లను అభిసంధాన పరచి ఈ నియంత్రణను పొందడం జరుగుతుంది. భారతదేశంలో పారిశ్రామిక లైసెన్సు విధానం ద్వారా ప్రభుత్వమే ఒక రకంగా ఆర్థిక శక్తి కేంద్రీకరణకు దోహదకారి అయింది.

## గుత్తాధిపత్య పరిమిత వ్యాపార కార్యకలాపాలు

మోనోపలీస్ ఇంక్వయిరీ కమీషన్, 1965 వారి రిపోర్టు ప్రకారం భారతదేశంలో వస్తుపరమైన కేంద్రీకరణ గురించి చేసిన పరిశీలనలో వెల్లడయ్యేదేమిటంటే చాలా పరిశ్రమలలో ఒకటి, రెండు సంస్థలు మాత్రమే వస్తువులను అధికంగా సప్లయ్ చేస్తున్నాయి. పోటీ దారులతో పోల్చి చూస్తే ఆ సంస్థలు మార్కెట్‌లో ఎక్కువ భాగాన్ని ఆక్రమిస్తాయి. అట్లాంటి సంస్థకు అది సప్లయ్ చేసే వస్తు, సేవలకు ధరలు నిర్ణయించడంలో పూర్తి స్వేచ్ఛ ఉంటుంది. లాభాలను అధికం చేసుకోవడానికి అనువుగా ఉత్పత్తిని నియమబద్ధం చేయగలుగు

తుంది. దీనినే ''గుత్తాధిపత్యం''గా పేర్కొవడం జరుగుతుంది. అయితే సాధారణ ప్రజలను ఎక్కువగా ఆందోళన పరిచే అంశమేమిటంటే ఈ గుత్తాధిపతులు పోటీ దారులను రానివ్వకుండా దూరంగా ఉంచి ప్రజల నుంచి ఎక్కువ ధరలను పీడించి పొందుతున్నారు కొంతమంది వ్యాపారస్థులు సప్లయ్‌చేసే వస్తువుల వ్యయాన్ని, వాటికి వినియోగదారులు చెల్లించే ధరలను, ఆపైన వచ్చే లాభాలను కూడా పరిశీలించి, మోనోపలీస్ ఇంక్వయిరీ కమీషన్ ఒక నిర్ణయానికి, (అభిప్రాయానికి) (Conclusion) వచ్చింది. అదేమిటంటే గుత్తాధిపత్యాన్ని వహించే ఉత్పత్తిదార్లు నిత్యం ఉపయోగించే కొన్ని కొన్ని వస్తువులకు అధిక ధరలను విధిస్తున్నారు. భారత దేశంలో పరిమిత కార్యకలాపాలు కూడా చాలా అధికంగా ఉన్నాయి. వస్తువులను దాచి వేయడం (Hoarding), అలభ్యతను (Scarcity) సృష్టించడం భారత దేశంలో సాధారణమయిపోయింది. వినియోగ దారు వస్తువుల డిమాండ్ అవ్యాకోచనమయినది. ఈ వస్తువులను దాచివేసేవారు. ఎందుకంటే ఇవి వినియోగదారు వస్తువులు కాబట్టి వృధా అయిపోవడంగాని, నాణ్యత త్వరగా తగ్గిపోయే ప్రమాదంగాని లేదు. ఈ విధంగా కృత్రిమ అలభ్యత సృష్టించేవారు. దీనితో శాశ్వతమైన అలభ్యత సమాజంలో సాధారణ మయి పోయింది. ఈ మధ్య ఆహారపదార్థాలు, నూనెలు, పంచదార కిరసనాయిలు, ఇంకా నిత్యమూ ఉపయోగించే ఎన్నో ఇతర వస్తువులు కృత్రిమ, అలభ్యతకు గురి అయినాయి. ఇదే రకంగా చాలామంది ఉత్పత్తిదారులు వారు నిర్ణయించిన ధరకు తగ్గించి వస్తువులు అమ్మకూడదని కూడా వర్తకులపై ఒత్తిడి చేస్తున్నారు. కొన్నిసార్లు డీలరు ఒకే ఉత్పత్తి దారుని వస్తువులు తప్ప పోటీదారుని వస్తువులను అమ్మరాదనే ఆంక్ష విధిస్తున్నారు. కొన్ని కొన్ని సందర్భాలలో పోటీదార్లతో ఒప్పందానికి వచ్చి అధిక ధరలు నిర్ణయించడంకూడా ఆచరణలో ఉంది. ఒక్కొక్కప్పుడు డీలర్లు వారు అమ్మే వస్తువులతోపాటు ఉత్పత్తిదారుని వద్ద ఉండే అదనపు వస్తువును కూడా అంగీకరిస్తే తప్ప ఆతనికి కావలసిన వస్తువును సప్లయ్ చేయడం లేదు. పంపిణీదార్లకు, రిటైలర్లకు, డిస్కౌంట్లు ఇవ్వడంలో కూడా విచక్షణ (discrimination) చూపడం జరుగుతుంది.

వ్యాపార కేంద్రీకరణ - దేశ ఆర్థిక వ్యవస్థను బలహీనపరచడమే కాకుండా, పారిశ్రామిక రాజ్యాలు సృష్టించడానికి దారితీస్తుంది. రాజకీయ

ప్రజాస్వామ్యాన్ని, సామాజిక విలువలను మరుగుపరుస్తుంది. ప్రతి సమాజంలో మూడురకాల శక్తులు ఉంటాయి. అవి ఆర్థిక లేదా వ్యాపారశక్తి, రాజకీయశక్తి, బ్యూరోక్రటిక్ శక్తి. ఈ మూడు శక్తులు సాధారణ ప్రజల స్థితిగతులను మార్పుకలిగే శక్తిని కలిగి ఉంటాయి ఎన్నికలలో చేసిన దుబారా ఖర్చు, రాజకీయ వేత్తల అధిక జీవన ప్రమాణము, వ్యాపారస్థుల లాభార్జనా ధ్యేయము అన్నీ కూడా సాధారణ వ్యక్తి ఆసక్తులకు వ్యతిరేకంగా పనిచేస్తాయి. మోనోపలీస్ ఇంక్వయిరీ కమీషన్ రిపోర్టులో ఏమని పేర్కొందంటే దేశంలో పరిపాలనలో ఉండే పార్టీకి పెద్దపారిశ్రామిక వేత్తలు ఆర్థిక సహాయం చేయడంవల్ల పెద్ద వ్యాపార సంస్థలు, ప్రభుత్వము లాలూచీ పడతాయనే అభిప్రాయానికి అవకాశమేర్పడింది. అంతే కాకుండా కమీషన్ ఇంకేమని పేర్కొందంటే కొంత మంది వ్యాపారస్థులు వారి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకోవడానికై ప్రభుత్వాధికారులను లంచగొండితనానికి దిగజార్చడానికి కూడా వెరువరు. దేశంలో నిజాయితీ తగ్గిందంటే అందుకు వ్యాపారస్థులు వ్యవహరించేతీరుకూడా ఒక కారణమే. ప్రభుత్వాధికారులతో సంబంధాలు పెంచుకొని వ్యాపారపరంగా వారికి అనుకూలమైన విధంగా నిర్ణయాలు తీసుకొనేటట్లు వ్యాపారస్థులు ప్రయత్నిస్తారు. కొంతమంది వ్యాపారస్తులు లైసెన్సు పొందడానికి ఉండవలసిన కనీస అర్హతలు లేకుండానే లైసెన్సులు పొందగలుగుతున్నారు.

## ఆడంబర వినియోగము

మోనోపలీస్ ఇంక్వయిరీ కమీషన్ ప్రకారం వ్యాపారస్థులు ఆర్జించిన సంపదలో కొంత భాగం పరిశ్రమలో తిరిగి వినియోగిస్తున్నప్పటికీ తక్కినదాని వారి ఐశ్వర్యాన్ని చాటి చెప్పడానికి వెచ్చిస్తున్నారు. చాలా మంది వ్యాపారస్థులు వారి సంపద ద్వారా. పెద్దపెద్ద భవనాల ద్వారా, ఎంతోమంది నౌకర్ల ద్వారా తక్కిన ప్రజలపైన వారి ఆధిక్యం చూపుతున్నారు. వారు ఒక ప్రత్యేక వర్గానికి చెందే వ్యక్తులుగా వెల్లడి చేస్తున్నారు కూడా. అంతులేని పేదప్రజల మధ్యనే, అల్పసంఖ్యాకులైన ధనిక వ్యాపారస్తులు మెలగడం వ్యాపారస్థులకు వ్యతిరేకంగా ఒక వర్గ భావన ఏర్పడింది. ఈ ధనిక వ్యక్తుల వ్యవహార విధానం దేశంలో సామాజిక విలువలను తొక్కిపారవేసింది. వ్యాపార విజయంలో ఉండే అవకాశాలతో పోల్చి చూస్తే చాలామంది యువకులకు సంస్కృతి, విద్య, శాస్త్రీయ పరిశోధనలు, ఆశాజనకంగా కనపడడంలేదు. కేంద్రీకరణ జరిగినా,

జరగక పోయినా సంపదకుండే ఆర్భాటం ఎప్పుడూ ఉంటుంది. అయితే కుటుంబ వేడుకలలోను, సామాజిక ఉత్సవాలలోను సంపద కేంద్రీకరణ వెల్లడి చేయడంతో దానికుండే ఆర్భాటం ఎన్నో రెట్లు పెరిగిపోయింది. చాలామంది దీనికి ఆకర్షితులయ్యారు. కాని దీని వల్ల పేదప్రజలలో ధనికులపైన ఏహ్యభావం కలిగింది. ఒక పక్క చాలామంది ప్రజలు చాలినంత తిండిలేక, కట్టుకోడానికి బట్టలేక బాధపడుతుంటే, మరోపక్క ఈ కొద్దిమంది ధనికులు భోగలాలసంగా, వృధాతోకూడిన జీవితాన్ని గడపడం నేరం కాదా? అనేది వీరి ప్రశ్న. పేద ప్రజలు వారి దురదృష్టానికి ఈ పెద్ద వ్యాపారస్థులే కారణమని విశ్వసించడంతో పెద్ద వ్యాపారస్థులపై ఉండే వ్యతిరేక భావం ఇంకా ప్రబలి పోయింది.

**వ్యాపారస్థులు చేసిన పెట్టుబడిలో అపసవ్యమార్గాలు**

స్వాతంత్ర్యం వచ్చిన తరవాత పెట్టుబడి చాలామొత్తాలలో పబ్లిక్ రంగంలోను, ప్రయివేటు రంగంలో కూడా తక్కువ కృషితో అధిక లాభాలను పొందడానికి అవకాశం ఉండే సంస్థలలో ఉపయోగించడం జరిగిందని చెప్ప వచ్చు. విచారకరమైన విషయమేమిటంటే పెద్ద ఫైవ్ స్టార్ హోటళ్ళు, ఎయిర్ కండిషన్డ్ సినీమాహాలులు, రెస్టారెంట్‌లు, బ్యాంకు అధికారులకు పెద్ద నివాస గృహాలు, కొంతమంది లీడర్ల సంస్మరణార్థం కట్టించే నిర్మాణాలు, వ్యయ పూర్వకమైన ఉత్సవాలు, వ్యాపారస్తుల విదేశ ప్రయాణాలు మొదలయిన వాటికి సులువుగా పెట్టుబడి లభించింది గాని, తాగే నీటి సదుపాయాలు కల్పించడానికి గాని, పేదప్రజలకు రోజుకు రెండు పూట్లా భోజనం ఏర్పాటు చేయడానికి గాని, ఒంటి నిండా కప్పుకోడానికి బట్టను కల్పించడానికి గాని మూలధనం లభ్యం కాలేదు. సామాన్య ప్రజల చేరువలో లేని విలాస వస్తువులపై పెట్టే పెట్టుబడిని తనిఖీ చేయడానికి సరియైన పారిశ్రామిక లైసెన్సు పద్ధతి లేక పోయినది. యథార్థానికి భారతదేశంలో పేదరికాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రాధాన్యతలను (Priorities) నిర్ణయించవలె. దేశంలో ద్రవ్యోల్బణ పరిస్థితులను అరికట్టవలె నంటే ముఖ్యావసర వస్తువులలోనే పెట్టుబడి పెట్టవలె. అయితే దేశంలో ద్రవ్యోల్బణాన్ని సృష్టించే రకంగానే పెట్టుబడి పెట్టడం జరుగుతుందిగాని, దానిని అరికట్టే రకంగా పెట్టుబడి పెట్టడం జరగడం లేదు. ప్రజలలో సుమారు 10 శాతం ధనిక వ్యక్తులు ఉన్నారు. వారు వినియోగించే విలాస వస్తువులలో మాత్రమే ఎక్కువ పెట్టుబడి జరుగుతున్నది. భారతదేశ పరిస్థితుల దృష్ట్యా నిరు

ద్యోగ సమస్య నివారణ,సముచిత ఆదాయపంపిణీ అత్యంత ప్రధాన మయినవి. ఈ రెండు సమస్యలనువరిష్కరించే విధంగా పెట్టుబడి విధానాన్ని రూపొందించ వలె. సంపదగల వ్యక్తుల ఆదాయం ఎక్కువయేటప్పుడు ఏర్పడే ఉద్యోగావ కాశాల కంటే పేద ప్రజల ఆదాయం ఎక్కువయేటప్పుడు ఏర్పడే ఉద్యోగావ కాశాలు ఎక్కువగా ఉంటాయి.ఎందువల్లనంటే సంపదగల వ్యక్తులు కొనే విలాస వస్తువుల ఉత్పత్తికి అధికమూలధన స్వభావం ఉంటుంది. కాని పేదప్రజలు కొనే వస్తువులు ఉత్పత్తి చేయడానికి ఎక్కువ మంది శ్రామికులు కావలసి వస్తుంది. ఉదాహరణకు ఒక ఆటోమొబైల్ ఉత్పత్తి చేయవలెనంటే శ్రామికులకంటే యంత్రాలే ఎక్కువ కావలసి ఉంటుంది. కాకుండా సైకిళ్లు, దుస్తులు, ఆహార పదార్థాలు ఉత్పత్తి చేయడానికి శ్రామికులే ఎక్కువ మంది కావలసి ఉంటుంది.

**ప్రాంతీయ అభివృద్ధి అసమానతలు**

ఆర్థిక అభివృద్ధి ఫలితాలు అన్ని ప్రాంతాలకు, చివరకు అందరి ప్రజలకు చేరితే తప్ప, సమాజ శ్రేయస్సు సాధించలేము. వెనకబడిన ప్రాంతాల అభి వృద్ధికి కృషిచేయకపోవడం, కొన్ని ప్రాంతాలలోనే ఆర్థిక శక్తి కేంద్రీకృతం కావడం, ఆదాయ పంపిణీలో ఉండే తారతమ్యాలకు కారణము. 1956—66 కాలంలో పారిశ్రామిక అభివృద్ధిచెందిన మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, తమిళ నాడు, గుజరాత్ నాలుగు రాష్ట్రాలే జారీచేసిన మొత్తం పారిశ్రామిక లైసె న్సులలో 62.42 శాతాన్ని పొందినాయి. ఈ రాష్ట్రాలలో కూడా అభివృద్ధిచెందిన కొన్ని ప్రాంతాలు మాత్రమే చాలామేరకు లైసెన్సులు పొందడం జరిగింది. మహారాష్ట్రలో జారీ చేసిన లైసెన్సులలో 51 శాతం బొంబాయి (సబర్బన్), థానా, పూనాకు చెందినవి. పశ్చిమ బెంగాల్‌లో 71 శాతం కలకత్తా, హౌరా, హుగ్లీ ప్రాంతాలకే చెందినవి. తమిళనాడులో 59 శాతం మద్రాసు, కోయంబ త్తూర్‌కు చెందినవి. దీనిని బట్టి తెలిసేదేమిటంటే భారత దేశంలో అవలంబించే ప్లానింగ్‌వల్ల కొన్ని పరిమిత ప్రాంతాలలోనే పరిశ్రమల కేంద్రీకరణ జరిగింది. పల్లె ప్రాంతాలకు ఈ పరిశ్రమలు వికేంద్రీకరణ చేసే ప్రయత్నాలు జరగలేదు.

**కుటీర పరిశ్రమలు —చిన్నతరహా పరిశ్రమలు**

కుటీర పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు ఉద్యోగ అవకాశాలను కలిగిస్తాయని గుర్తించడం జరిగింది. గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయంపై ఉండే ప్రజలకు అనుబంధ వృత్తిని ఈ కుటీర పరిశ్రమలు, చిన్న తరహా పరి

శ్రమలు కలగజేస్తాయి. వినియోగదారు వస్తువులను ఉత్పత్తిచేయడంలో ఈ పరిశ్రమలు ఎంతో తోడ్పడతాయి. ఈ చిన్న తరహా పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి, పెద్ద తరహా పరిశ్రమల ధాటీని తట్టుకొనే నిమిత్తం వీటికి రక్షణ ఇవ్వడానికి ఎన్నో పద్ధతులు సూచించబడినవి. అందులో కొన్ని ముఖ్యమైనవి ఉత్పత్తిలో రిజర్వేషన్ ఏర్పాటు చేయడం, పెద్ద తరహా పరిశ్రమల కెపాసిటీ పరిమితం చేయడం, చిన్న తరహా పరిశ్రమలకు ముడి పదార్థాలు సప్లయ్ చేయడం, పరిశోధన, ట్రెయినింగ్ సదుపాయాలు కలిగించడం, మార్కెటింగ్ సౌకర్యాలు ఏర్పరచడం మొదలైనవి. ఎలక్ట్రానిక్ కాంపొనెంట్స్ (Electronic Components), ఎక్విప్‌మెంట్, రేడియో రిసీవర్స్ ఉత్పత్తి చేయడానికి చిన్న తరహా పరిశ్రమలు ప్రయోజనకరంగా ఉన్నట్లు ఋజువు అవుతున్నది. ఈ విషయంలో చిన్న తరహా ఉత్పత్తిదార్లకు కావలసిన కొన్ని ముఖ్యమైన భాగాలను పెద్ద ఉత్పత్తిదార్లు అందించవచ్చు. దీనికి సంబంధించి మహారాష్ట్ర, పశ్చిమ బెంగాల్, తమిళనాడు రాష్ట్రాలలో కొంత అభివృద్ధి సాధించడం జరిగింది. కాని మొత్తంపైన ఇట్లాంటి ప్రయత్నాలు అక్కడక్కడ మాత్రమే జరిగినాయి.

మహాత్మాగాంధీ కూడా మన దేశ అభివృద్ధికి కుటీర పరిశ్రమలు, చిన్న తరహా పరిశ్రమలు సూచించడం జరిగింది. ఎందువల్లనంటే ఇవి స్వయం ఉపాధి కల్పనకు అవకాశాన్నిస్తాయి. కుటుంబంలోని వ్యక్తులు పని చేయడానికి వీలవుతుంది. సహకార సూత్రాలపైన ఇవి పని చేస్తాయి. వ్యక్తుల మధ్య అసమానత ఉండదు. ప్రతి వ్యక్తికి ఇంకోవ్యక్తితోసమానత ఉంటుంది. ప్రతివ్యక్తి తనే యజమాని, ఉద్యోగికూడా. చిన్న తరహా పరిశమలకు సంబంధించి గాంధీ చెప్పిన ఈ సిద్ధాంతం పాటించకపోతే శ్రామికుడు తిరిగి ఎక్స్‌ప్లాయిటేషన్‌కు (Exploitation) గురి అవుతాడు. చిన్న తరహా పరిశ్రమలకు సంబంధించి ఈ ఎక్స్‌ప్లాయిటేషన్ పెద్ద పరిశ్రమలలో కంటే అధికంగా ఉంటుంది. ప్రస్తుతం విద్యుచ్ఛక్తి దేశం నలుమూలలా వ్యాపించింది కాబట్టి, గ్రామాల విద్యుదీకరణ, గ్రామాల పారిశ్రామికీకరణ జరిగి, గ్రామాలు అభివృద్ధి చెందుతాయి.

## సామాజిక న్యాయము

భారత దేశంలో ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందడానికి ముందే సామాజిక అవగాహన (Social consciousness) ఏర్పడింది. అభివృద్ధికి, సామాజిక న్యాయానికి (Social Justice) మధ్య విభిన్నత మొదటినుంచి ఉన్నది.

అభివృద్ధి చెందుతున్న దేశాలలో అభివృద్ధి—న్యాయమనే సూత్ర పరిణామంలో నాలుగు దశలున్నాయి. మొదటిది, సామాజిక న్యాయాన్ని విడనాడి అభివృద్ధి సాధించడం. దీనిలో చాలినంత అభివృద్ధి సాధించిన తరవాత సామాజిక న్యాయం మార్కెట్ యంత్రాంగం ద్వారా దానంతటదే పరిష్కృతమవుతుంది. రెండోది, అభివృద్ధితో పాటు సామాజిక న్యాయం చేపట్టడం. దీని ప్రకారం అభివృద్ధి విధానంలోనే సామాజిక న్యాయం ప్రాధాన్యత గుర్తించడము జరుగుతుంది. మూడోది సామాజిక న్యాయంతో కూడుకొన్న అభివృద్ధి. దీనిలో సామాజిక న్యాయాన్ని చేకూర్చి, అభివృద్ధి అధికం చేయడం జరుగుతుంది. అయితే ఇందులో అభివృద్ధే ప్రధానాంశము. సామాజిక న్యాయం ద్వితీయాంశము. నాలుగోది, అభివృద్ధికోసం సామాజిక న్యాయము. ఇందులో అభివృద్ధి సాధించడం కోసం సామాజిక న్యాయాన్ని చేకూర్చడం జరుగుతుంది. దీని ప్రకారం సామాజిక న్యాయమే ప్రధానాంశము. అభివృద్ధి అనేది ద్వితీయాంశము. సమాజంలో సామాజిక న్యాయం చేకూర్చడంద్వారా మాత్రమే తప్ప ఇంకోరకంగా అభివృద్ధి సాధించడం జరగదు. ఇది ఇట్లా ఉండగా మనదేశంలోని వ్యాపారస్తుల అభిప్రాయం ప్రకారం ఈదేశం ఇంకా మొదటి దశలోనే ఉన్నది. అభివృద్ధి అనేది సామాజిక న్యాయము లేకుండా కూడా సాధించవచ్చని వారు భావిస్తున్నారు. కాని యథార్థానికి భారత దేశము నాల్గవదశను చేరి ఉండవచ్చు. అంటే అభివృద్ధి సాధించడం కోసం సామాజిక న్యాయం అనే దశలోఉన్నది. ప్రజల పేదరికము. ఆదాయాలలో తారతమ్యాలు, ప్రజాస్వామ్యం, సమానత్వభావాలు, విద్య, ధనిక వర్గ ఆడంబర వినియోగము, ట్రేడ్‌యూనియనిజమ్ అధికారధిక్కరణ, అన్యాయానికి ఎదిరింపు ఇవన్నీ కూడా ప్రజలలో ఒకరకమైన చైతన్యాన్ని తీసుకొని వచ్చినాయి. వ్యాపారస్థులు వారికి న్యాయాన్ని చేకూరుస్తారనే ప్రజలకుండే నమ్మకం సడలిపోయింది.

భారత దేశాన్ని దృష్టిలోపెట్టుకొని ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త గున్నార్ మిర్డల్ (Gunnar Myrdal) ఇట్లాపేర్కొన్నాడు.

''అధికమైన ఆసక్తితో సమానత కోసం ప్లాను చేయండి. ఇండియాకు ప్రత్యేక లక్షణం ఉన్నది. ఇక్కడ వర్గ బేధాలు లేని సోషలిస్టు సమాజం ఏర్పడుతుంది. త్వరితమైన అభివృద్ధి జరగవలెనంటే అధిక స్థాయిలో సమానత ఉండవలసిన అవసరం ఉంది. సమానతను ఏర్పరిచినప్పుడే మీరు పేదరికం

నుంచి విముక్తి పొంద గలరు. కచ్చితమైన విధానాల ద్వారా మాత్రమే దీనిని సాధించవచ్చు." ఆర్థిక సిద్ధాంతం ప్రకారం జాతీయాదాయం పెరగడం వల్ల అభివృద్ధి జరిగినంత మాత్రాన, ప్రజల సంక్షేమంకూడా ఆ మేరకు పెరగవలె నని లేదు. ముఖ్యమైన విషయమేమిటంటే అధికమైన అభివృద్ధి రేటువల్ల దారిద్ర్యం, ఆర్థిక విపత్తులు తొలగించడం సాధ్యం కాదు. పశ్చిమ బెంగాల్, బీహార్, తమిళనాడు, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ రాష్ట్రాలవంటి పారిశ్రామిక ప్రాంతాలలో ఉండే ప్రజల పేదరికాన్ని పంజాబ్, హర్యానా, పశ్చిమ ఉత్తర ప్రదేశ్, రాజస్థాన్‌లోని గంగానగర్ జిల్లాలవంటి తక్కువ పారిశ్రామిక ప్రాంతాలలో ఉండే ప్రజల అభివృద్ధితో పోల్చి చూస్తే, భారతదేశ సాధారణ ప్రజలపై పారిశ్రామికీకరణ ఎట్లాంటి ప్రభావం కలిగించ లేదని ఋజువవుతుంది. గాంధీ ఆర్థిక సూత్రాల ప్రకారం ఉత్పత్తితో పాటే పంపిణీ కూడా జరుగుతుంది. దీనివల్ల ఆదాయ అసమాన పంపిణీకి అవకాశం ఉండదు. అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఆదాయాన్ని తిరిగి పంపిణీ చేయడానికి ఆర్థిక యంత్రాంగం, పన్ను యంత్రాంగంపై ఆధారపడడం వల్ల ఆదాయం సక్రమ పంపిణీ జరగదు. అంతే కాకుండా అభివృద్ధిలో అసమానత లేర్పడతాయి. ఎందు వల్లనంటే ఆర్థిక వ్యవస్థలో పొందిన ప్రయోజనాలు వాంఛనీయ విధంగా సాధారణ ప్రజలకు చేరవు. అభివృద్ధి చెందిన దేశాలు ఆర్థిక అభివృద్ధి సాధించడంలో విజ[illegible] పొందినాయంటే అవి ఒకప్పుడు సమానత మార్పులను చేపట్టినవే. పశ[illegible] లలో పాటించే సాధారణ ఆర్థిక సిద్ధాంతం భారతదేశ పరిస్థితికి [illegible] కారణ మేమిటంటే అక్కడ ప్రాముఖ్యము ఉత్పత్తికే ఉంటుంది కాని ఉండదు. మన దేశంలో పంపిణీయే ప్రధాన సమస్య. ప్రొఫెసర్ (Prof. Dandekar), డాక్టర్ నీల్‌కాంత రాథ్ (Dr. Nilkantha R చేసిన 'పావర్టీ ఇన్ ఇండియా' (Poverty in India) అనే సాధించవచ్చుఅని అనుకొంటే పేద, ధనిక వర్గాల వారికి కూడా తకు వృద్ధి రేటుకంటే, ఎక్కువ అభివృద్ధి రేటు వాంఛనీయమేనని పేర్[illegible] అయితే పేద వర్గాల వారి దృష్ట్యా అధిక అభివృద్ధి రేటుకంటే అభివృద్ధి జనాలు సమానంగా పంపిణీ జరగ వలసిన ఆవశ్యకత ఎక్కువగా ఉ అభివృద్ధి ప్రయోజనాలు సముచితంగా పంపిణీ జరగడానికి సక్రమమైన వి లేని ఆర్థిక అభివృద్ధి ప్రక్రియ పేద వర్గాలకంటే ధనిక వర్గాలకే లాభద

కంగా ఉంటుంది. అంటే పేదప్రజలు వారి కనీస ప్రయోజనాన్ని పొందడానికి ముందే ధనిక ప్రజలు అత్యంతఐశ్వర్యవంతులవుతారు. ఈ సత్యాన్ని గుర్తించక ప్లానింగ్ కమీషన్ ఎప్పటివలెనే ఈ అసమానత ఉంటుందని అభిప్రాయపడింది. అందుచేత పేదరికాన్ని తొలగించవలెనంటే అధిక అభివృద్ధి రేటు అవసరమవుతుంది.

భారతదేశ రాజ్యాంగంలో సామ్య వాద నమూనా సమాజాన్ని (Socialistic Pattern of Society) అనుసరించడం జరిగింది. దీని ప్రకారం సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయంతో కూడుకొన్న సామాజిక పరిస్థితిని నెలకొల్పి ప్రజల సంక్షేమం కోసం ప్రభుత్వం పూనుకోవలె. అంతేకాకుండా భారతదేశ పౌరులందరికీ జీవనోపాధిని కల్పించవలె. సమాజ వనరులు సాధారణ ప్రజలకు ఉపయోగపడే విధంగా వాటి యాజమాన్యాన్ని, నియంత్రణనూ ప్రభుత్వం చేపట్టవలె. అంటే ఈ వనరులు ప్రజలందరకు సముచితమైన విధంగా అందజేయవలె. ప్రయివేటు వ్యక్తుల చేతులలోగాని, పబ్లిక్ రంగంలో గాని ఈ వనరులు కేంద్రీకృతం కాకూడదు. ప్రభుత్వం సమతౌల్య ప్రాంతీయ అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని వ్యవస్థలోని అన్ని రంగాల అభివృద్ధికి కూడా తోడ్పడాలె.

## భారత దేశంలో వ్యాపారస్థుల చరిత్ర

భారత దేశంలో వ్యాపారస్థుల పెర్‌ఫార్మెన్స్ రెండు దృక్పథాలలో పరిశీలించవచ్చు. (i) ఎంటర్ ప్రెన్యూర్‌షిప్ (ii) వ్యాపారనడవడి లేదా సామాజిక బాధ్యత. కొంత మంది వ్యాపారస్థులు మన దేశంలో విదేశ పరిపాలన ఉన్నప్పటినుంచి కూడా స్టీలు, నూలు, జనుము, పంచదార, సిమెంట్ వంటి పరిశ్రమలు స్థాపించడంలో ఎంతో ఎంటర్‌ప్రెన్యూరియల్ (Enterpreneurial) నైపుణ్యాన్ని చూపించినారు. అయితే వీరు కేవలం సాఫ్ట్‌గా (Soft) మాత్రమే ప్రవర్తించినారని ప్రజలు అభిప్రాయపడడం జరిగింది. జవహర్‌లాల్ నెహ్రూగారు ఒకప్పుడు ఈ వ్యాపారస్థులు పారిశ్రామికవేత్తలు కారు, వారు పెద్ద ఫైనాన్సర్‌లు (Financers) మాత్రమేనని పేర్కొన్నారు: పరిశ్రమను వారు స్వయంగా స్థాపించలేదు. వారు ఇక్కడా, అక్కడా పరిశ్రమనుకొని అమ్మడం మాత్రమే చేసినారు అని ఆయన పేర్కొన్నారు. దేశంలో పారిశ్రామిక వేత్తలు, మేనేజ్‌మెంట్ వ్యక్తులు వినియోగదారు వస్తువులను ఉత్పత్తి చేసే పరిశ్రమలను

మాత్రమే నెలకొల్పినారు. సబ్బు, అలంకరణవస్తువులు, సిగరెట్లు మొదలైన అప్రధానమైన వస్తువుల ఉత్పత్తిని తలపెట్టినారు. వీటిని చిన్న తరహా పరిశ్రమలకు విడిచిపెట్టవచ్చు. ఎకనామిక్ అండ్ సైంటిఫిక్ రిసెర్చ్ ఫౌండేషన్ జరిపిన మేనేజీరియల్ మేన్‌పవర్ (Managerial Manpower) సర్వే ప్రకారం తెలిసేదేమిటంటే భారతదేశ పబ్లిక్ రంగంలో ఉత్పత్తి, ప్లానింగ్ అండ్ డిజైన్, రిసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్ మొదలయిన అంశాలకు ప్రాధాన్యం ఇవ్వగా ప్రయివేటు రంగంలో మార్కెటింగ్, కొనుగోళ్ళు, అమ్మకాలు, ఫైనాన్స్, సిబ్బంది మొదలయిన అంశాలకు ప్రాధాన్యం ఇవ్వడం జరుగుతుంది. రిసెర్చ్ అంఛ్ డెవలప్‌మెంట్‌పై ప్రస్తుతం చేస్తున్న వ్యయం స్థూల జాతీయాదాయంలో 0.5 శాతం మాత్రమే మనదేశంలో రిసెర్చ్ అండ్ డెవలప్‌మెంట్‌పై 1971–72లో కేవలం 214 కోట్లు మాత్రమే ఖర్చు చేయడమైనది. ప్రయివేటురంగంలో 14 కోట్లు మాత్రమే వెచ్చించినారు. దీని ప్రకారం భారతదేశంలోని వ్యాపారస్థులకు పారిశ్రామిక ఎంటర్‌ప్రెన్యూర్‌షిప్ ఆసక్తి తకవగా ఉన్నట్లు తెలుస్తుంది

మన దేశంలోని వ్యాపారాన్ని 'పెద్ద వ్యాపార సంస్థలు'గాను, ' వ్యాపార సంస్థలు'గాను విభజించవచ్చు. పెద్ద వ్యాపార సంస్థలే అధి విమర్శకు గురి అయినాయి. సమాజంలో వాణిజ్యపరమైన ఇక్కట్లన్నింటికీ కారణమని నిందించడం జరుగుతుంది. క్రమబద్ధం కాని వ్యాపార రంగ సంచార వర్తకుడు, చిన్న చిల్లర వర్తకులు అమ్మే కల్తీవస్తువులు, వడ్డీ వ్యాపారస్థులు విధించే వడ్డీలు, భూస్వాములు వసూలు చేసే కౌలు, టోకువర్త అవలంబించే హోర్డింగు, బ్లాక్ మార్కెటింగ్, ఇవన్నీ కూడా నిత్యమూ సాధారణ ప్రజలు చూస్తుంటారు. క్రమబద్ధమైన వ్యాపార రంగం తక్కిన అ వ్యాపారాలకు మార్గదర్శికావలె. ముఖ్యమైన కారణమేమిటంటే వ్యక్తిజీవన విధాన మీద వ్యాపారం అత్యంత ప్రభావం చూపుతుంది. వ్యాపారస్థులమీద చట్టబద్ధమైన ఆంక్షలు ప్రభుత్వం ఎన్నో విధిస్తుంది. పెద్ద వ్యాపార సంస్థలు వాటి పేరు ప్రతిష్ఠలను పునరుద్ధరించుకోవడానికి బాధ్యత వహించవలె. అయితే విచారకరమైన విషయమేమిటంటే పెద్ద సంస్థల పాత్ర ఆశాజనకంగా లేదు. దేశంలోని వ్యాపార ప్రతిష్ఠ దిగజారిపోతూ వచ్చింది.

స్వాతంత్ర్యానంతరం ప్రజాస్వామిక సంస్థల ప్లానింగ్, పనిచేసే తీరు

మనదేశ పరిస్థితిలో కొన్ని నూతన శక్తులు ఉత్పన్నం చేసింది. వీటివల్ల భారత దేశ సమాజం సత్వరమే సామాజిక ఆర్థిక మార్పును పొందడానికి ఒత్తిడి ఏర్పడింది. ఇందుకోసమై భారతదేశ సమాజంలో ఇన్‌స్టిట్యూషనల్, స్ట్రక్చరల్ (Structural) మార్పులు కొన్ని తీసుకొని రావలె. భూమి తిరిగి పంపిణీ చేయడం, పట్టణ ఆస్తులపై పరిమితి, వ్యవసాయంలో స్వయం-ఉపాధి రంగాలను అభివృద్ధి చేయడం, కుటీర పరిశ్రమలు నెలకొల్పడం, గ్రామీణ విద్యుదీకరణ, ప్రాంతీయ ప్లానింగ్, సమతౌల్య ప్రాంతీయ అభివృద్ధి పొదుపుకు కావలసిన ఉత్సాహాన్ని కలిగించడం, అన్ని రంగాలకు బాంకు అప్పులను ఇవ్వడం, స్వయం సమృద్ధిని కలిగించడం మొదలయిన చర్యలు తీసుకోవలె. సమాజంలో ధనిక వర్గాల వారు వారి వ్యయాలను అదుపులో పెట్టుకోవలె. ఆడంబర వినియోగాన్ని తొలగించి సామాన్య జీవితాన్ని అవలంబించవలె. ఆర్జించవలెననే తపనపై సామాజిక తనిఖీ ఏర్పరిచి భారత దేశంలో నూతన విలువలను సృష్టించవచ్చు.

**కొన్ని ముఖ్యమైన సంస్థలలో సామాజిక బాధ్యతలు :**

**ఆహార పదార్థాల పరిశ్రమ**

వ్యక్తికి గాలి, నీరు ఎంతగా అవసరమో ఆహారం కూడా అంతే అవసరము. ప్రజలకు స్వచ్ఛమైన, శక్తిమంతమైన ఆహారపదార్థాలు కావలె. అంతే కాకుండా ఈ ఆహార పదార్థాలు కావలసిన పరిమాణంలో వీలైనంత చౌకధరలకు లభ్యం కావలె చాలా దేశాలలో ప్రజలు కల్తీలేని, స్వచ్ఛమైన ఆహారపదార్థాలను పొందలేకపోతున్నారు. మనదేశంలో కొంతమంది ప్రజలు ఆకలి బాధతో అలమటించడం కూడా జరుగుతుంది. అభివృద్ధి చెందిన దేశాలలో కూడా ఆహారపదార్థాలలో కల్తీ జరుగుతున్నది ఈ కల్తీ జరిగే ఆహారపదార్థాలు ప్రజలకు చాలా హానిని కలగజేస్తాయి. ఆహారమనేది వ్యక్తి ప్రాథమిక అవసరము. అందుచేత ఈ ఆహార పరిశ్రమలు వ్యాపారం దృష్టిలో ఉత్పత్తిని కొనసాగించరాదు. ఆహార పదార్థాలను భారీఎత్తున ఉత్పత్తి చేయవలసిన ఆవశ్యకత ఏర్పడినప్పుడు అట్లాంటి ఆహారపదార్థాలు పాడవకుండా తగు చర్యలు తీసుకోవలె. ఆహార పదార్థాలు కల్తీ చేసినట్లయితే అది మానవాళి పట్ల నేరం అవుతుంది.

**మందుల పరిశ్రమ**

గాలి, నీరు, ఆహారం మానవునికి ఏ విధంగా అవసరమో, మానవ జీవిత రక్షణకు మందులు కూడా చాలా అవసరము. మంచి మందులను తయారు

చేయడం ఎంతో ఉన్నతమైన చర్య. వ్యక్తి వ్యాధిగ్రస్థుడవడం, మరణించడం చాలా సహజము. వైద్యశాస్త్రము ఇంకా ఎంతో అభివృద్ధి చెందవలసి ఉన్నది. ఎందువల్లనంటే ఇప్పటికి కూడా కొన్ని వ్యాధులకు నివారణ మందులు లభ్యం కావడం లేదు. అయితే ఈ వైద్యశాస్త్రజ్ఞానానికి ఎట్లాంటి పరిమితులు ఉండ కూడదు. వైద్యశాస్త్ర ఫలితాలు ప్రపంచంలో అన్నిదేశాలకు చేరి అందరి ప్రజ లకు సకాలంలో, తక్కువ ధరలకు అందవలె. ప్రపంచమంతటా వ్యాధులను నివారించడానికి, మందులను సప్లయ్ చేస్తూ ఒక అంతర్జాతీయ సంస్థకూడా ఏర్పడింది. అదే ప్రపంచ ఆరోగ్య సంస్థ (World Health Organisation). మానవాళి సంక్షేమం దృష్ట్యా ఏ సంస్థకూడా మందుల ఉత్పత్తిలో గుత్తాధి పత్యాన్ని వహించి, అధిక లాభాలు సంపాదించడానికి ప్రభుత్వం అంగీకరించదు. ప్రజాధన వ్యయంతోనే శాస్త్రజ్ఞులు పనిచేసి, పరిశోధనలు జరిపి, జీవిత రక్షణకు కావలసిన మందులు కనుక్కొంటున్నారు. ఆ ఫలితంగా మందులు ఉత్పత్తి చేసే సంస్థలు లాభాలు పొందుతాయి. అందువల్ల ఈ కంపెనీలు ప్రజోపయోగానికి తోడ్పడవలె. వ్యాపారస్థుని చేతిలోమందుల ఉత్పత్తి సంస్థ ఒక ట్రస్టుమాత్రమే. అది సమాజ ప్రయోజనానికి మాత్రమేఉపయోగించవలె. అయితే ఈ పరిశ్రమలో మందుల ప్రాముఖ్యాన్ని బట్టి సుమారు గుత్తాధిపత్యం ధరలు విధించడం, చాలా మొత్తాలలో లాభాలు పొందడం ముఖ్యమైన సమస్యలు. సంస్థలు వీనిని విడనాడి సమాజ సేవను దృష్టిలో పెట్టుకోవలె.

## నీరు విద్యుచ్ఛక్తి వంటి ముఖ్యావసర వస్తువులు

ఈ ఆధునిక సమాజంలో విద్యుచ్ఛక్తి ఉపయోగం అన్నిచోట్ల పాకి పోయింది. విద్యుచ్ఛక్తి వల్లనే నీరు పొందగలము. పిండిమిల్లులు, హీటర్లు ఫానులు, రిఫ్రిజిరేటర్లు, ఆహార పదార్థాల ఉత్పత్తి, వ్యవసాయము, పరిశ్రమలు ట్రైనులు ఇంకా ఎన్నో చోట్ల ఈ విద్యుచ్ఛక్తి వినియోగించడం జరుగుతుంది. విద్యుచ్ఛక్తి ఒక్కసారి నిలచి పోయిందంటే సమాజంలో ఎన్నో కార్యకలాపాలు ఆగిపోతాయి. అదే విధంగా నీరు. ఇది మానవునికి చాలా ప్రాథమిక అవసరము. కాబట్టి ఈ సేవలు మానవాళికి నిరంతరం లభ్యం కావలె. ఇవి కావలసిన మేరకు, వీలైనంత తక్కువ ధరలకు లభ్యం కావలె. అందువల్లనే ఈ సంస్థలలో పని చేసే వ్యాపారస్థులు, ప్రభుత్వము, శ్రామికుల బాధ్యత చాలా ముఖ్యమైనది. వీటిని నిలిపివేసి వారు సమాజాన్ని ఏ విధంగానైనా ఆటపట్టించ వచ్చు.

సమాజం ఈ విషయంలో చాలా నిస్సహాయతను కలిగి ఉంటుంది. వీటిపై ఆధారపడక తప్పదు. అందుకే ఆధునిక కాలంలో ఇవి ప్రధాన పాత్రను వహిస్తాయి.

## చిత్ర పరిశ్రమ

ప్రజలలో మంచి భావాలను రేకెత్తించడంలో చిత్ర పరిశ్రమ ప్రాముఖ్యం ఎంతో ఉంటుంది. మానవుని గ్రాహ్యశక్తికి పరిమితి ఉంది. కాని చిత్రపరిశ్రమ వల్ల వారి గ్రాహ్యశక్తి చాలా పెరిగింది. ముఖ్యంగా చిన్న పిల్లల విషయంలో మంచి ఫలితాలు ఇవ్వడానికి ఈ పరిశ్రమ ఎంతో తోడ్పడుతుంది. ఎందువల్లనంటే చిన్న వయసులో ఉన్న ఆ పిల్లలకు పెద్ద వయసులో నేర్పలేని కొన్ని విషయాలను సులవుగా నేర్పవచ్చు. విద్యను బోధించడానికి సినిమా ఒక మంచి మార్గము. వినోదాన్ని పొందడానికి కూడా ఇది ఒక సాధనము. అయితే ఈ సినిమాల వల్ల దుష్ఫలితాలు లేక పోలేదు. వ్యాపార కాంక్షతో మానవాళికుండే బలహీనతలను దుర్వినియోగం చేయడం కూడా జరుగుతున్నది. అందుకే ప్రజల మీద ఎట్లాంటి అవాంఛనీయమైన ఫలితాలు లేకుండా చూడడానికి సెన్సార్‌బోర్డు ఉద్దేశించబడినది. అయితే ఈ సెన్సార్‌బోర్డు దాని ఉద్దేశాలను నెరవేర్చడంలో ప్రయోజనకారి కాలేదు. చిత్ర పరిశ్రమపై నియంత్రణ ఏర్పరుస్తూ, సక్రమమైన మార్గంలో పనిచేయడానికి కొన్ని చర్యలు తీసుకోవలసి ఉంటుంది.

## పానీయాలు, పొగాకుపరిశ్రమ

పొగత్రాగడము, మద్యపానము మానవాళికి హానికరమని శాస్త్రీయ పరిశోధనలు ఋజువు చేసినవి. అయితే వాటిని పరిమితంగా ఉపయోగించవచ్చు కాని అలవాటు పడిన వ్యక్తి వాటిని తక్కువ స్థాయిలో తీసుకోలేడు. వీటికి అధికంగా ప్రకటనలు కూడా చేస్తుంటారు. విచారకరమైన విషయమేమిటంటే ఈ ప్రకటనలు మానవాళికి అవసరమయ్యే ముఖ్యవస్తువులపై కాకుండా హానికరమైన ఇటువంటి వస్తువులపై చేయడం జరుగుతున్నది. ఈ ప్రకటనలు వ్యక్తులలో అలవాటును సృష్టించడానికి దోహదం చేస్తాయి. ముఖ్యంగా బాల్యదశలో ఈ అలవాట్లు ఏర్పడతాయి. వ్యక్తి ఒకసారి అలవాటు పడినట్లయితే, ఇంక ఆ వ్యక్తి జీవితం నాశనం అవుతుంది. అందుకే ఈ వ్యాపారము చేసే వ్యాపారస్థులు చాలా ముఖ్యమైన పాత్రను వహించవలసి

ఉంటుంది. ఇట్లాంటి వ్యాపారస్థులపై పరిమితి, నియంత్రణ ఉంచవలె. ఒక వ్యక్తి బలహీనతలను ఆధారంగా చేసుకొని లాభాలు పొందడం సముచితమైన విధానం కాదు. చాలామంది వ్యాపారస్థులు వ్యాపార ప్రకటనల ద్వారా, ఉచిత సాంపుల్స్ ద్వారా, తక్కువ ధరలకు పంపిణీ చేయడం ద్వారా, ప్రజలను ఈ అలవాటుకు బానిసలను చేస్తారు. బానిసలయ్యే ఈ ప్రజలనుంచి ధరలను పీడించి వసూలు చేసుకొంటారు. బాధ్యతాయుతంగా ప్రవర్తించే వ్యాపారస్థులు ఇట్లాంటి చర్యలకు పూనుకోరాదు.

## ప్రెస్ సంస్థ

ప్రెస్ సంస్థ సమాజంపై ఎట్లాంటి ప్రభావం కలిగి ఉంటుందో అందరికీ తెలిసినదే. ప్రజల ఆలోచనా తీరును మార్చగలిగే శక్తి ప్రెస్ సంస్థకు ఉంటుంది. ప్రెస్ సంస్థ ఇతర కమ్యూనికేషన్ మీడియాద్వారా ప్రజల మనో రీతిని మార్చగలుగుతుంది. వ్యక్తి అభివృద్ధికి, సమాజ అభివృద్ధికి, స్వతంత్రం, స్వేచ్ఛ, లక్ష్యము, సహేతుకమైన ఆలోచన చాలా అవసరము. అయితే ప్రెస్ సంస్థకుండే స్వేచ్ఛ ప్రభుత్వం గాని, దాని యజమాని గాని వారి స్వార్థ ప్రయో జనంకోసం పరిమితం చేస్తారు. కొన్ని వార్తా పత్రికలు కేవలం ప్రభుత్వం గాని, ఇతర వ్యక్తులు గాని నడిపిస్తారు వారికి ప్రెస్ సంస్థపై ఎంతో అజమాయిషీ ఉంటుంది. నిజమైన ప్రజాస్వామిక పరిస్థితులలో స్వేచ్ఛాయుతమైన ఆలోచన ప్రాథమిక అంశము. ఇది నాగరికత, సంస్కృతాభివృద్ధికి చాలా ముఖ్యము. ప్రెస్ సంస్థపై ప్రభుత్వానికి నియంత్రణా శక్తి ఉన్నట్లయితే దానివల్ల చాలా అనర్థాలున్నాయి. ప్రభుత్వం సెన్సార్‌షిప్ (censorship) అవలంబించవచ్చు. వ్యక్తి తన స్వేచ్ఛాయుత భావాలను వ్యక్తీకరించుకొనే హక్కు కోల్పోవచ్చు. భారత దేశంలో మోనోపలీస్ కమీషన్ పెద్ద వ్యాపార సంస్థలకు ప్రెస్ సంస్థపై ఉండే ప్రభావాన్ని పరిశీలించింది. దాని ప్రకారం పెద్ద సంస్థలకు ప్రెస్‌తో సంబంధాలు ఉంటే సమాజంపై అవాంఛనీయమైన ప్రభావం ఏర్పడుతుంది. అంటే స్వేచ్ఛాయుతమైన ప్రజాభిప్రాయం ఏర్పడడానికి అవకాశంలేదు. కేవలం వ్యాపారస్థుల స్వప్రయోజనాలకు అనుకూలంగా ప్రెస్ సంస్థను ఉపయోగించు కొంటారు. దీనితోపాటు ఆ కమీషన్ తెలుసుకొనే దేమిటంటే వ్యాపారస్థుల అజమాయిషీలో ఉండే పత్రికలకు స్వతంత్రత ఉన్నప్పటికీ, అవి వ్యాపార సంస్థలపై పక్షపాత భావాన్ని చూపుతాయి.

ప్రెస్ యాజమాన్య విధానం ఏ విధంగా ఉన్నా ఎడిటర్లు, జర్నలిస్టులు, కరస్పాండెంట్లు, వారి స్వేచ్ఛాయుత భావాల వ్యక్తీకరణకు అవకాశం ఉండవలె. ఉద్యోగ భద్రతకు సంబంధించి వారికి కొన్ని హక్కులు ఉండవలె. ప్రభుత్వము, వ్యాపార సంస్థల అజమాయిషీ లేకుండా ప్రెస్ సంస్థను వేరు చేయవలె. ఆ విధంగా చేస్తేగాని వారికి స్వాతంత్ర్యం ఉండదు.

## రవాణా సేవా సంస్థలు

రవాణా పద్ధతిలో వచ్చిన విప్లవ కారణంగా ప్రపంచంలో వివిధ ప్రాంతాల మధ్య దూరమే లేదు. వివిధ ప్రాంతాలు ఒక దానికొకటి చేరువయినాయి. ఈ రవాణా సదుపాయాల వల్లనే వివిధ దేశాల మధ్య వర్తక, వాణిజ్య సంబంధాలు పెంపొందినాయి. ఆర్థికంగా ఒక దేశము, మరొక దేశము పరస్పరం ఒకదానిపైన మరొకటి ఆధారపడి ఉన్నాయి. ఈ రవాణా సదుపాయాలవల్ల వ్యక్తులు దూర ప్రాంతాలకు ప్రయాణించగలరు. వస్తువులను ఒక చోటు నుంచి వేరొక చోటుకు తరలించవచ్చు. అయితే ప్రయాణికులు వారి గమ్యానికి చేర్చవలసిన బాధ్యతను రవాణా సేవా సంస్థలకు విడిచిపెడతారు. బస్సులోనైనా, ట్రైనుతోనైనా, విమానంలోనైనా ప్రయాణం చేసేటప్పుడు వారికి భద్రత చేకూర్చవలసి ఉంటుంది. వ్యాపార సంస్థ వాహనంలో ఏదైనా లోపం ఉన్నా, అది సక్రమంగా లేకపోయినా దానిని వెంటనే ఇంకో కొత్త వాహనంతో మార్చివేయవలె. లేకపోతే అట్లాంటి వాహనాలలో ప్రయాణం చేసే ప్రజలు ప్రమాదాలకు గురి అవుతారు. ఒక వ్యక్తి అజాగ్రత్తగా ప్రవర్తించిన ఫలితంగా ప్రయాణికుల ప్రాణానికి ముప్పు వాటిల్లుతుంది. విమాన ప్రమాదము, రైలు ప్రమాదము, బస్సు ప్రమాదము చాలా తరచుగా చూస్తుంటాము. రోజు రోజుకూ రవాణా సంస్థ అభివృద్ధి చెందుతున్నప్పటికీ, ప్రమాదాల సంఖ్య కూడా అదే విధంగా పెరిగిపోతున్నది. అందుచేత రవాణా సంస్థ వ్యాపారస్థులు ప్రమాదాల నివారణకు కొన్ని చర్యలు తీసుకోవలె. లాభాలు ఆర్జించడంలో వ్యాపారస్థులు కేంద్రీకరించి, భద్రతా చర్యలు విస్మరించినట్లయితే, ప్రయాణికులపట్ల అది సముచితం కాదు. అంతేకాకుండా వాహనం ప్రమాదానికి గురి అయినట్లయితే, ఎంతో మూల ధన నష్టం జరుగుతుంది.

## పబ్లిక్ సంస్థలు

మన దేశంలో వ్యాపారం పబ్లిక్ రంగంలోను, ప్రయివేటు రంగంలోను కూడా జరుగుతున్నది. గుత్తాధిపత్య స్వభావం గల వ్యాపారం పబ్లిక్ రంగంలోనే

సాగుతుంది. ప్రయివేటు రంగంలో సమర్థవంతంగా వ్యాపారం జరగడానికి అవకాశం లేదనుకొన్నప్పుడు, కీలకమైన పరిశ్రమల విషయంలో వ్యాపారము పబ్లిక్ రంగంలో జరుగుతుంది. ఈ పబ్లిక్ సంస్థలు ప్రజాధనంతో వ్యాపారాన్ని చేస్తాయి. ప్రయివేటు సొమ్ము దుర్వినియోగం జరుగుతున్నప్పుడు వ్యక్తి పడే బాధ పబ్లిక్ సొమ్ము వృథా అయ్యేటప్పుడు ఉండదు. ఈ సత్యాన్ని గుర్తించవలె. పబ్లిక్ సంస్థలో సొమ్ము వృథా కావడానికి చాలా అవకాశాలున్నాయి. పబ్లిక్ రంగంలోని చాలా సంస్థల ఆర్థిక శక్తి కేంద్రీకరణ కలిగి ఉంటాయి. అందుకే వాటికి గుత్తాధిపత్య స్థానం లభిస్తుంది. గుత్తాధిపత్యం అవాంఛనీయమైనది. పబ్లిక్ సంస్థల్లోకూడా అధిక ధరలను ఆర్జించడము, చౌకబారు వస్తు, సేవలు సప్లయ్ చేయడం జరుగుతుంది. ఉత్పత్తి కారకాలను సోషలైజేషన్ (Socialisation) చేయడం అనే పేరుతోను, అధికమైన ప్రజలకు ప్రయోజనకరంగా ఉండవలెననే సాకుతోను, కార్యకలాపాలు నిర్వర్తించడంలో సామర్థ్యం కుంటుపడుతుంది. అధిక ధరలు నిర్ణయించి, లాభాలు సంపాదించి, అసమర్థతను కప్పిపుచ్చుకో వచ్చు. పరోక్షపు పన్ను (Indirect tax) ద్వారా ప్రభుత్వానికి రాబడి (Revenue) వస్తుంది. దీనినే పబ్లిక్ సంస్థల్లో పెట్టుబడి పెట్టడం జరుగుతుంది. సరియైన జాగ్రత్త వహించకపోతే ఈ ఆదాయం పబ్లిక్ సంస్థల్లో పెట్టుబడి పెట్టడంవల్ల ధనవంతులు ఇంకా ధనవంతులుగాను, పేదవారు ఇంకా పేదవారుగాను అయిపోవడానికి అవకాశముంది. ఆదాయము, సంపదలలో వ్యక్తుల మధ్య ఉండే తారతమ్యాలు ఎక్కువ అయిపోతాయి.

ప్రస్తుత పరిస్థితిని బట్టి పబ్లిక్ సంస్థలు సమాజంపట్ల చాలా బాధ్యతలు కలిగి ఉండవలె. ఎందుకంటే అవి సమాజం సొమ్ముతోనే కొనసాగుతాయి. సమాజ వ్యయంతోనే అభివృద్ధి చెందుతాయి పబ్లిక్ సంస్థలలో మేనేజ్‌మెంట్ వికేంద్రీకరణ చేయవలె. సిబ్బంది జీతాలను సంస్థ ఉత్పాదకత, లాభాలతో ముడిపెట్టవలె. కార్యకలాపాలు కొనసాగే తీరును తనిఖీ చేయడానికి ఒక యంత్రాంగం రూపొందించవలె.

## ప్రొఫెషనల్ సర్వీసులు

వ్యాపారమంటే వస్తువులకే పరిమితం కాకుండా, సేవలకు కూడా వర్తిస్తుంది. ప్రొఫెషన్ (profession) కూడా విస్తృత పరిధిలో వ్యాపారమే అని అర్థము. ఈ దృక్పథంతో డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, శాస్త్రజ్ఞులు, ఉపాధ్యాయులు

మొదలైన వారందరూకూడా వ్యాపార పరిధిలోకే వస్తారు. సమాజానికి వీరందరి సేవలుకూడా చాలా అవసరము. అదేవిధంగా వీరి ఉన్నతికికూడా సమాజం ఎంతో తోడ్పడుతుంది. వీరికి కావలసిన సదుపాయాలు సమాజం నుంచే పొందుతారు. విజ్ఞానవంతులైన ఈ వ్యక్తులు, వారి విజ్ఞాన ప్రయోజనాన్ని మిగిలిన వర్గాలవారికి అందజేయవలె. ఈ వ్యక్తులందరూ సమాజం దృష్టిలో ట్రస్టు బాధ్యతను వహించవలె. సమాజంపట్ల వీరికుండే బాధ్యతలు విస్మరించ కుండా నిర్వర్తించవలె.

# 5

# సామాజికబాధ్యతలు - వాటిభవిష్యత్తు

ఇంతవరకు వ్యాపారస్థులు ఏయే రకమైన సామాజిక బాధ్యతలు చేపట్ట వలసి ఉంటుందో తెలుసుకొన్నాము. ఈ అధ్యాయంలో సామాజిక బాధ్యతలు నిర్వర్తించడానికి అనుకూలమైన పరిస్థితులను గురించి, భారత దేశంలో సామాజిక బాధ్యతలు భవిష్యత్తులో ఎట్లాంటి మార్పును పొందుతాయి అనే విషయాన్ని గురించి తెలుసుకొంటాము. సామాజిక బాధ్యతా సూత్రానికి కొన్ని కొన్ని పరిమితులు ఉండడం యథార్థమే. అందుచేత వాటిని నిర్వర్తించడంలో వ్యాపారస్థులు కొన్ని ఇబ్బందులను ఎదుర్కొంటారు. అంతే కాకుండా వాటిని ఆశించిన రీతిలో నిర్వహించడం కూడా కష్టమే. భారతదేశంలో వ్యాపార సంస్థలు సామాజిక బాధ్యతలను చేపడుతున్నప్పటికీ, ప్రస్తుత రాజకీయ, సామాజిక, ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా వాటి నిర్వహణ సంతృప్తికరంగా లేదనే చెప్పవలె. సామాజిక బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించవలెనంటే కొన్ని అనుకూల పరిస్థితులు నెలకొని ఉండవలె వాటి గురించి ఈ దిగువ విపులంగా నేర్చుకొంటాము.

## వ్యాపారస్థుల భావాలలో మార్పు

వ్యాపారస్థులకు లోగడ చెప్పినట్లు లాభార్జనా ధ్యేయం ఉండడం సహజమే. లాభార్జన, అధికార వాంఛ, స్వలాభాపేక్ష, వ్యక్తిగత అభివృద్ధి లాంటి అంశాలు ప్రబలంగా ఉన్నప్పుడు, సామాజిక బాధ్యతలు సంతృప్తికరంగా చేపట్టడం సాధ్యం కాదు. ముఖ్యంగా వ్యాపారస్థుల మనోవైఖరిలో మార్పు రావలె. వారు సామాజిక బాధ్యతలను మనస్ఫూర్తిగా అంగీకరించవలె. వారు వ్యాపారం చేస్తున్నప్పటికీ, వారి ప్రధాన ధ్యేయం సమాజసేవేఅయి ఉండవలె. వారి కుండే స్వేచ్ఛ, అధికారం సమాజం నుంచి పొందినదే. వారికుండే ఆర్థిక నిర్ణయాలు తీసుకొనే అధికారాన్ని వికేంద్రీకరణ పరచి, సమాజ సంక్షేమాన్ని పొందవలెననే ఉద్దేశంతో ఉండవలె. వారి కుండే స్వేచ్ఛ, అధికారమే వారికి కొంత బాధ్యతను కూడా సృష్టిస్తుంది. వారు తీసుకొనే నిర్ణయాలు సమాజమంతటిపైన

ప్రభావాన్ని చూపుతాయి. అందుచేత మారుతున్న సమాజ అవసరాలకు అనుగుణంగా నిర్ణయాలు తీసుకొని వారి బాధ్యతలను నెరవేర్చవలసి ఉంటుంది. వ్యాపారసంస్థలు సమాజానికి ప్రతికూలంగా కొనసాగినట్లయితే సమాజ ప్రజలు ఎన్నో ఇబ్బందులు ఎదుర్కొంటారు. అంటే కలుషితమైన గాలిని పీల్చవలసి ఉంటుంది భరించలేని శబ్దాలు వినవలసి ఉంటుంది. ప్రమాదాలకుగురిఅయ్యే అవకాశం ఉంటుంది. అశాంతి వాతావరణంలో నివసించ వలసి ఉంటుంది. అంతే కాకుండా ఆర్థిక అస్థిరత, పేదరికము, అవాంఛనీయ ప్రకటనలు వీటి ఫలితాలను కూడా అనుభవించవలసి ఉంటుంది. సామాజిక బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించబడవలెనంటే వ్యాపారస్థుడు కేవలం వస్తు, సేవలను ఉత్పత్తి చేయడమే కాక, ప్రజల శ్రేయస్సుకుకూడా దోహదం చేయవలె. భారతదేశంలో ప్రస్తుతం రాజకీయ స్థిరత్వం లేదు. సామాజిక సమస్యలు పేర్కొనవలెనంటే ఎన్నైనా పేర్కొనవచ్చు. అందులో ముఖ్యమైనవి నిరుద్యోగ సమస్య, పేదరికము, మిన్నుముట్టే ధరలు, పరిశ్రమలలో ఉండే అశాంతి, పారిశ్రామిక ప్రాంతాలలో ఉండే కలుషిత వాతావరణము, మురికివాడలు, ఆహార పదార్థాల కల్తీ, మొదలయినవి. ఈ సమస్యల పరిష్కారానికి భారతదేశ వ్యాపారస్థులు ముందంజ వేయవలె. వారు ఈ బాధ్యత చేపట్టనిదే ప్రభుత్వం కూడా ఆ సమస్యలను పరిష్కరించజాలదు.

## ప్రజల వైఖరిలో మార్పు

సామాజిక బాధ్యతలు సక్రమంగా నిర్వర్తించబడవలెనంటే వ్యాపార సంస్థలు కొన్ని, కొన్ని నియమాలను పాటించడమే కాకుండా, సమాజ ప్రజలు కూడా వాటిని సముచిత రీతిలో అవగాహన చేసుకోవలె. వ్యాపారస్థులపై సామాజిక బాధ్యతలు నిర్వర్తించవలసిన ఆవశ్యకత ఎంత ఉంటుందో అంతే బాధ్యత ప్రజలపైనకూడా ఉండవలె. అంటే ప్రజలు వ్యాపారస్థులకు సహకరించవలె. వ్యాపారస్థులను ప్రత్యేకమైన వర్గంగా పరిగణించ రాదు. ఈ రెండు వర్గాలవారు చేదోడు వాదోడుగా పనిచేస్తే తప్ప సమాజం అభివృద్ధి కాదు. సమాజంలోని సమస్యలు పరిష్కరించబడవు. వ్యాపారస్థులు ఎప్పటికప్పుడే సమాజం పట్ల వారికుండే బాధ్యతలను విస్మరించకుండా, నియమాలను ఉల్లంఘించ కుండా ఉండడానికి ఒక రకమైన సామాజిక అదుపు యంత్రాంగాన్ని ప్రజలే రూపొందించ వలసి ఉంటుంది. సాధారణంగా వ్యాపారస్థులు కొన్ని నైతికనియ

మాలు, విలువలు పాటించక పోవడం జరుగుతుంది. అది వారు గుర్తించినట్లు తెలియజేయవలె. సామాజిక బాధ్యతా భావన సమాజంలో ఒక శక్తిగా మార వలెనంటే వ్యాపార కార్యకలాపాల గురించి ప్రజలకు కచ్చితమైన అవగాహన ఉండవలె. వ్యాపారస్థులు పాటించ వలసిన కొన్ని ప్రామాణికాలను, నిబంధన లను ఏర్పరచవలె. భారతదేశ ప్రజలలో మార్పు ఎక్కువగా రావలసి ఉన్నది. దేశ ప్రజలలో అక్షరాస్యత తక్కువగా ఉండడం వల్ల వ్యాపారస్థులు కొన సాగించే కార్య కలాపాలను సక్రమంగా అవగాహన చేసుకోలేక పోవడం వల్ల వ్యాపారస్థులు కొన్ని అనాచారాలకు పాల్పడుతుంటారు దీనికి మించి మన దేశంలో ఒక ప్రాథమిక లోపం కూడా ఉన్నది. అదేమిటంటే ప్రజలు కొన్ని కొన్ని సమస్యల పరిష్కారం ప్రభుత్వ బాధ్యతగా పరిగణించి నిర్లక్ష్యంచేస్తారు. కొంతమంది ప్రజలకు వ్యాపార సంస్థల కార్యకలాపాల పట్ల ఉదాసీన భావం కూడా ఉంటుంది. ఇదే పరిస్థితి కొనసాగి నట్లయితే, వ్యాపారస్థులు దీనిని ఆసరాగా తీసుకొని వారికి సమాజం వట్ల ఉండే బాధ్యతలను విస్మరించడమే కాకుండా ప్రజలను మోసం చేయడానికి కూడా సిద్ధపడవచ్చు.

## సామాజిక బాధ్యతల సక్రమ నిర్వచనము

సామాజిక బాధ్యతలు సక్రమంగా నిర్వచించబడి ఉండవలె. వీటిని నిక్కచ్చిగా నిర్వచించడం కష్టమే అయినా కనీసం కచ్చితమైన అర్థాన్నిచే టట్లుగా నైనా వాటిని ఏర్పరచుకోవలె ముఖ్యంగా ఒక నిర్ణీతకాలంలో, నిర్ణీత స్థలంలో నిర్ణీత పరిస్థితులలో వ్యాపారస్థుడు ఏయే కార్యకలాపాలను, ఏయే బాధ్యతలను నిర్వ ర్తించవలెనో స్పష్టంగా తెలుసుకోవలె అయితే దీనితో పాటు వాటిలో కొంత సారళ్యత (flexibility) కూడా అవసరము ఎందుకంటే మారే పరిస్థితులకు అనుగుణంగా వ్యాపారస్థులు చేపట్టవలసిన బాధ్యతలు కూడా మారుతుండవలె. ముఖ్యమైన విషయమేమిటంటే వ్యాపారస్థులు నిర్వర్తించ వలసిన బాధ్యతలు మార్పుకు గురి అవుతున్నప్పటికీ, కొన్ని సాధారణ ప్రమాణాలను ఏర్పరచుతో వలసిఉంటుంది. అవి సులువుగా అవగాహన చేసుకోడానికి అనుకూలంగా ఉండ వలె. అందువల్ల వ్యాపారస్థునికి తను పాటించవలసిన ప్రామాణిక నియమాలు తెలుస్తాయి. వ్యాపారస్థునికి ఎంతమంచిఉద్దేశం ఉన్నప్పటికీ తాను అనుసరించ వలసిన నీతి నియమాల గురించి తెలియనప్పుడు నీతిగా ఉండలేడు. సక్రమ ప్రవర్తన అవలంబించలేడు. అయితే ఈ సామాజిక బాధ్యతలను ఏ విధంగా,

ఎవరు నిర్వచించ వలెననే ప్రశ్న ఉదయిస్తుంది, చాలామంది వ్యాపారస్థులు వ్యాపార కార్యకలాపాలు, సమస్యలతో వారికుండే అనుభవం వల్ల వారే నిర్ణయించవలెనన్న అభిప్రాయం ఉంది. అందుచేత వ్యాపారస్థులందరూ కలసి, చర్చలు జరిపి, వారు సమాజం పట్ల నిర్వర్తించ వలసిన బాధ్యతలను రూపొందించవలసి ఉంటుంది. అయితే సాధారణ ప్రజలలో కొంతమందిని కూడా సంప్రదించినట్లయితే ఆ బాధ్యతలు సామాజికంగా కూడా ఆమోదయోగ్యంగా ఉంటాయి. ఎందుకంటే ఈ బాధ్యతలను నిర్వచించే కర్తవ్యం పూర్తిగా వ్యాపారస్థులకే వదలి వేసినట్లయితే, సహజంగా వారు సమాజం శ్రేయస్సు దృష్ట్యా వాటిని రూపొందించలేరు. ఈ కారణంవల్లనే తక్కిన వర్గాలవారి అభిప్రాయాలకు కూడా అవకాశం ఇవ్వవలె. వ్యాపారస్థులే తుది నిర్ణేతలు కాకూడదు. ఆసక్తి ఉండే వివిధ వర్గాల వారు ప్రజాస్వామ్య సిద్ధాంత ప్రక్రియద్వారా ఈ బాధ్యతలను నిర్వచించినట్లయితే, అవి సమాజానికి ఎంతో ప్రయోజనకరంగా ఉంటాయి. సామాజిక బాధ్యతలు భారతదేశంలో ప్రజాస్వామ్య సిద్ధాంతం ద్వారా నిర్వచించబడవలె ననే కొన్ని ప్రత్యేక సంస్థల అవసరం ఏర్పడుతుంది. ఈ సంస్థలు నెలకొల్పడం ద్వారా, ఆసక్తి ఉండే వివిధ వర్గాల వారినుంచి అభిప్రాయాలను సేకరించి, వాటిని సమన్వయపరచి చివరకు సామాజిక బాధ్యతలుగా రూపొందించవచ్చు.

## లక్ష్యాలను నిర్వచించడం

సామాజిక బాధ్యతలను నిర్వర్తించడానికి ముందు లక్ష్యాలను (Goals) క్రమంగా నిర్వచించవలె. ఎందుకంటే లక్ష్యాలు సరిగా నిర్వచించ లేనినాడు, వ్యాపారస్థులు సామాజిక బాధ్యతలను నిర్వర్తించినప్పటికీ, వాటివల్ల చేకూరవలసినంత ప్రయోజనం సమాజానికి చేకూరదు. అంతేకాకుండా గమ్యం సరిగా నిర్ణయించకోనినాడు, చేసిన ప్రయత్నం, కృషి చాలామేరకు వృధా అవుతుంది. ఈ లక్ష్యాలను నిర్వచించడానికి ఇంత ప్రాధాన్యత ఉండడానికి కారణము, ఒక్కొక్కసారి ఒక లక్ష్యాన్ని సాధించవలెనంటే, ఇంకో లక్ష్యాన్ని వెనకబెట్ట వలసి ఉంటుంది. సమాజంలో ప్రజలు కొన్ని విషయాలకు ప్రాధాన్యమెక్కువ ఇస్తారు, మరికొన్నిటికి తక్కువ ప్రాధాన్య మిస్తారు. వీటి ప్రకారం సామాజిక బాధ్యతలలో కూడా మార్పు జరగవలె. అందుకే ఏయేలక్ష్యాలు సమాజంలో ఆమోదకరంగా ఉంటాయో ఆ లక్ష్యాలను సాధించడానికి సామాజిక బాధ్యతలను రూపొందించవలె,

## లాభార్జన

లోగడ వ్యాపారంలో ఉండే లాభార్జనా ధ్యేయాన్ని ఎంతగానో విమర్శించడం జరిగింది. అంతమాత్రాన వ్యాపార సంస్థలు పూర్తిగా లాభార్జనను విస్మరించవలెనని కాదు. లాభాలు లేనట్లయితే వ్యాపారాన్ని ఎవరూ కొనసాగించలేరు. ఎందుకంటే వ్యాపారం చెయ్యవలెనంటే ఎన్నో ఖర్చులు పెట్టవలసి ఉంటుంది మరి ఆ ఖర్చులన్నీ పెట్టి, నష్టాలతో ఎవరు వ్యాపారాన్ని నడిపిస్తారు? అట్లానే సామాజిక బాధ్యతలను చేపట్టవలెనంటే వ్యాపారస్థులు అదనపు వ్యయాన్ని చేయవలసి ఉంటుంది. ఈ వ్యయాన్ని కూడా లాభాలనుంచే సర్దుబాటు చేయవలె. అంతేగాని నష్టపోరాదు. అందుచేత ఏ వ్యాపారస్థుడైనా తను సామాజిక బాధ్యతలను సక్రమంగా నెరవేర్చవలెనంటే తప్పకుండా లాభాలను ఆర్జించవలె. ముఖ్యంగా తను వ్యాపారంలో నిలదొక్కుకోవడానికి, ఆ తరవాత సామాజిక బాధ్యతలు చేపట్టడానికి లాభార్జన అనేది స్వార్థపరమైన ప్రయోజనం కోసం చేపట్టేది అని, దాని స్థానంలో సమాజసేవాదృక్పథం చోటు చేసుకోవలెనని అభిప్రాయం ఉంది. 'లాభంకోసం ఉత్పత్తి' అనేదానిబదులు 'సేవకోసం ఉత్పత్తి' అనే పదం చోటు చేసుకొన్నది. అయితే ఈ రకమైన ఆలోచనలో లాభాలపై ఉండే తప్పు అభిప్రాయాన్ని సూచిస్తుంది. ఎందుకంటే అద్దె పొందవలెననే ఉద్దేశం (Rent motive), వడ్డీ పొందవలెననే ఉద్దేశం (Interest motive), వేతనాలు పొందవలెననే ఉద్దేశం (Wage motive) వంటిదే, లాభార్జన (Profit motive) కూడా. అందువల్ల లాభార్జనను విమర్శించే ముందు వాటన్నిటినీ విమర్శించవలసి ఉంటుంది. భూస్వామి తను ఒక పంటకు బదులు ఇంకో పంటను పండిస్తే, దానిని సక్రమమైనదిగా భావిస్తారు. పెట్టుబడిదారు ఒక సంస్థనుంచి వేరొక సంస్థకు పెట్టుబడి మార్చివేసి ఎక్కువ వడ్డీని పొందితే అది తెలివైన పనిగా గుర్తిస్తారు. ఒక శ్రామికుడు ఒక పరిశ్రమనుంచి వేరొక పరిశ్రమకు మారి ఎక్కువ వేతనాలు పొందితే అది వివేకమైనదే అంటారు. అట్లాంటప్పుడు వ్యాపారస్థుడు ఒక వస్తువుకు బదులు ఇంకోవస్తువు ఉత్పత్తి చేసిగాని, ఒక యంత్రానికి బదులు ఇంకో యంత్రాన్ని ఉపయోగించిగాని, కొన్ని ఆదాలు పొందితే అదితప్పు ఎట్లా అవుతుంది? అందుకే లాభార్జనా ధ్యేయాన్ని నిందించ పనిలేదు. అయితే ఈ లాభార్జన వల్ల గుత్తాధిపత్యము, ఎక్స్‌ప్లాయిటేషన్ (Exploitation), మోసము, లంచగొండితనము, వనరుల దుర్వినియోగము, ఆర్థిక ఒడుదుడుకులు మొదలయినవి తల ఎత్తినట్లయితే,

అట్లాంటప్పుడు దానిని విమర్శించవచ్చు.

భారత దేశంలో, వ్యాపార సంస్థలు చేపడుతున్న సామాజిక బాధ్యతలలో కొన్ని మార్పులు రావలసిఉన్నది. సామాజిక బాధ్యతలను ఇంకా విస్తృత పరచవలసి ఉన్నది. మనదేశం ఇంకా అభివృద్ధి చెందుతున్న దేశం కాబట్టి వ్యాపారస్థులు చేపట్టవలసిన కార్యక్రమాలు చాలా ఉన్నాయి. వ్యాపారస్థులు వ్యాపారాన్ని కొనసాగించవలెనన్నా, వ్యాపారంలో నిలదొక్కుకొని లాభాలు ఆర్జించవలెనన్నా అందుకు ప్రజలు కూడా సహకరించవలెకదా. ఆ పైనే అభివృద్ధి సాధించడం జరుగుతుంది. అట్లాంటప్పుడు వ్యాపార సంస్థలు ప్రజలకు కావలసిన అవసరాలను సంతృప్తి పరచవలె ప్రస్తుతం మనదేశంలో ఏ మూల చూసినా శ్రామికులు, యాజమాన్యం మధ్య తగవులు, ఆపైన సమ్మెలు, లాకౌట్లు చూస్తున్నాము. ఈ విధంగా మనం ఎంతో ఉత్పత్తిని నష్టపోతున్నాము. చాలామంది శ్రామికులు వేతనాలు లేకనో, లేక రిట్రెంచ్‌మెంట్ వల్లనో ఎన్నో ఇబ్బందులకు గురి అవుతున్నారు. ఇట్లాంటి పరిస్థితి అభివృద్ధికి అభిలషణీయంకాదు అందు చేత వ్యాపారస్థులు శ్రామికుల సహకారాన్ని పొందడానికి కొన్నిచర్యలు తీసుకో వలె. శ్రామికులకు మంచి సదుపాయాలను కల్పించి, వారి నైపుణ్యాన్ని పెంచ డానికి తగిన శిక్షణ ప్రోగ్రాములు ఏర్పరచి వారి స్థితిగతులను మెరుగు పరచ డానికి కృషి చేయవలె. దేశంలో ప్రస్తుతం ఉన్న సమ్మెలు, అశాంతి పరిస్థితి తొలగించగలిగినట్లయితే దేశం పురోభివృద్ధి చెందవచ్చు.

భారత దేశంలో ప్రస్తుతం పరిష్కరించవలసిన సమస్యలు ఇంకెన్నో ఉన్నాయి. ఉదాహరణకు నిరుద్యోగం ఒక తీరని సమస్యగా పరిణమించినది. దేశంలో ఎంతో మంది యువకులు ఉద్యోగాలు లేక నిరాశతో జీవితాన్ని సాగిస్తున్నారు. యథార్థానికి మన దేశంలో శ్రామిక సప్లయ్ అధికమై ఈ నిరుద్యోగ సమస్య ఏర్పడలేదు. దేశంలో ఉన్న వనరులను సద్వినియోగం చేసుకోలే కందువల్ల ఉత్పత్తి కార్యక్రమాలు సక్రమంగా చేపట్టిఉద్యోగావకాశాలు కల్పించ లేనందువల్ల ఈ సమస్య ఉత్పన్నమయ్యింది. అంతేకాకుండా నేటి యువతరంలో ఉండే శక్తి సామర్థ్యాలు సద్వినియోగం చేసుకోలేక పోవడం జరుగుతున్నది. అంటే విధానం (Policy) లోనే ఏదో లోపమున్నట్లు అర్థమవుతున్నది ఇట్లాంటి పరిస్థితులలో బాధ్యతాయుతంగా నడిచే వ్యాపార యజమానులు సక్రమమైన రీతిలో విధానాలను రూపొందించి ఉద్యోగ అవకాశాలను కల్పించవలె ప్రభుత్వం

ఇందుకు ఎన్ని చర్యలు తీసుకొన్నప్పటికీ వివిధరంగాలలో వ్యాపారాన్ని కొనసాగిస్తున్న వ్యాపారస్థులు కూడా ప్రభుత్వానికి సహకరించి సత్వరమే ఈ సమస్యను పరిష్కరించడానికి కృషి చేయవలె

భారతదేశంలో జనాభా పెరుగుదలకూడా అత్యధికంగా ఉంది. మన దేశంలో లోగడ చెప్పినట్లు ప్రజలలో అక్షరాస్యత తక్కువగా ఉండడం వల్ల ప్రజలు కొన్ని మూఢనమ్మకాల ప్రభావానికి లోనై నేడు ప్రభుత్వం అనుసరిస్తున్న చర్యలను సక్రమంగా అవగాహన చేసుకోవడంలేదు. కుటుంబ నియంత్రణ చర్యలు లోగడ కొంత ఫలితాన్నిచ్చినా అవి వాంఛనీయమైన స్థాయిని చేరుకోలేదు. అంతేకాకుండా రాజకీయ కారణాల వల్ల కూడా కుటుంబ నియంత్రణా చర్యలు కుంటుపడిపోవడం జరిగినది. పెరుగుతున్న జనాభాను అరికట్టవలె. అందుకు వ్యాపార సంస్థలు సహకరించవలె.

మనదేశం ప్రాథమికంగా గ్రామీణ దేశం కాబట్టి దేశ పురోభివృద్ధి గ్రామాలపైనే ఆధారపడి ఉంటుంది. అయితే మనదేశంలో కొన్ని కొన్ని ప్రాంతాలలోనే పరిశ్రమలు అధికంగా నెలకొల్ప బడటం, కొన్ని కొన్ని ప్రాంతాలు పూర్తిగా విస్మరించడం జరిగినది. కొన్ని అభివృద్ధి చెందిన పట్టణాలలో పరిశ్రమలు కేంద్రీకృతం కావడంతో ఎన్నో సమస్యలు తలెత్తినాయి. వాతావరణం కలుషితమై ప్రజల ఆరోగ్య పరిస్థితికి హానికరంగా తయారయింది. పట్టణ నివాస కూడా దుర్భరమవుతుంది. ఇళ్ల సమస్య ఏర్పడుతుంది. మురికి వాడలలో నివసించవలసిన అగత్యం ఏర్పడుతుంది. తాగడానికి నీరే కరువవుతుంది. తాగేనీరుకూడా పరిశుభ్రమైనది కాకపోవడం వల్ల అనారోగ్యానికి దారితీస్తుంది. భారతదేశంలో ప్రస్తుతం ఉన్న ఇట్లాంటి సమస్యలను పరిష్కరించకుండా వివేకవంతులైన వ్యాపారస్థులు కళ్లుమూసుకొని కూర్చోలేరు మన దేశంలో పబ్లిక్ రంగంలో చాలా సంస్థలు నష్టాలకు గురి అవుతున్నాయంటే అవి సామాజిక బాధ్యతలను చేపట్టడం వల్ల మాత్రంకాదు. ఆయా సంస్థలలో యాజమాన్యం అసమర్థత, ప్రభుత్వం ఉదాసీనత అందుకు కారణము.

భారత దేశ పబ్లిక్ రంగంలో కంపెనీలలో పెట్టిన పెట్టుబడి కార్పొరేట్ రంగంలో చేసిన పెట్టుబడిలో 70 శాతం ఉంటుంది అందచేత అంత పెట్టుబడి వల్లఉండే సామాజిక వ్యయాలు, సామాజిక ప్రయోజనాలు బేరీజు వేసుకోవలసి ఉంటుంది పబ్లిక్ రంగంలో పెట్టుబడికి మొట్టమొదట నిర్ణయించ వలసిన

అంశం సామాజిక వ్యయ-ప్రయోజన విశ్లేషణంగా అంగీకరించ బడింది అందుచేత అదే సామాజిక వ్యయము, సామాజిక ప్రయోజనం అంశాలు ప్రయివేటు రంగంలోకూడా వర్తించడం సహజము. ప్రస్తుతం మనదేశ పబ్లిక్ రంగంలోని వ్యాపార సంస్థలు పార్లమెంటుద్వారా ప్రజలకు జవాబు దారీ ( *accountable* ) కావడం జరుగుతున్నది. అదే విధంగా ప్రయివేటు రంగంలోని సంస్థలు కూడా సామాజిక జవాబుదారీ తనము ( Social accountability) ద్వారా అవి వాటి ఆర్థిక కార్య కలాపాలతో పాటు సామాజిక బాధ్యతలను చేపడుతున్నదీ, లేనిదీ ప్రజలకు తెలియజేసే ఏర్పాటు చేయవలె. వ్యాపారస్థుడు ట్రస్టీగా వ్యవహరిస్తున్నప్పుడు, అది సక్రమంగా ఉన్నదీ, లేనిదీ ఒక బయటి వ్యక్తి (outside person ) పరిశీలించి చెప్పవలె. సామాజిక తనిఖీ (Social audit) అనే కార్యకలాపం శ్రామికులు, వినియోగ దారు, వాటాదార్లు, యాజమాన్యం ప్రతినిధులతో కూడిన ఒక సంఘం ద్వారా నిర్వహించవలె. ఒక సంస్థ ప్రజోపయోగం లేదని తెలిసికూడా ఏదైనా కార్య కలాపం చేపట్టినట్లయితే అట్లాంటి కంపెనీకి సామాజికంగా బాధ్యత లేదని చెప్పవలె. వ్యాపార నిర్ణయాలు తీసుకొనేటప్పుడు సామాజిక బాధ్యతలను దృష్టిలో పెట్టుకోవలె.

భారతదేశంలో ఉత్పత్తి అధికం చేయవలసి ఉన్నది. అందుకు వీలైనన్ని ఎక్కువ పరిశ్రమలు స్థాపించవలె, అయినప్పటికీ శ్రామికులకు రక్షణ, భద్రత, వనరుల తరుగుదల, ప్రజోపయోగ సౌకర్యాలు మొదలయిన విషయాలు సక్రమంగా ఏర్పాటు చేసుకోకుండా ఏ పరిశ్రమను స్థాపించరాదు. మనదేశం ముఖ్యంగా వ్యవసాయక దేశము. అందుచేత ప్రత్యేకమైన సామాజిక బాధ్యతలు నెరవేర్చవలసి ఉంటుంది అంటే ఉత్పత్తి ఆదాలను దృష్టిలో పెట్టుకొని గ్రామీణ ప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడం, ప్రస్తుతం నెలకొల్పిన పరిశ్రమలను ఆ ప్రాంతాలకు వ్యాపింపజేయడం కూడా వ్యాపారస్థులు చేపట్టవలసి ఉంటుంది. వెనకబడిన ప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడానికి ముందుకొస్తే అటువంటి వారికి ప్రభుత్వం కూడా కొన్ని సదుపాయాలను కలిగి స్తుంది. సమాజం పట్ల బాధ్యతాయుతంగా ఉన్న ఏ కంపెనీ అయినా లాభం ఆధారంగా చేసుకొనే స్థలాన్ని నిర్ణయించదు. ఆ ప్రాంతాలలో ఉన్న నిరుద్యోగ సమస్యను ఎంతవరకు పరిష్కరించ వచ్చు. ఎంతమందికి ఉద్యోగా

వకాశాలు కల్పించవచ్చు. అనే దృక్పథంలోనే విచారణ చేస్తుంది. అందుచేత ప్రతి కంపెనీ దాని చుట్టు పక్కల ఉండే సాంఘిక, ఆర్థిక పరిస్థితులను పరిగణనలోకి తీసుకొని, వ్యాపార విధానాలను, వ్యాపారనిర్ణయాలను తీసుకోవలసి ఉంటుంది.

మనదేశంలో సగానికి పైగా ప్రజలు గ్రామీణ ప్రాంతాల్లోనే నివసిస్తున్నారు. అందుచేత ఆ ప్రజల సంక్షేమమే ప్రధాన అంశంగా దృష్టిలో పెట్టుకొని, దేశ అభివృద్ధిని సాధించవలె ఇట్లాంటి ప్రాంతాల్లో వ్యాపారస్థులు కంపెనీలు ప్రారంభించినట్లయితే, పెట్టుబడిపై వచ్చే రాబడి దృష్ట్యా అది తక్కిన కంపెనీలకంటే లాభదాయకంగా లేకపోయినా, వాటికంటే ఇది సామాజికంగా బాధ్యతాయుతమైన కంపెనీ అని పేర్కొవలసి ఉంటుంది. అంటే సామాజికంగా వెనుకబడిన వర్గాలు, ఇతర బలహీన వర్గాలవారికి తోడ్పడడానికి, వారి పరిస్థితి మెరుగుపరచడానికి కంపెనీ అవలంబించే విధానాలను బట్టి ఆ కంపెనీని అంచనా వేయవలసి ఉంటుంది. కంపెనీకి ప్రజల పట్ల ఉండే కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తిస్తున్నదీ, లేనిదీ తెలుసుకోడానికి ఆ కంపెనీ దాని కార్యకలాపంలో, శ్రామికుల సంక్షేమాన్ని నెలకొల్పడంలో, ప్రయోజన విద్య వ్యాపింపజేయడంలో, ప్రజల ఆరోగ్య పరిస్థితి మెరుగు చేయడంలో మొదలయిన అంశాలలో ఆ కంపెనీ తీసుకొనే ఆసక్తిని బట్టి నిర్ణయించవలె అయితే కొంతమంది ఈ అంశాలన్నీ ప్రభుత్వం చేపట్టవలసినవిగా భావించవచ్చు. కంపెనీకి వీటితో సంబంధం లేదనుకోవచ్చు. కాని యథార్థానికి మనదేశ ఆర్థిక వ్యవస్థలో కార్పొరేటు రంగం వహించవలసిన పాత్ర ఎంతో ప్రాముఖ్యమైనది. కార్పొరేట్ రంగంలో వనరులు, శ్రామికశక్తి, ముడి పదార్థాలు ఉపయోగింపబడుతున్నందువల్ల, కంపెనీ అవసరాలు, సమాజం అవసరాల మధ్య సామరస్యం ఉండేటట్లు చూడవలసిన బాధ్యత కంపెనీలపై ఉంటుంది. ఇంతవరకు మనదేశంలో కంపెనీలు కేవలం ఫైనాన్షియల్ సమాచారాన్ని మాత్రమే తయారు చేసి వాటిని రిపోర్టు చేయడం జరుగుతున్నది. ఇదే మాదిరిగా సామాజిక బాధ్యతల సమాచారాన్ని కూడా తయారు చేసి, రిపోర్టు చేయడం అభిలషణీయంగా ఉంటుంది. అంటే అప్పుడు ఈ సామాజిక బాధ్యతలను కూడా నిత్యమూ జరిపే వ్యాపార కార్యకలాపంలో భాగంగా గుర్తించినట్లు అవుతుంది. అప్పుడే సమాజం పట్ల బాధ్యత కంపెనీ అంగీక

రించినట్లు కొన్ని ఇతర దేశాలలో పరిసర ప్రాంతాలు, ప్రజల ఆరోగ్య పరిస్థితి. వారి సంక్షేమము, భద్రత, బలహీన వర్గాల శ్రేయస్సు, స్త్రీలకు లభించే ఉద్యోగావకాశాలు మొదలయిన సామాజిక బాధ్యతలు నెరవేర్చడంలో కంపెనీలు ఎంతవరకు దోహదం చేస్తున్నాయి అనే రకంగా వాటిని అంచనా వేయడం జరుగుతున్నది. సామాజిక బాధ్యతా సమాచారాన్ని తయారు చేస్తే దానిని రకరకాల పేర్లతో పిలవ వచ్చు ఉదాహరణకు సాంఘిక—ఆర్థిక అకౌంటింగ్ సామాజిక అకౌంటింగ్, సామాజిక బాధ్యతా అకౌంటింగ్ అని పిలవవచ్చు. అయితే ప్రస్తుతం ఆమోదకరంగా ఉన్న పేరు "సామాజిక ఆడిట్".

భారతదేశంలో ఏ విధంగా సామాజిక బాధ్యతను ఆచరించవలె? అనే ప్రశ్న ఉదయిస్తుంది, కార్పొరేట్ రంగం అది నిర్వర్తించే సామాజిక బాధ్యతలకు గుర్తింపుగా వాటాదారులకు, సాధారణ ప్రజలకు సామాజిక బాధ్యతల గురించి సమాచారం తెలియజేయవలె ఈ తెలియజేయడం సాధారణ పద్ధతిలో కాకుండా వ్యయం చేసిన ఖర్చు పరిమాణం రూపంలో రిపోర్టు తయారుచేసి సమాచారాన్ని అందజేయవలె అయితే అది ఎంత విపులంగా తయారుచేయవలెనో ఆ కంపెనీ పనిచేసే విధానాన్నిబట్టి నిర్ణయించవలె. అందులో పొందుపరచిన వివరాలు తిరిగి విధానాన్ని రూపొందించడానికి దోహదం చేయవలె. అయితే ఈ వివరాలు పొందుపరిచే పద్ధతిలో వివిధ సంస్థల మధ్య కొద్ది కొద్దిగా తేడాలున్నప్పటికీ, కొన్ని కొన్ని విషయాలకు సంబంధించి, డైరెక్టర్లు అదనంగా సప్లయ్ చేయవలసిన సమాచారంపై ఎట్లాంటి వైవిధ్యమూ ఉండదు. ఆ విధంగా ప్రతి కంపెనీ ప్రతిసంవత్సరం అది చేపట్టిన సామాజికబాధ్యతల సమాచారాన్ని తప్పనిసరిగా ఇవ్వవలసి ఉంటుంది. కొన్నిసార్లు కంపెనీ చేపట్టిన సామాజిక బాధ్యతలను విపులంగా వివరించినప్పటికీ వాటి ప్రయోజనాలు. ఆ సంస్థల యజమానులే అనుభవించి ఉండవచ్చు. అదే యథార్థమయితే అట్లాంటి కార్యకలాపాలవల్ల ప్రయోజనం లేదు. అందుకోసం అదే రిపోర్టులో వాటి ప్రయోజనాలు యజమానులకు అంటే డైరెక్టర్లకు గాని, వారి బంధువులకుగాని. వారి స్నేహితులకుగాని చేరలేదని కూడా ధృవీకరించవలె. అప్పుడే ప్రజలకు ఆసామాజిక బాధ్యతలపైన. వాటి ప్రయోజనాలపైన నమ్మకం కలుగుతుంది. ఖర్చుపెట్టిన సొమ్ము, వినియోగించిన శ్రామిక శక్తిద్వారా కంపెనీ చేసిన కృషిని కచ్చితంగా అంచనా

వేయవచ్చు. ఇది ప్రారంభించవలసిన ఆవశ్యకత సత్వరమే ఉన్నది. సామాజిక రిపోర్టును తయారు చేసి. సమాచారం తెలియజేసే విధిని చట్టంలో పొందు పరచవలె. ఈ చర్యలను ప్రారంభించినట్లయితే మనదేశంలో కూడా వ్యాపార సంస్థలు సక్రమంగా వాటి విధిని నిర్వహించగలవు. సమాజ అభివృద్ధికి, దేశపురోభివృద్ధికి తోడ్పడగలవు.

ప్రస్తుతం దేశంలో వ్యాపార సంస్థలలో సామాజిక ధ్యేయం లేకపోయిన కారణంగా, రాజకీయ అస్థిరత, సామాజిక బలహీనతలు(Social backwardness) చోటుచేసుకొన్నాయని కొంతమంది అభిప్రాయపడుతున్నారు. సామాజిక బాధ్యత చట్టపూర్వకమైనది కాదు. ఇది ఒక సర్దుబాటు అని గుర్తించవలె. భారతదేశ సమాజం చాలా విషయాలలో పురాతనమైనదైనప్పటికీ, కొన్ని వర్గాల వారు కొత్తవిలువలను పాటిస్తూ, వాటి ఆవశ్యకాన్ని గురించి మిగిలిన సభ్యులకు తెలియజేస్తున్నారు. ఉదాహరణకు మనదేశంలో సామ్యవాద సమాజ పద్ధతి ప్రకటించినారు. శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానంలో ఎంతో అభివృద్ధి సాధించినారు. మెరుగైన జీవనానికి, మంచిపని సదుపాయాలకు శ్రామికసంఘాలు వ్యవస్థీకరించినారు. ఇవన్నీ నేడు భారతదేశ వ్యాపారస్థులపై సమాజం తీసుకొనివచ్చే ఒత్తిడి (Pressure) ఫలితమే. మనదేశ ప్రభుత్వం ప్రజల తలసరి ఆదాయాన్ని పెంచి, వారి జీవన ప్రమాణాన్ని అభివృద్ధి చేయడానికి చాలా ఆకాంక్ష పడుతున్నది. అయినప్పటికీ వ్యాపారస్థులు ఆధునిక శాస్త్రాన్ని, సాంకేతిక పరిజ్ఞానాన్ని పూర్తిగా వినియోగపరిచి, పరిశోధనా సిబ్బందిని ప్రోత్సాహపరిచి, అభివృద్ధి చేస్తే తప్ప ఆర్థికాభివృద్ధికి తగినఅవకాశం ఉండదు. ఆర్థికాభివృద్ధికి అనుకూలమైన కొన్ని పరిస్థితులను సృష్టించవలె. అందుచేత మనదేశ జాతీయాదాయాన్ని పెంచడానికి వ్యాపారస్థులు కృషిచేయవలె.

మనదేశంలో ఒక ప్రత్యేక సామాజిక అంశం ఏమిటంటే కొన్ని పెద్ద సంస్థల సమస్యలు, ఇబ్బందులను ప్రజలు తెలుసుకోవడం లేదు. ఇది ముఖ్యంగా ప్రయివేటు రంగంలోని సంస్థలపట్ల ప్రజలు వహించే తీరు. ఈ పరిస్థితికి కారణం వ్యాపారస్థులలో సామాజిక ధ్యేయం లోపించడమే. ప్రజలు వ్యాపార సంస్థలను లాభాలు ఆర్జించే సంస్థలుగానే తప్పితే సమాజ అవసరాలపై ఆసక్తి కలిగిన ఒక కంపెనీగా భావించడం లేదు. వ్యాపారస్థులు సమాజ సేవచేసి ప్రజలకు ఉపయోగపడితే, తిరిగి ప్రజలు వారికి సహకరించి, వారి సమస్యలను

ఇబ్బందులను సావకాశంగా పరిశీలించి, సామరస్యాన్ని పెంపొందించిననాడే వారి, మధ్య సత్సంబంధాలు నెలకొని ఇరువర్గాలవారూ అభివృద్ధి చెందుతారు. సరియైన చర్యలు తీసుకొంటే వ్యాపారస్థులు ప్రజలకు వారిపై ఉండే విముఖతను తొలగించగలరు. అంటే ప్రస్తుతం పబ్లిక్ రంగంలో ఉన్నట్లుగా ప్రయివేటు రంగంలో కూడా ఒక వ్యవస్థా తరగతిని ఏర్పాటు చేయవలె.

సామాజిక బాధ్యతా భావన భారతదేశంలో గత రెండు దశాబ్దాలలో ఉధృతమైనప్పటికీ, వాటి ఆచరణకు సంబంధించిన భవిష్యత్తు ఆశాజనకంగా ఉందని చెప్పవచ్చు. ప్రజా బాహుళ్యంలో వచ్చిన మార్పు, వారి ప్రతినిధులు తీసుకొన్న చొరవ, ప్రభుత్వ కృషి, సామ్యవాద సమాజ స్థాపన లక్ష్యము, పారిశ్రామిక వేత్తలలో వస్తున్న పరివర్తన మొదలయినవి ఈ సామాజిక బాధ్యతలను అక్షరాలా అందరూ గుర్తించేటట్లు అమలు పరిచేటట్లు చేస్తాయని చెప్పడంలో ఎట్లాంటి సందేహం లేదు.